# శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవిత చరిత్ర

ఇయ్యది తేనెలుచిందు మాటలతో మలభక్తివి ఆబాల గోపాలమునకుఁ జక్కఁగా స్ఫురించునట్లు ముద్రింపఁబడినది. 1954—వ సంవత్సరపు మొదటి ముద్రణమునకు సంబంధించిన గ్రంథము 238 పుటలతో నిండినది. అందు మూలములో లేని కొన్ని కొన్ని ముఖ్యాంశములును, యోగాసన వివరణములును, ఆ యాసనములకుఁ దగిన చక్కని పటములును పొందుపరుపఁబడినది. మొదటి ముద్రణమువలెగాక 1956—వ సంవత్సరపుఁ బునర్ముద్రణము ఉత్కృష్టముగ నుండునట్లు ప్రత్యేక పరిచ్ఛేదములుగ విభజింపఁబడి ఆ యా సందర్భోచితముగఁ జిత్రవిచిత్రములగు రంగులతో నూతనమైన పటములను మిగుల ధనవ్యయముతో నాయత్తపఱచి, పాఠకుల కెంతయు నానందాశ్చర్యములు కలిగించుటయేగాక మనోరంజకముగ నుండునట్లు అచ్చొత్తించి యున్నారము.

ఈ రెండవ ముద్రణమున మొదటి ముద్రణలో లేని యోగాసనముల నింకను మఱికొంత సవివరముగఁ జేర్చి, యోగాభ్యాసకులు ముఖ్యముగా ననుష్ఠింపవలసిన మఱికొన్ని విశేషాంశములను, శ్రీమద్భగవద్గీత, శ్రీమదాంధ్ర మహాభారతము మున్నగు గొప్ప గ్రంథములనుండి సంగ్రహించి 355 పుటలతో నిండిన యీ పొత్తమునందుఁ బొందుపఱచి ముద్రింపఁబడియున్నది. ఇందు మొట్టమొదట శ్రీ వీరబ్రహ్మంగారి చిత్రపటమును, వీరప్పయ్యా యడవిని ఆలమందను గాచుచు గుహలో నాసీనుఁడైయుండి కాలజ్ఞాన గ్రంథమును వ్రాయుచుండు వైఖరిని దెలుపు పటమును, వీరబ్రహ్మముగారు కర్నూలు నవాబుయొక్క సంశయములు దీర్చు పటమును, సిద్దవటనవాబు బ్రహ్మముగారిని బరీక్షింపఁదలంచి వారి యాతిథ్యమునకై తనచేఁ బక్వము గావింపబడిన మాంసాహారములన్నియు శ్రీ బ్రహ్మముగారి మహిమాతిశయముచే ఫలములుగా మాఱుటయును దెలుపునట్టి పటములన్నియు జూచువారల కమితానందాతిశయములు గూర్పకమానవు.

మొదటి ముద్రణమునందలి విషయముల నాద్యంతములుగఁ బఠించి విమర్శించిన భక్తజనాగ్రేసరులకు ఈ రెండవ ప్రతిని సైతము కొని యందు విరివిగాఁ జేర్పఁబడియుండు విశేషాంశములను గూడ కూలంకషముగాఁ బరిశీలించియే తీరవలయునను నాశాపరంపరలు తప్పక కలిగియే తీరును. మొత్తముమీఁద నీ గ్రంథము భక్తి వైరాగ్యజ్ఞానాదుల కాలవాలమై, ముక్తి దాయకమై విరాజిల్లుచున్నది.

కావున నీ గ్రంథము నెల్లరును గొని చదివి యానందాద్భుతరసమున మునింగి పారమార్థిక సుఖంబును బడయుదురుగాక! మానవకోటి కన్ని విధముల నుపయుక్తమైనది. స్త్రీ పురుషు లందఱును జదివియే తీరవలయును. ఈ గ్రంథమునకు పైభాగమున మనోహరమైన మూడురంగుల చొక్కా కప్పును (జాకెట్ కవరు) అమర్చియున్నారము.

వెల 8—50

# నూతన ఆయుర్వేద అలోపతి చింతామణి

1100 పుటలు క్యాలికో బైండు, ఇందు సుమారు 2000 రోగలక్షణములు, అన్ని విధములైన పరీక్షలు, చికిత్సలు, అనాటమి పేటెంటు ఔషధముల ప్రయోగ ప్రయోజనములు, ఉపచారములు, పథ్యాపథ్యములతో సహా కలవు.

వెల 9—00

వెలయువారు:— ఆంధ్రరత్న బుక్ డిపో, తెనాలి.

999 తలలు నరకన

# అపూర్వచింతామణి

రచన: **నాగశ్రీ**




పబ్లిషర్సు

**ఆంధ్రరత్న బుక్‌డిపో తెనాలి.**

ప్రొప్రయిటరు : గ్రంధి లక్ష్మయ్యగుప్త

స్టేషన్‌రోడ్, తెనాలి.





1959

వెల రు. 2-00

# 999 తలలు నరికిన

# అపూర్వ చింతామణి

## మహేంద్రనగరము

శ్రీల కాలవాలమైన భరతఖండంబున మార్తాండపురం బొండు కలదు. అయ్యది దివ్యభవనంబులతోడను–ఉన్నత గోపురంబుల తోడను–భూరి ప్రాకార సముదాయంబులతోడను–విశాలసుందర రాజమార్గంబుల తోడను – పాలగచ్చురాల పరపుతోడను – వివిధ శిల్పకళామందిరంబుల తోడను– మనోహార విహార వనసముదాయంబులతోడను– నిర్మలతోయ పూరిత జలాశయంబులతోడ నొప్పారుచు బహుజన నివాసయోగ్యంబుగ నలరారుచుండెను.

అది పుణ్యకార్యంబులకు నెలవు; దయాదాక్షిణ్యముల కాటపట్టు; భాగ్యభోగంబుల కాశ్రమంబు; పరమానందమున కంబుధి, చాతుర్వర్ణ ధర్మంబుల కాదివాసము. ఆ నగరంబును గూర్చి విధివిధానంబుగ వర్ణింప వలయువన్న నాదిశేషునికైనను శక్యము కాదు.

ఆ పురంబునేలు ధర్మపాల మహీపాలుండు నిరంతర సూనృత వాదియు– సతతాన్నదాతయు– శాంతమూర్తియు– అర్థిజనవత్సలుండును– భక్తిప్రమత్తుండునగుటచే సార్థకనాముడయ్యెను. మరియు నారాజేంద్రుడు బాహుపరాక్రమమూర్తియు, సమర క్రీడావిహారియుగాన వానినెదిరింప నేరక పరరాజులు కేల్మోడ్పులు గావించుచుండిరి. పుణ్యక వ్రతాచరణ లోలుండగుట పాడిపంటలకు కొదువలేక భాగ్యభోగ్యంబులు దులదూగు చుండెను. కరుణామయుడు నిష్పక్షపాతియుగాన నతని రాజ్యంబున సుఖ సంతోషంబులు తాండవించుచుండెను.

అయిననేమి! ధర్మపాలుని వ్రతఫలంబులేమైనవో, అన్నదాన ప్రభావమే కారణంబున దాగియున్నదో; గురుజన ప్రముఖ శుభాశీర్వచ నము లెందువలన రిత్తవోయినవో కాని మార్తాండ పురాధినాథునకు సంతానయోగము లభించలేదు. సంతానమునకై నా మహీవల్లభుండు చేయని దానంబులేదు– సేవింపని తీర్థములేదు– ధ్యానింపని దేవతలు లేరు నోచని వ్రతములేదు.

ఇట్లుండ నొకనాడు వాని యాస్థానంబున కొక ముని యరుదెంచెను. అతండు గంభీరవదనుండును, రుద్రాక్షమాలికాధారుండును; కాషాయాంబరధరుండును; ఆజానుబాహుండును నై చూచువారల హృదయంబుల నాకర్షించుచుండుటచే సభలోనివా రాతని యందమిత భయభక్తుల గన్పరచిరి. ధర్మపాలుండును సింహాసనమునుండి చివాలున లేచి, ముని కెదురేగి, నుచితగౌరవంబున నాహ్వానించి వందనశతంబులతో నొక బంగరు పీఠంబున గూర్చుండ నియమించెను.

అదిచూచి యొకపరిచారిక వింజామరములు వీవదొడగినది-మరియొక దాసి పూజాద్రవ్యంబుల సంసిద్ధజేసినది- ఇంకొక చేటి సుగంధద్రవ్యముల చల్లినది- వేరొక దాసి బంగరుపళ్లెరమును తెచ్చినది. ఆ సమయంబున మహారాణిగారు అంతఃపురమునుండి బయలుదేరి రాజసభ కేతెంచి పన్నీరుతో గలిసిన నీరుపోయుచుండ ధర్మపాలుండా మునినాథుని పాదంబుల కడిగి పూజించెను.

అవ్విధంబున వివిధ సపర్యలు ముగిసిన పిమ్మట నామునిచంద్రుండు ఫలహారంబులు స్వీకరించి శయనించిన పిదప భూపాలుండా సన్యాసి పాదంబుల నొత్తుచు మిగుల వినయంబుమీర "మహనీయా! మిమ్బోలు గురుమూర్తుల దయావిశేషంబున నాకన్ని భోగంబులుగలవు గాని వంశోద్ధారకుండగు తనయుండు మాత్రము లేడయ్యె. స్వామీ! పున్నామ నరకమునుండి తప్పించు పుత్రుడే లేకున్న నెన్ని భోగంబులుండి యేమి ప్రయోజనము? ఏనాటికైన రాజ్య సర్వస్వము నా రక్తస్పర్శగలవానికి గాక పరులకొసంగవలసిన వాడనేగదా? మహామునీ! మీ యపారకరుణా కటాక్షవీక్షణము లీ మందభాగ్యునియందు ప్రసరింపచేసి, పుత్రప్రాప్తిని కలిగించి పున్నెంబుగట్టుకొం"డని పరిపరిగతుల ప్రార్థించెను.

అందులకా బైరాగియు జాలిగలవానిగ లేచి ధర్మపాలునిదరిజేర్చుకొని "ధరణీనాయకా! విచారపడకుము. దైవనిర్ణయమును మించి మనమేమియు చేయజాలముకదా? సర్వేశ్వరుడు నీకు స్త్రీ సంతానము నే యొసంగెను గాని పురుషసంతతి నొసంగలేదు. అట్టితరి నేనుమాత్ర మేమి చేయగలను? అయినను నా శక్తివంచన లేక తపంబు నాచరింతును. నా తపఃప్రభావంబున నీకుదయించిన కుమారియే నీ వంశము నుద్ధరింప గల"దని చెప్పినంత నృపశేఖరు డానందమంది "స్వామీ! నిరుపమ నిష్కళంక నిత్యానందయోగ నిష్ఠాపరిష్ఠులైన మీరు మా రాజ్యమందే-

మా పట్టణమందే స్థిరంబుగ నివశించి మమ్మానందింప చేయుడని ప్రార్థించెను. జటియు రాజేంద్రుని వేడికోలున కానందించి ధర్మపాలుని కోరిక మన్నించెను.

ఆహా! ఏ శుభలగ్నంబున నామహాముని మార్తాండ నగరంబున పాదంబు మోపెనోగాని నాటినుండి యాతనికి రాజసన్మానములు— ధర్మపాలున కప్పటినుండి నిత్యపురాణ కాలక్షేపణలు— మహారాణి కా మునియాశీర్వాదము నొందినదాది గర్భిణీ చిహ్నములు— పురప్రజల కనంత ముదావహప్రసంగములతో నిండిన మార్తాండనగర శోభాయమాన మేమందుము?

మహారాణిగారికి నవమాసంబులు నిండిన పిదప నొకదినంబున సుఖప్రసూతియై సర్వసల్లక్షణ సంపన్నురాలగు నొక్క— స్త్రీశిశువును సలక్షణముగ కనియెను. ధర్మపాలుం డా శుభవార్త విని యానంద బాష్పంబులు జిందుచున్న రెండు నేత్రంబులతో నా పుత్రికను గాంచెను. రాజగురుం డీ శుభవార్త నాలించి రయంబున నమోఘాశీర్వాదములు ముమ్మారులు చేయుచు నా రాకుమారిని గాంచెను. పట్టణంబునగల సర్వప్రజ లమితోత్సాహంబును వెలిబుచ్చుచు నలుదెసలనుండి వచ్చి యా బాలికనుగాంచిరి.

సన్యాసి వచనంబులు సత్యమైనవి. ప్రభువులవారికి పుత్రిక జన్మించినది. స్త్రీ పురుషులకు; బాల వృద్ధులకు; పండిత పామరులకు గూడ యిపుడు బైరాగి యొక భగవంతుడు— తావసి చెప్పినమాట తప్పరాని బాట—జడదారి చేతి తీర్థప్రసాదములే జన్మరాహిత్య సూత్రములు. ఇక రాజదంపతుల కా మునిచంద్రునికన్న మించిన ముఖ్య దైవమే లేదు. కావున వారికి గలిగిన సుకుమారి రాకుమారికి జరుగవలసిన శుభకార్యముల కన్నిటికి నా ఋషీంద్రునే అధ్వర్యము వహించవలసినదిగ కోరిరి.

## నామకరణము

అదేమి సందడి? ఆ మహదానందమునకు కారణమేమి? ఆ కారణము లేని కార్యకలాపమేమి? అందరు తొందర పనులవారే— అందరు నాందోళనపరులే— అందరు నానంద మందినవారె. వీధివీధుల పందిరులు— ఇంటింటను విందుభోజనములు—ఎక్కడచూచిన భజనలు— ఎటుబోయినా నృత్యగానములు— ఎటుచూచిన భూతలస్వర్గం— ఏది తలంచిన బ్రహ్మానందకరం.

అదిగో రాజమందిరము. అది ముత్యాలపందిరి. ఎడలేని సంభావ నలు- కడలేని దానధర్మములు. మరికొంచెము సమీపములోనున్నవారె కవి, గాయక, నృత్య, శిల్ప ప్రముఖులు- వారి కావలనున్నవారె సుర, ముని, గురు, పురోహిత కైవార బృందములు- వారి కించుకదూరంబున నున్నవారె మంత్రి, సామంత, దండనాయక, సేనాధిపతులు- వారికివలగ నున్నవారె బంధు, మిత్ర, దాయ, పరివార సమూహంబులు. ఆహాహా! మంగళహారతు లిచ్చుచున్న ముత్తయిదువులముందు- పూలగురిపించు సువాసినీ సమూహమధ్యంబున, బంగారు పీటలపై- జలతారువలువలు దాలిచి- ఒడిలో బాలికను మరిమరి చూచుకొనుచు కూరుచున్నవారు రాజదంపతులు. వారి కభిముఖముగ నాసీనుడై వేదోచ్చారణ గావించు పూజనీయుడే మార్తాండపురమున కీర్తిలుచున్న తపస్వి! ఆ మహనీయుడే రాకుమారికి "చింతామణి" యను నామకరణము గావించెను. మార్తాండ పుర సార్వభౌములు శ్రీశ్రీ ధర్మపాలచక్రవర్తిగారి కుమార్తె పేరే అపూర్వ చింతామణి.

అపూర్వ చింతామణి దినదినప్రవర్ధమానంబుగ పెరుగుచుండెను. ఆ చిన్నారిని చూచినపుడా తల్లిదండ్రులు చెందు నానంద మేమందుము! ఆ పుత్రికారత్నమును గూర్చి భవిష్యత్కాల భోగంబుల నాలోచించుచు ధర్మపాలుం డెన్నియో యూహాప్రపంచముల సృజించు చుండెను. గాలిమేడలు కట్టుచుండెను. ఆనందసాగరమున తేలిపోవుచుండెను. ఈ బ్రహ్మానంద పారవశ్య మా రాజేంద్రునకే కాదు- మునీంద్రునికి గూడ కలదు. ఈతండును అపూర్వ చింతామణినిగూర్చి యేమేమియో తల పోయుచు-ఆనందించుచు- మైమరచుచుండెను.

ఇటులుండ నపూర్వ చింతామణికి పంచవర్షములు నిండినవి. ఆమెకు విద్యలు గరపు నిమిత్త మొరుల నియమించుట కిష్టములేక భూరమణుండు సన్యాసులవారినే నిర్ణయించెను. ఆ నిర్ణయంబున కఖిల జనంబులామోదించిరి. ఆమోదించక పోవుటకం దసంభవ మేమున్నది? నిజమున కా సన్యాసినగరంబునకు వచ్చిన పిమ్మటనే ప్రభువులవారికి సంతాన ముదయించినది. ఆయనగారే శుభాశీర్వాదములతో నామెకు నామకరణ మొనర్చిరి. ఆ స్త్రీయు బంధువువలె ననుదినము పరామర్శించు చున్న నా మునికంటె ప్రధానమైనవారెవరు? అటువంటి మేధావి- మహా తపస్వి- సర్వశాస్త్ర విజ్ఞానధురీణుడు ఉపాధ్యాయు డగుటకంటె కాదగిన దేమున్నది?

అటులే సుముహూర్తంబున చింతామణిని సన్యాసికడ విద్యాభ్యాసమునకై తలిదండ్రులు లప్పగించిరి. బాలికారత్నంబున కఖిల విద్యాప్రబోధ సేయుట కా జడధారి బాధ్యత వహించెను. అపూర్వ చింతామణి రాజభవనంబులనుండి గురుమఠంబున పాదమిడెను.

కాలక్రమంబున చింతామణికి యవ్వన మంకురించినది. పదునారు వత్సరములునిండి యుక్తవయస్సు పరిపూర్ణమయినది. ఆమె కిప్పుడు పరిపూర్ణమైన దొక్క యవ్వనమేకాదు— సకలశాస్త్ర సారసంగ్రహ సామర్థ్యముగూడ. గురువాక్పరిపాలనైక దీక్షా భావంబునూ ఆమెలో పరిపూర్ణమైనది.

పుష్పవతియైన తరువాత రాచకన్నియలు స్వేచ్ఛావిహారంబులు సేయరాదను సిద్ధాంతము చింతామణిని శాశించినది. సన్యాసులవారు నివసించుటకై కట్టించిన మఠము గ్రామంబునకు వెలుపల భాగంబున నున్నది. ధర్మపాలుం డా నూతనగృహంబును గురువులవారి యభీష్టము చొప్పున ప్రత్యేకముగ నిర్మించి యొసంగిరి. ఆ సన్యాసి మఠంబును జొచ్చిన వారికింక బాహ్యప్రపంచముతో నవసరము లేదన్నంత విశాలమైనదియు— మనోహరమైనదియు— సుఖంబుల నిలయంబైన ప్రదేశంబున నే చిరకాలము విద్యార్థినీదశను గడపిన చింతామణి కా గృహంబు మరపురానిదయ్యెను.

చింతామణి నొక దినంబున నామె వేడుక నెచ్చెలియగు పద్మలతను వెంటనిడుకొని, సర్వాలంకార భూషితయై మహోల్లాసంబున సన్యాసి మఠంబున కేగ యత్నించుచుండ నొక పరిచారికవచ్చి "అమ్మా! మీ అమ్మగారు, నాన్నగారు మిమ్ము త్వరితముగ రమ్మనుచుండి"రని దెలిపెను. అపూర్వ చింతామణియు జననీ జనకుల యాజ్ఞ ప్రకారంబున నేతెంచి నమస్కరింప వా రా ముద్దులబిడ్డను దరిజేర్చుకొని యిట్లు మాటాడ దొడగిరి.

## వివాహ ప్రశంస

ధర్మపాలుడు:— అమ్మా! చింతామణీ!

చింతామణి:— ఏమిటి నాన్నా!

ధర్మ:— తల్లీ! మాకు చాలకాలము సంతానములేక వగచి యుదకు మునీంద్రుని వరప్రసాదంబున నినుగాంచి అల్లారుముద్దుగ బెంచు.

కుంటిమి. అమ్మాయీ! నీకిపుడు యుక్తప్రాయము సమీపించినది. పిల్లలకు యే తరుణమున జరుగవలసిన వేడుక లాతరుణమున జరిపించి ముచ్చటలు చూచుటకు వారివారి తలిదండ్రు లానంద మందుచుందురు. అటులనే నీకిపుడు పాణిగ్రహణోత్సవముజరిపి - మీరిరువురు చిలుకా గోరువంకల వలె కాపురముచేయుచుండ చూచి యానందించవలయునని వాంఛించు చున్నాను. నీ యభిలాష తెలుపుము తల్లీ!

చింతా:- నాన్నగారూ! నేనింకనూ చదువుకొనుచునే యుంటిని గదా! విద్యాభ్యాసమున కంతరాయముగ వివాహమున కంత తొందరేమున్నది? మరికొంతకాలము జరిగిన పిమ్మట నాలోచింపరాదా?

ధర్మ:- చింతామణీ! ఇపుడు నీవిద్యలకు లోటేమున్నది తల్లీ! అదియునుగాక నాకు వార్ధక్యము సమీపించుచున్నది. శరీరములు శాశ్వతములు గావు. ఆరోగ్యములు బాగున్నపుడే నీపెండ్లి వైభవముగ జరుపవలయునని దలంచుచున్నాను. అంతియగాక నీ వివాహముజరిగిన పిమ్మట గాని జయంతునకు యువరాజ్య పట్టాభిషేకము చేయుదలంచుకొనలేదు. యువరాజ్య పట్టాభిషేకమైనపుడుగాని జయంతుడు నా తరువాత మార్తాండపుర సింహాసన మధిష్ఠింపజాలడు.

చింతా:- జయంతుడన మా మామగారేనా?

ధర్మ:- అవునమ్మా! అవును. మీ మేనమామయగు జయంతునకే నిన్నిచ్చి వివాహముసేయ సంకల్పించుకొంటిని. కుమారీ! చింతామణీ జయంతులు - మేనకోడలూ మేనమామలు - బాంధవ్యముచేతనూ అన్యోన్యానురాగలోలురు - రూపయవ్వనంబులం దొండొరులు తగినవారు. మీయిద్దరికి పాణిగ్రహణంబు జరుపుట నుభయవంశంబులకు శ్రేయస్కరమని మీయమ్మయేగాక మన మహామంత్రి మున్నగువారును దలంచుచున్నారు. మాయందరి యభీష్టముననుసరించి నీవు వెంటనే సుద్వాహమాడవలయును.

చింతా:- తండ్రీ! మీ యనుజ్ఞను నేను మీరుదునా? కాని, గురుచంద్రులును, దైవతుల్యులును, మీతరువాత మీ యంతవారునైన మహామునిగారి కీ విషయంబు నివేదించి- వారివలన నాశీస్సులొందరావలదా?

ధర్మ:- పిచ్చి తల్లీ! ఆ మాటకు మేము మాత్రము కాదందుమా! నీ వివాహ నిర్ణయంబున కా మహామునీంద్రుడు మాత్ర మంగీకరింపడా!

అంతయేల ? ఆ సన్యాసి లేకుండ మీకళ్యాణము చేయించమనిననూ నే నంగీకరింతునా ?

చింతా:- అటులయిన నేనిపుడేమి చేయవలయును నాన్నా !

ధర్మ:- పద్మలతతో గూడ నీవు గురుమూర్తులవారిని సందర్శించి; మహోత్కృష్ట కానుక లొసంగి- శెలవుగొనిరమ్ము. ఈ దినమే శుభ ప్రదముగ నున్నది కాన నేడే నీవా పని నెరవేర్చుము.

చింతా:- అటులే చేసెదను.

అని చెప్పి చింతామణి యొక బంగరు పళ్లెరంబునం దమూల్య వస్త్రాభరణాద్యనేకసంభావనలతో సన్యాసి మఠంబున కేగెను. సన్యాసియు రావట్టెనిచూచి "అమ్మాయీ! నేడీ నూతన సంభావనల గొనిరాగతం బేమి?" యని ప్రశ్నింప నపూర్వచింతామణి తిరిగి సమాధానంబు నివ్వ యత్నించియు చెప్పలేక సిగ్గుబడి తలవంచి నిలుచుండెను.

పద్మలత:- మా రాకుమారికి మహారాజులు పెండ్లిచేయ ప్రయత్నమున నున్నారు. అందులకై మీవద్ద నాజ్ఞగైకొనుటకై తమకీ కానుకలు గొనివచ్చినది.

సన్యా:- ఆలాగుననా ? అయిన వరనిర్ణయము జరిగినదా ? ఆత డెవరు ? ఏ దేశపు రాజు ?

పద్మ:- మహనీయా ! మాచెలి మేనమామయగు జయంతుడుండ నితర రాసుతుల నవలోకింప బనియేమి ?

సన్యా:- ఆతనిని వివాహమాడుటకు మీచెలి అంగీకరించినదా ?

పద్మ:- అంగీకరించకపోవుటేమి ? జయంతున కేమయిన లోప మున్నగదా ? ఆతండు మహేంద్ర పురము నేలుచున్న రాజశేఖరుడు - బాహుబల సంపన్నుడు - విజ్ఞాన ధురంధరుడు - నిరుపమాన తేజోనిధి. విశేషించి తల్లితో బుట్టిన శ్రద్ధగలవాడు. అట్టియెడ నంగీకరించకపోవునా ?

సన్యా:- ఆమాటలు చింతామణియే చెప్పరాదా ?

చింతా:- గురుమహాదేవా !

సన్యా:- రాకుమారీ ! నీ వివాహము సామాన్య పద్ధతులలో జరుగుట నాకిష్టము లేదు. భూలోకంబున మునుదెందును కని, విని యెరుంగని గొప్పవిషయంబులతో గావింపవలయునని నాసంకల్పము. ఏమందువు?

చింతా:- గురుమహాదేవా! మీయభిమతమునకు వ్యతిరేకముగ నడిచి యెఱుంగుదుమా? ఈనాడు మాత్రము మీయాజ్ఞను దాటుదుమా? అంతయేల? నాయుద్వాహమంతయు దైవజ్ఞుల నిర్ణయముమీదనే జరుగవలయును గదా?

సన్యా:- ఇది యదార్థమా?

చింతా:- ముమ్మాటికి—

సన్యా:- కల్యాణీ! నేను నియమించిన విధానంబులు నీకు-నీతలిదండ్రుల కొకవేళ బాధాకరములయినచో నీ వాగ్దానము మారిపోవుగదా?

చింతా:- గురూత్తమా! మీరు నా గురుభక్తిని పరీక్షించుచున్నారు కాని నా యానందమున కేల యంతరాయ మొందింతురు? నా తలిదండ్రుల కేల విషాద ఘట్టముల కల్పింతురు?

సన్యా:- చింతామణీ! నీ యభిప్రాయము సమంజసమేగాని, ఒకవేళ నీకేగాదు- నీ తల్లిదండ్రులకు, మీ మామకు, నీ బంధు వ్రాతమునకు తుదకీ భూలోకమున కంతకూ దుస్సహాకరమైన విధానంబులనే శాశింతునను కొనుము. అపుడేమి చేసెదవు?

చింతా:- మీరే అంత నిర్దాక్షిణ్యముగ శెలవిచ్చినచో నేను మాత్రము నా వాగ్దానమును చెల్లించుకొనలేక పోవుదునా? గురుదేవా! నేను స్వీకరించు నా నాథునిమీద ప్రమాణముచేసి చెప్పుచున్నాను. నాగురుచంద్రుని నిర్ణయముల ప్రకారముగ వివాహమాడెదను.

సన్యా:- శెహభాష్! చింతామణీ! ఇక వినుము. నేను నీకు మూడు ప్రశ్నలను దెలుపుదును. నిన్ను పత్నిగ బడయగోరు వాని నా మూడు ప్రశ్నలు ప్రశ్నింపవలయును. వాటికి సరియైన సమాధానమిచ్చిన వానినే నీవు పెండ్లాడవలయును. ప్రశ్నలకు సమాధాన మిచ్చెదనని వచ్చి చెప్పలేక బోయిన వారెవరయినను, కడసారికి నీ మామయినను చేతనున్న కరవాలముచే శిరచ్ఛేదన గావించవలయును. ఆ విధంబున వధించినతలను కోట కొమ్మకు గట్టవలయును.

చింతా:- అదేమిటిమహామునీ! పెండిలాడుటకు ప్రశ్నలెందులకు? చెప్పలేకున్న శిరచ్ఛేద మెందులకు?

సన్యా:- అదినీకవసరము లేదు. నీవు ప్రమాణముచేసి చిక్కుబడి పోయినావు. నాయనుజ్ఞ పాటించవేని నీవుచేసిన ప్రమాణ ఫలితంబుగ

నీభర్త జీవింపడు. అందువలన నా యనుజ్ఞను నిరసించి వైధవ్యమును పొందుటకంటె - నీవాడిన మాటను నిలువబెట్టుకొని కన్యగనుంటయే మేలు.

చింతా:- మహాముని! అందుల కింకేమయినను నియమంబులు గలవా?

సన్యా:- లేకపోవుటేమి? కావలసినంత కథావిధాన మున్నది. వినుము. ఈ మఠమునందే నీనివాసయోగ్యమగు విశాలమందిరంబునొకటి గట్టించుకొని యొకచెలితో నివసించవలయును. చూడదలంచినపుడు మాత్రము నీతలిదండ్రులు వచ్చిపోవచ్చునుగాని వ్రతసమాప్తివరకు నీవు మాత్రము గుమ్మము దాటరాదు. నామఠంబుననుండి భూగర్భమునందొక రహస్య మార్గముండవలయును. ఆ సొరంగ మొక యామడ దూరమై చివర యూరికావలనున్న పర్వత గుహాలోనికి కలియవలయును. ఆపర్వతగుహాద్వారము తెరచుటకు మాయుట కనుపుగనుండ వలయును. మరియును నీవు నివాసముండు మందిరంబునకు ముందొక గమ్యప్రదేశ ముండవలయును. అందు బల్లకూర్పుచేసి దానిపై సింహాసనముంచి నీవా పీఠంబున నాసీనవై రాకుమారుల ప్రశ్నింపవలయును. నీవు కూర్చుండు వేదిక కెదురుగ నొకస్థానంబును నియమించి అందా రాకుమారుడు నిలువంబడి నీ ప్రశ్నలకు సారాంశము దెలుపవలయును. ఆప్రత్యుత్తరంబులను నేను స్వయముగ వినవలయునుగాన నీవు కూర్చుండు బల్లపరపునకు క్రిందిభాగములో నేనుందును. వానియుత్తరములు సరియైనవి కానిచో నేను చక్కలను చప్పుడగునటులు తట్టెదను. నీవాశబ్దమాలించిన తోడనే యొకించుకయు సందేహింపక వానిని ఖండించితీర వలయును. అపూర్వచింతామణీ! మనముండు మఠంబున కెదురుగ నొక దీర్ఘసంభ మును నాటించవలయును. దానిచివర నొక గంటను కట్టించవలయును. ఆగంటకు సంబంధమునుంచి యొకయినుప గొలుసును క్రిందికి విడువ వలయును. నీ ప్రశ్నలకు సమాధానంబు చెప్పెదనని వచ్చిన ధీరుడు ముందాగొలుసును లాగినచో గంటమ్రోగును. గంటమ్రోతవలన మన మాతని రాక నెరుంగ వలయును. అట్లు సాహసించినవాడు పారిపోకుండ చూచుటకందు పికభటుల నిద్దరిని కాపలా యుంచవలయును.

చింతా:- మహాముని!

సన్యా:- మరేమియు మాటాడవలదు. వెళ్లు, శీఘ్రంబుగ వెళ్లి నాయాజ్ఞను నెరవేర్చునట్లు ప్రవర్తిల్లుము. ఇదినాశెలవు.

అని చెప్పి చింతామణి చెప్పు తిరుగుసమాధాన మాలకించకయె సన్యాసి చరచరా లోనికిపోయెను. చింతామణియు పెక్కుకాలంబు దుఃఖించియు చేయునదిలేక కొయ్యబొమ్మవలె నిలిచిపోయెను. పద్మలతయు విచారించుచు నెచ్చెలినిజేరి "చింతామణీ! తానొకటి దలంప దైవమొకటి దలంచె"నన్న సామెత మనయందు సార్థకమైనది. విధి విధాన మిటులుండ మనముమాత్ర మేమిచేయగలము! రమ్ము, ఇంటికి వెళ్ళి మీ జననీజనకుల కీవార్త నెరింగింతమని యూరట బుచ్చుచు రాజాంతిపురంబునకుం గొంపోయెను.

పాపము ధర్మపాలుడు సన్యాసిచెంత కేగిన తనకుమారి విజయవంతముగ శుభాశీస్సులనొంది వచ్చుచున్నదను నమ్మికతో భార్యా సమేతంబుగ చింతామణి రాకకై యెదురుచూచు చుండెను. ఆ రాజేంద్రుండు తలంచినటులు రాజపుత్రి తిరిగివచ్చినది కాని యామె ముఖకాంతి నశించి పోయినది. ఎంత మహదానంద మా కుమారి వదనారవిందమున తా నవలోకింప భావించుచుండెనో అంత విచార మా తనయ మోమున వీక్షించెను. మనుజవిభుని మనంబు పరిపరి తెరగుల పరితపించ దొడంగెను.

ధర్మపాలుండే మెల్లగ చింతామణిని సమీపించి "అమ్మా! ఎందుల కిటులుంటివి? గురుచంద్రు డేమనియెను? నీ విచారమునకు కారణంబెద్ది యని యెంతగ బుజ్జగించుచున్నను యామె బదులాడక నేడవ నారంభించెను. అదిచూచి మహారాణికి కర్తవ్యము తోచక పద్మలతను చూచి "పద్మలతా! చింతామణి యిట్లు వాపోవుట కేమి హేతువో నీవయిన దెలుపు"మన నామె మనంబునగల విచారమును దిగమ్రింగుకొనుచు నిట్లు నుడువదొడంగెను.

మహారాణీ! మే మిరువుర మా సన్యాసిని సమీపించి- కొనిపోయిన సత్కారముల నొసంగి- వైవాహిక ప్రయత్నంబు నెరింగించి- యనుజ్ఞ నొసంగమని ప్రార్థించితిమి. అందులకాముని కపటవాత్సల్యంబున ప్రసంగించుచు- మనంబునగల కుచ్చితంబును కప్పిపుచ్చి- నీ పాణిగ్రహణంబు నూతన విధానంబులతో నా యిష్టమునకనుసరించి చేయదలంచితిని, దానిని పాటింతువాయని ప్రశ్నింప మనచింతామణి వల్లెయన్నది. ఆ మాట నాధారంబుగ గైకొని గురువులవారు "నేను నియమించిన విధానంబు మీ

యందరికి వెగటుగ దోచునేమొ” ననిరి. ఆమాటకు సమాధానంబుగ రాకుమారి “మహనీయా! నిరంతర రాజకుటుంబ శ్రేయస్కాములయిన మీ రక్షల దెలుపుదురను మాటల పట్టింపులో “కాబోవు నాథ సర్వమీద ప్రమాణముచేసి చెప్పుచున్నా”నని యుద్ఘాటించినది.

అంత నా సన్న్యాసి తానేమొ మూడు ప్రశ్నలు చెప్పెదననియు, రాజపుత్రిని స్వీకరింపవచ్చిన వాడా మూడు ప్రశ్నలకు ప్రత్యుత్తరమీయ వలయుననియు, సరియగు సమాధాన మీయజాలకున్న నా వరుండెవం డయినను యుపేక్షింపక శిరచ్ఛేదన గావింపవలయుననియు, అందుకు దగిన నూతనమందిర నిర్మాణక్రమమంతయు భయంకరముగ వివరించెను. మహారాజ దంపతులారా! జరిగినయుదంత మిద్దియని దెల్పెను.

పద్మలత నోటినుండి యీ మాటలు వినుచుండ రాజదంపతుల గుండియలు బ్రద్దలైపోయినవి. హరిహరీ! ఇదియేమి ఖర్మము? ఇంత కాలము సంతానములేక చింతించి చింతించి చివర కిపుడీ చీకునొందదగిన దురదృష్టమేమి? ఓ మునినాథా! నీవు మాపాలిట భగవత్స్వరూపుండవని పూజించుచుంటిమే—మీ వాక్ప్రభావంబుననే మాకీ పుత్రికారత్న ముద్భ వించినదని నిన్ను కొనియాడితిమే—ఆమెకుం జేయదగిన నామకరణమంది విద్యాభ్యాసములన్నియు నీచేతుల మీదుగ జరిపించితిమే – ఈ సమయం బున నామె కరగ్రహణ మహోత్సవంబును మీకెరిగించి చేయుదలం చితిమే! మహామునీ! పాలుపోసిన నీ చేతులతో విషము పోయుదువా? చింతామణి శ్రేయస్సు మాకేగాని నీకక్కరలేదా? సంతోషమందదగిన మాకీసమయంబులో సంతాపమును గూర్చితివా? అని దుఃఖింపసాగిరి.

కొంతకాలంబునకు ధర్మపాలుండించుక ధైర్యంబు దెచ్చుకొని మహారాణిని చూచి “ప్రేయసీ! ఎంత విచారించి మాత్రము మనమేమి చేయగలము? సంతానములేకున్న నొకటియేచింత – ఇప్పుడనేక విధం బుల చింత. మన మా మునివరేణ్యుని యాన దొలంగుదుమేని నాతడేమి శపించునో? అట్లు జరుగునేని యొకవేళ సామ్రాజ్యమునకే కీడువాటిల్ల వచ్చును. ప్రజాక్షేమమునకై ప్రభువులు తమసౌఖ్యంబులనేనియు పరిత్య జింపక తప్పదు. ఇంతకు విధివిధానమెటులున్న నటులగుననియోదార్చెను.

తరువాత నారాజు సన్న్యాసినింజేరి యాతని యిష్టానుసారంబుగ నూతనగృహ నిర్మాణంబులు గావించెను. బైరాగి వచించిన పద్ధతు లన్నింటిని శిరసాధరించి యచిర కాలంబున పూర్తిగావించి, అందు

కావలసిన సమస్త పదార్థంబులను సమృద్ధిగ భద్రపరచి నిర్ణీత కాలంబున చింతామణిని, పద్మలతను జడదారి మఠంబునకు శుభలక్షణంబులతో పంపించెను. ఆసమయంబున నొక్క సన్యాసిదప్ప కంటతడిపెట్టనివారు లేరు. కాని అది రాకుమారి కపజయమను భయంబున వారందరు గ్రుడ్లనీరు గ్రుడ్ల గ్రుక్కుకొనిరి.

## జయంతుడు

దయానిధి మహీనాథుండు సార్థకనాముడైన దయానిధియే. ఆ రాజన్యుడేలు మహేంద్రపురి నిక్కముగ మహేంద్రుడేలు స్వర్గపురమన నొప్పారు చుండెను. ఆ మహనీయుని ధర్మపత్నియు మహాప్రతివ్రతా లలామయై రాణించు చుండెను. కొంతకాలంబు గడచిన పిమ్మట నా దయానిధికి యిందుమతి యను కుమార్తె గలిగెను. మరల రెండవగర్భంబున జయంతుడను కుమారుడు ఉదయించెను.

తేజోరాసియు - రాజలక్షణ సంపన్నుడును - వంశోద్ధారకుండు నగు పుత్రోదయమానందదాయకమేగాని దయానిధి ధరాధిపతికి భార్యావియోగము సంభవించినది. పాపమాతల్లికన్నకుమారునయినను కనులార గాంచినదో లేదోకాని పురిటిలోనే సాధ్యపడని జబ్బుదయిరాచి ప్రాణంబుల గోలు పోయినది.

పురిటిలోనే తల్లిని గోల్పోయిన జయంతుడును, వానిసోదరియు దాదుల చేతులలోనే పెరిగిరి. దయానిధియు మరల వివాహ మాడినచో తనబిడ్డలకుందగిన పోషణ లభింపదని దలంచి ద్వితీయ వివాహంబును పరిత్యజించెను. తల్లిలేని కొరత పిల్లల కొదువనీయక తానే స్వయముగ శిశుపోషణాభారము వహించెను.

ఏదియెటులయినను కాలచక్రముమాత్రముయథావిధిగ తిరుగుచునే యుండునుగదా! దానిని నిలుపు వారెవరు? అవ్విధంబున కొంతకాలము జరుగ నిందుమతి యుక్తప్రాయంబునొందెను. ఆమె రూపలావణ్యంబుల గాంచి సాటిరాసుతుల నేకులు దయానిధి రాజేంద్రునితో సంబంధముసేయు రాయబారము లంపుచుండిరి. వచ్చినవారందరిలో నుత్తమ రాజవంశీయుడును - అరిజన భయంకరుండును - నిరంతర సూనృత వాక్పరిపాలనా లోలుండును - వినయగుణ సాంద్రుడైన ధర్మపాలుడే తనకన్ని విధముల

నల్లుడు కాదగిన వాడని నిర్ణయించి నొకసుముహూర్తమున నిందుమతీ ధర్మశీలుర పాణిగ్రహణ మహోత్సవ మతి వైభవముగ గావించెను.

పాలుంజక్కెర కలియునటుల; శుకపికంబులజంటవోలె; కుసుమ మధుమక్షికములగతి– నన్యోన్యానురాగ బద్ధులై – ఆనందమయ జీవులై– ఆదర్శదంపతులై– యిందుమతీ ధర్మపాలురెంతయు నలరారుచుండిరి. వారొక దినంబున తమ సుందరోద్యానమున పెద్దయు గాలము విహరించి, పూపొదరిండ్ల చుట్టును దిమ్మరి, సరసవినోదక్రీడల నొకించుక సొమ్మసిల్లి శిలావేదికపై కూర్చుండియుండ నొకభటుడరుదెంచి "ప్రభూ! మహేంద్ర పురంబునుండి దయానిధి మహారాజులవారి పనుపున నొకవార్తాహరు డరుదెంచి దేవరదర్శనార్థము వేచియున్నాడని తెలిపెను.

భటుని వెంటనే రమ్మనుమని యాజ్ఞాపించిన ధర్మపాలు డిందుమతి వంక జూచెను. పుట్టింటినుండి మనుష్యులేతెంచిరను మాట విన్నపుడు సహజముగ స్త్రీలకుండు సంతోష మామె వదనంబున కానరాకుండు టాశ్చర్యకరము. అతడట్లు చూచుచుండగనే "నాథా! మాతండ్రిగారి పనుపున దూతవచ్చెనన్న మాట చెవినిబడినంతనే నాకెందులకో గాని భయముగనున్న" దనెను. ఇంతలోనె మహేంద్రపురవాసియు సమీపించి, నమస్కరించి "ప్రభూ! మా దయానిధి రాజేంద్రులవారు ప్రాణాపాయ స్థితినందుండిరి. వారీ పర్యాయము జీవించుట దుర్లభంబని వైద్యులధైర్య పడుచున్నారు. ఇందుమతీ మహారాణితోగూడ మిమ్ము వెనువెంటనే రమ్మని మహామంత్రులవారు వార్తనంపించి"రని బలికెను. ఆ మాటలు విన్నంతనే ధర్మపాల మహీపాలుండు ధర్మపత్నీ సమేతంబుగ పయనంబై మహేంద్రనగరి కరిగెను.

మహేంద్రపురమంతయు విచారమయమై యున్నది. రాజుగారి కోటముందు ప్రజలు తండోపతండములుగ మూగియున్నారు. దయానిధి మహారాజులవారు మనకింక దక్కరను వదంతి మారుమ్రోగుచున్నది. ఇంతలో నతిరయంబున వచ్చినరథము గభాలున నిలచిపోయినది. ఎరిగిన వారారథము ధర్మపాలునదేనని వక్కాణించిరి. సందేహమేమున్నది ? ఇందుమతీ ధర్మపాలు రారథంబునుండి దిగి ప్రజలనుండి దారిచేసుకొని రాజాంతఃపురములో ప్రవేశించినారు.

తండ్రిగారిని చూచినతోడనే యిందుమతి హృదయములో దాగి యున్నదుఃఖమాగలేదు. బాపురుమంటూ తండ్రినిసమీపించిన యిందుమతి

శిరంబు నతి వాత్సల్యముతో నిమిరి దయానిధి ధర్మపాలుని జూచి "నాయనా! ఇదివరకే లేచిపోవలసిన నా ప్రాణములు మీ యిద్దరిని చూచుటకే యీ బొందిలో యింతదనుక నిలిచియున్నవి. నా స్వర్గలోక ప్రయాణమున కింక వ్యవధానములేదు కాన యీ కొద్దికాలములోనే నీకుం జెప్పదగిన విషయంబులున్నవి. వినయవిధేయతలుగల నీవు నా యభిలాష కొనసాగింతువని నమ్ముచున్నాను" అనెను.

ఆమాటలు ముగియకుండగనే ధర్మపాలుండును దయానిధిని "మామగారూ! మీ యాజ్ఞ నేనాడయిననూ నిరసించితినా? మీకా సందియమేల? తమ మనోగతమందున్న విషయమెద్దియో శెలవిండు. తప్పక నేనాకార్యమును సాధించి మీమనశ్శాంతి చేకూర్చెద" ననుచు ప్రక్కలో కూర్చుండెను.

సంతోష సంతాపములు మనంబున పెనగొన మహేంద్రపురాధిపతి మెల్లగ హస్తంబునెత్తి దీవించుచు "ధర్మపాలరాజా! నీయత్తగారింటి విషయంబులు నీకు క్రొత్తలుగావు. తల్లిలేని కొరత తెలియకుండ నీభార్యను, నీమరదిని పెంచిన నేను నేటితో భూలోక సంబంధబాంధవ్యములకు దూరమగుచున్నాను. దైవానుగ్రహమున యిందుమతి యొక యింటి కోడలైనది. అందునూ సర్వసల్లక్షణ సంపూర్ణుండవగు నీవు భర్తగ లభించుట దాని యదృష్టము. అందునుగూర్చి నాకేవిచారము లేదుగాని జయంతుడు పసివాడు. అతనిని దిక్కుమాలినవానిగ చేసి నేను పోవుచున్నాను. ఇకమీదట బావవయినను, తండ్రివయిన నీవే అతని భారము వహించ వలసినవాడవు అని చెప్పటానికే తహతహపడు తున్నాన" నెను.

ఆమాటలు వినినవారందరు కన్నీరు బెట్టుచుండ ధర్మపాలుని మాట వేరుగ చెప్పనదేమున్నది? చివాలున మామగారి చేతులు పట్టుకొని గద్గదస్వరముతో "మరేమియు విచారపడకండి. ఇకమీద జయంతుని నాప్రాణప్రదముగ చూస్తాను" అని వాగ్దానము చేయుచుండ గనే దయానిధి మహారాజుగారు మృతినొందిరి.

తరువాత వేదోక్తముగ దయానిధికి నంత్యక్రియలు పూర్తిచేయించిన ధర్మశీలుండు కొంతకాలమందేయుండి దైవజ్ఞులు నిర్ణయించిన నొక సుముహూర్తమున జయంతునకు మహేంద్రనగర రాజ్య పట్టాభిషేకంబు గావించెను. ఆపిమ్మట యొకనాడు నిండుపేరోలగంబున నిల్చి

"సభాసదులారా! పూజ్యులయిన మా మామగారు స్వర్గస్థులగునపుడు నాభుజస్కంధములపై మోపిన భారమేదియో మీకందరకును తెలిసినదే కదా? అందుకై జయంత పట్టాభిషేకమువరకిందే యుంటిని. నేనింక మార్తాండపురమునకేగుచున్నాను. మరియు బావమరిదియగుజయంతునకు కన్యాదానముచేసి సంతోషింప జూచితిని కాని భగవానుడు నాకు సంతానమే యొసంగకపోవుటచే నాముచ్చటలు చూచుకొనలేకపోయిన మందభాగ్యుడను. అయినను త్వరలో వానికిం దగిన నుత్తమరాచకన్ని యను వెదికి వివాహముచేయ ప్రయత్నములోనున్నాను. మీరందరు మీప్రభువుయందు భక్తిశ్రద్ధలుగలిగి పూర్వము దయానిధి మహారాజు వారి పాలనలో వలెనే హాయిగనుండ గోరుచున్నాను. అనివక్కాణించి భార్యా సమేతముగ స్వరాజ్యమున కరుదెంచి యెప్పటివలె మార్తాండ పుర మేలు చుండెను.

ఆతరువాత సన్యాసి మార్తాండపురము చేరుటయు - ధర్మశీలున కాడు సంతానముదయించుటయు - జయంతునికి భార్యపుట్టినదని బంధు గులలో వదంతి రేగినది. అందుకు తగినట్లు మేనమామకు తగిన మేన కోడలు - మేనకోడలుకు తగిన మేనమామ. అన్నివిధముల వారు దంపతులు కాదగినవారు. అన్నిటికితోడు వారిలోవారికి పరస్పరాను రాగంబులుగలవు. ఇంతకు ముందు ధర్మశీలమహారాజుగారుకూడ చింతామణిని జయంతున కిచ్చుటకే స్థిరపరచిరి.

ఎవరెన్ని ప్రయత్నములుచేసి యేమి ప్రయోజనము? దైవయోగ ము ప్రతిఘటించినది. వేడుకతో చేయదలంచిన చింతామణీ వివాహము విషాదములో మునిగిపోయినది. ఈవార్త జయంతునకు తెలియ చేయ వలయునన్న ధర్మపాలునకు నోరాడుటలేదు. పెళ్లిప్రయత్నమున నుండు మని కబురంపిన బావగారు తిరిగింతవరకు తటస్థముగ నున్నందులకు జయంతుడు దీర్ఘాలోచనలు చేయుచున్నాడు. అంతకంటే తానే స్వయముగ అక్కాబావలవద్దకు వెళ్లిరావటం మంచిదన్న సిద్ధాంతముతో మార్తాండ పురమునకుంబోయెను.

ఇందుమతీధర్మపాలుర మనస్సు లీ జయంతుని చూచిన తోడనే వెనుక ముందులాడ జొచ్చినవి. జయంతుడే స్వయముగ వచ్చినందుకు సంతోషము - జరిగినది చెప్పలేకపోయిన సంతాపము దంపతుల నెంతయు బాధించినది. ఏది యెటులున్నను ముఖ్యబంధువులకు జరుగదగిన

మరియూపలకు లోటు యుండదు గదా? అందరు స్నానములుచేసి, భోజనములుచేసి, విశ్రాంతిగ వచ్చాళించిన పిమ్మట వారి కీ రీతి సంభాషణలు సాగినవి.

జయం:- సోదరీ! ఈ స్వల్ప విషయమునకై యింతచింతింప వలయునా? అయినను నేనుమాత్రము చదువని కావ్యములేమున్నవి? ఆ సన్యాసి మాత్రము లోకములోలేని ప్రశ్నలేమి యడుగును? ముష్టిమూడు ప్రశ్నలకు సమాధాన మనినచో మీరింత భయపడు చున్నారా?

ఇందు:- అవును నాయనా! భయపడక పోవుటెట్లు? ఆప్రశ్నలు సామాన్యములయినచో సన్యాసి వాటికటువంటికట్టుదిట్టములేల చేయును? అదియునుగాక బైరాగి సామాన్యుడుగాడు.

జయం:- సన్యాసి సామాన్యుడు కాకపోవచ్చును. అసాధారణ ప్రతిభాసంపన్నులసత్యములను రారుగదా? అందును గురించి మనకీ సందియమక్కరలేదు. బావగారూ! నేను చదువని గ్రంథములేదు. ప్రపంచమున నాచే భేదింపరాని ప్రశ్నలేదు. మీరీ విషయమై విచారపడు నవసరమెంతమాత్రములేదు. నేను చింతామణి ప్రశ్నల విప్పుటకు చింతామణి కరంబు చేపట్టుటకు, నాలశ్యమేమియూ లేదు. లెండు, త్వరితముగ బోవుదము.

ధర్మ:- జయంతా! మనకెంతశక్తిసామర్థ్యములున్నను సాంగోపాంగముగ సందర్భ మర్థము చేసికొనక సాహసించరాదు. కత్తిబట్టి నూర్వురు శత్రురాజుల నోడించుటకన్న సమకట్టి యొక జడదాటి నెదిరించుట కడుంగడు దుర్లభము - అంతియకాదు. ఒకప్పుడు ప్రమాద కారణముగూడ కావచ్చును.

జయం:- బావగారూ! ఈసమయములో మీరు నా కధైర్యమును చెప్పకుడు. మనము సన్యాసి నియమంబును కాదనలేదు- ఆయనగారికి యిచ్చిన వాగ్దానమును మనచింతామణి నిరసించుటలేదు. ఇట్లు చేసితివేమని మన మా సన్యాసి నెదిరించుటలేదు. తానుకోరినప్రశ్నలను సమర్థించెదమనుచున్నాము. సమాధానమిచ్చిన పిమ్మట సక్రమముగ వివాహము జరిపించెదమనుచున్నాము. ఇందులో చేయరానివని చేయ సాహసించిన గదా గురువులవారు కోపించుట? కోపమందినచో శపించెదరేమో నని కుందవలసి వచ్చుట? శాపమిచ్చిన సమూలముగ హరింతుమేమోనని భీతిచెందుట?

ధర్మ:- జయంతా! నీవు చెప్పిన దంతయు యథార్థమే. కాని ప్రశ్నలు సామాన్యమైనవి కావని నాయభిప్రాయము. అదియునుగాక సన్యాసి ప్రశ్నలకు సమాధానము నీయలేనియెడల, యుపేక్షచేయుటగాని, గడువొసంగుటగాని లేకపోవుటయేగాక మరుక్షణంబున శిరచ్ఛేదన గావింతురు. అందు తనవారనియు, పరవారనియుగూడ నాలోచించుట కవకాశము లేదు.

ఇందు:- తమ్ముడూ! ఇంతకాలము సంతానములేక తపించినాము. ఇప్పుడీ యవాంతరము సంభవించినందులకు చింతించు చున్నాము. నాయనా! కన్నకూతురెటులూ మాకు ఋణములేదని మామనస్సులలో నమ్మినారము. రక్తపుశ్రద్ధగల తోబుట్టువవు నిన్నునుగూడ యెటు లాముని రూపరాక్షసుని పొట్ట బెట్టగలము ?

ధర్మ:- మరదీ! మానాన్నగారి కిచ్చినమాట ప్రకారము నీవేమాకు బిడ్డవని యేనాడో భావించితిని. ఆనాటి సంకల్పమె నేటికి సత్యమైనది. చింతామణి నాకసలు పుట్టలేదని అనుకొన్నాను. నీవును అటులేదలంచి మరొక రాసుతను పెండ్లాడుము. ఆవిధమున నైనను మనయుభయ వంశములు ధరపై నిలువగలవు.

ఇందు:-పోనీ తండ్రీ! మొదటలో నీకుపరాయిసంబంధమే చేయదలంచి తిమిగదా? మధ్యగలిగిన చింతామణిని మధ్యనే మరచిపోయి, ప్రథమనిర్ణ యమె పాటించుటమేలు.

జయం:- రాజదంపతులారా! మీరుపదేశించు శాంతివాక్యములు సర్వభోగముల త్యజించి, వనములలో ముక్కు మూసుకొని కూరుచుండు మునీంద్రులకు కావలయునుగాని, కామించినదాని ననుభవించు నాబోటి రాజపుత్రులకు పనికిరావు. మీరుపదేశించినట్లు నేనా పరీక్షామందిరమున నుత్తీర్ణుడకాలేక పోయిన నేరముక్రింద మరణించుటయే సత్యమను కొందము. నాకా యకాల మరణమే బ్రహ్మలిఖించియున్న మరొక రూప మున నేనియు సంభవింపదా? అట్టియెడ పిరికిపందనై యీవిధముగ వృథామరణ మందుటకంటె సన్యాసి శాసనము ననుసరించి సమయుటయే శ్రేయస్కరము. మరియును చింతామణిని కామించిన నామనం బన్య కాంతల వరింపజాలదు. ఈ విధంబున నిందు తపించుటకంటె నా కార ణంబున గతించు టుచితంబని తన దృఢ సంకల్పము దెల్పెను.

అప్పైన రాజదంపతులేమియు మారుపలుక నేరకపోయిరి. ఇంతకు దైవయోగము నెవరు తప్పింతురు? జయంతు డింతకూ తనపంతంబు రవ్వంతయు విడువనందుకు చింతించిరి.

## ప్రథమ శిరచ్ఛేదము

అప్పుడె సూర్యోదయమైనది. అపూర్వచింతామణియు, పద్మలతయు నిద్దురలు లేచి, కాలకృత్యములు దీర్చుకొని దైవధ్యానము సేయుచుండిరి. వారికాదైవ ప్రార్థన పూర్తికాకముందే చెవులు గింగురు మనునట్లు గణగణధ్వనులు వినబడెను.

భయదాశ్చర్య సంతోషంబున పులకితదేహియై ధ్వనిని నిదానించి యాలించెను. ఆహా! నేడెంతటి సుదినము? ఆరు మాసములకు పూర్వము తాను శాసించిన విధంబుగ ప్రశ్నలకు సమాధానమొసంగి తన్ను వివాహ మాడుటకై రాకుమారుడరుదెంచినరోజు. ఈ సన్యాసి బంధములనుండి తొలగించి సంసార బంధములజేర్చు కొనుటకై నిజప్రాణంబుల నేనియు లక్ష్యము సేయని యా సుందరాకారు డెవ్వడైయుండునో యని చింతామణి డెంద మూందోళన మందజొచ్చినది.

చింతామణి చిత్తప్రవృత్తి నెరింగిన పద్మలత దరిజేరి "సఖీ! నీకీ యనుమానమేల? నేబోయిచూచివత్తునని రయంబున బరువెత్తి రాకుమారుని చూచి వెనువెంటనే తిరిగి వచ్చినది. పద్మలత బైటకు పోవునప్పటి ముఖవైఖరికి తిరిగివచ్చినప్పటి ముఖవైఖరికి చాలమారుపున్నది. కాని పద్మలత ముఖంబున నిట్టి క్రొత్తదనమునకు కారణమేదియో చింతామణి యూహింపలేక పోయినది. అంతయేల? పద్మలతయు నావచ్చిన యువకుండని చెప్పకుండ యుండలేకపోవుచున్నది – అటుచెప్పుటకు చేతగానిదైనది.

ఎట్టకేలకు పద్మలత "అమ్మా! ఆవచ్చినది మీామేనమామ జయంత మహారాజుగారని చెప్పినది. ఆ మాటలు చెవిని బడుటతోడనే "ఆహా! నామీాది మమకారంబుచొప్పున మామామగారేవచ్చిరిగదా యనుసంతోషంబున యొడలు గగుర్పొడిచినది. ఆగగుర్పాటునందే మరల మామగారి సమాధానములు చెప్పలేక పోయినచో నాచేతులతోడనే తలతీయవలసి వచ్చునేమోయని భయమందెను.

ఆసమయంబున సన్న్యాసియు చింతామణి యున్న మందిరమున కరుదెంచి "రాజపుత్రీ! ఎవరో నీప్రశ్నలకు సమాధానమిచ్చెదనని వచ్చి గొలుసులాగుటచే కలిగిన గంటారవ మాలకించితివిగదా? శీఘ్రంబు లేచి ప్రస్తావనా వేదిక మీదికిరమ్ము. నేనాతనిని రప్పించుచున్నాను." అనిచెప్పుచున్న గురువులవారి పాదములకు కరంబులుమోడ్చి "మహాత్మా! ఆవచ్చినది మామామయని మనపద్మలత చెప్పినది. ఆతండు నాయందపరిమితానురాగి - నాసౌఖ్యానందములకై యెట్టి సాహసమునైన చేయగల త్యాగి - నాతల్లి తోబుట్టిన బాంధవుండు. ఒకవేళ నాతడీ కార్యంబున సఫలుండుకాకపోయినచో నాచేతులతో వానిశిరంబు దునుమలేను. నేను తెగవేయలేకపోవుటగాక మరొకరు ద్రుంచుచున్నను చూడలేను. గురు మహామునీ! మీయాజ్ఞానుసారము సర్వత్యాగముచేసిన శిష్యురాలి ప్రార్థన లాలకించి శాసనమున కేదయిన సవరణసేయు" డని వేడుకొనెను.

అందులకా సన్న్యాసి మహోగ్రహాంబున మండి పడుచు "చింతామణీ! రాజశాసనముగాని, సన్న్యాసి సిద్ధాంతముగాని సమయానుకూలముగ సవరణచేయునదికాదు. మరియును బంధువులకొక శిక్షయు, బయటివారికి మరొక దండనము విధించుట న్యాయవిరుద్ధము. న్యాయబద్ధముగ విచారించినచో మన నిర్ణయము మార్చనవసరములేదు. ఏలనన? ప్రశ్నలకు సమాధాన మిచ్చినచో నిన్నిచ్చి కల్యాణముసేయుదు మనియు, సరియైన ప్రత్యుత్తరము లివ్వకున్న నీచేతి కరవాలముచే కడదేర్చెదమని మనము చేసిన తీర్మానము రహస్యము కాదుగదా? అట్టిచో ఆతడది యెరింగియే యీసాహసమునకు వచ్చినపుడు మనమెట్లు దోషులమైతిమి? అదియునుగాక మనప్రశ్నలను తాను సమర్థించిననాడు నిన్నువివాహము నాడక యున్నకుండునా? అట్టియెడ జవాబులుచెప్పలేనినాడు వానినివధించక మాత్రము విడుచుటెట్లు? మరియు ప్రాణములమీదింత తీపియు, మరణమన్ననంత భీతియుగల నీమేనమామ నానిర్ణయమును, నీనియమంబును, మీనాన్నగారి శాసనమును నిరసించుట దూష్యముకాదా? అట్టి దోషమునకేక్రొత్త దండనయో విచారింపక తొలుతనే నియమించిన విధానమును జరిగించుటలో మనతప్పులేదుగాని ఆడినక్రమముదొలంగుట తీర్మానవిరుద్ధమగునుగాన మారుపల్కక వేదికమీదికొచ్చి కూర్చుండుమని కఠినముగ దెల్పి చరచరనడిచి వెళ్లెను.

అపూర్వ చింతామణియు విధిలేక తనగద్దియ నెక్కి కూర్చుండెను. సన్యాసి తనగమ్యప్రదేశమునదాగి యుండెను. జయంతుడు తనకు నియమించిన వేదికపై నిలుచుండెను.

చింతా:- మామగారూ! కారణాంతరములచే మనవివాహంబునకు దూరమై నేనిట్లు చేయవలసి వచ్చినందులకు పశ్చాత్తాపమందుచున్నాను. గత చరిత్రనంతయు అమ్మానాన్నగారలనోట మీరువినియే యుందురు. ఆ కఠిన హెచ్చరికల నెరంగియు మీరు సాహిసించిరి. శాసనాధికారము మీకొకరీతియు వేరొకరి కింకొకరీతియుకాజాలదు. ఆసమయంబున మీసేవ చేసితరింతమనుకొన్న నాచేతులతోడనే మీశిరము నరుకక నాకుతప్పదు. నేనడుగనున్నప్రశ్నలుకావ్యానుభవమునకు, లోకానుభవమునకు మించినవి కాన మీరు కృతార్థులుకాజాలరు. అందువలన దయయుంచి నాప్రశ్నల వివరించకముందే మీతలంపు మార్చుకొందురేని యెట్లైనను మాగురువు గారిని ప్రార్థించి మిమ్ము విడిపించెదను.

జయం:- పిచ్చిదానా! ఆభయము నీకు గాని నాకు లేదు. అపజయమిందు మీగురువునకేగాని నాకుగాదు. ఇంతగ ప్రగల్భములాడిన నీప్రశ్నలకు బదులు చెప్పినపుడు నీవు సిగ్గుపడకతప్పదు. ఆసిగ్గులోనే నీవు పెల్లికూతురువైన సిగ్గుగూడ పొందెదవు.

చింతా:- వరుసలాడుటకు, వరుసదప్పి మాటాడుటకిది తరుణముగాదు ఇప్పుడు నీవునాకు మేనమామవుకావు నేను నీకు మేనకోడలనుకాను. మాగురువుగారి ప్రశ్నలడుగుచున్నాను. వినుము.

జయం:- మంచిది. త్వరగాఅడుగుము.

చింతా:- మొదటిప్రశ్న:-మారువేషముతోడ తమ్ములను రక్షించుకొని, సన్యాసిచేబడిన కోమలీమణిని మంత్రదండమును గ్రహించి, జటిని పారద్రోలి, మరలహత్య గావింపబడియు జీవించిన రాకుమారుడిపుడు సజీవుడా? విగతజీవుడా? వానినామ మేమి?

2 వ ప్రశ్న:- మగువయై మగవేషముదాల్చి, మంత్రిగచరించుచు పలువురు మగువల మమకారమునకు పాత్రురాలై, మగనితో పయనించుచు మాయసన్యాసిచే కలిగిన మహాపన్నంబునుండి బైటపడిన వీరనారి సజీవియా? విగతజీవియా? ఆమె నామ మేమి?

మూడవప్రశ్న:- సన్యాసి కనురాగవతియైన సుందరియు, వగతుడైనట్టి కీర్తివర్ధనుడును సజీవులా? విగతజీవులా? కీర్తివర్ధను డేవిధమున చరించుచున్నాడు? సుందరి యెటులున్నది?

జయంత భూపాలా! నేనడిగిన మూడుప్రశ్నలు పూర్తియైనవి. ఇక నీవువాటికి ప్రత్యుత్తరములివ్వవలసిన పనియేమి గలియున్నది. నీవద్దానికి సమాధాన మివ్వకున్న నాచేతికరవాలము తనధర్మమును తానాచరింపనున్నది. ఏమందువు? అని చింతామణి మాటాడుచుండ జయంతునికి నోటమాటరాలేదు. దేహ మాపాదమస్తకము కంపింప దొడంగినది. నేత్రములు తిరిగిపోవుచున్నవి. మరొక క్షణకాలములో నాతనికి భూలోకమునకు ఋణబంధము తెగిపోవుచున్నది.

ఆహా! ఇవియేమి ప్రశ్నలు? వాదోపవాదములకు శాస్త్రాధికారముండవలదా? ఉభయవాదంబులలోని సత్యాసత్యములు నిర్ణయించుట కధికారవర్గముండవలదా? ప్రశ్నల కర్థసహితమైన ఆధారములుండవా? ఇది యక్షసాధ్యుల చరిత్రలుగావు - సురాసురపురాణముగాదు- రామాయణ భారతాదిగాథలుకావు. పోనీ, యిదివ్యక్తిగతమా? వ్యంగ్యరచనయా? దేశమునకు సంబంధమా? దివ్యలలితకళాభాగమా! కాదు తర్కశాస్త్రమయిన తప్పక జయించియుందునే-వ్యాకరణ మీమాంసలైన ఒక్కమాటలో తేల్చియుందునె - కవితాలక్షణమయిన కావ్యంబులతో సహా వినిపించి వివరించియుందునే? ఈ కీర్తివర్ధనుడెవరు? ఆసుందరియెవరు? అందరికికారకుడైన సన్యాసియెవరు? ఆప్రశ్నలు తెలిసి యుండవలయునన్న సిద్ధాంత మెక్కడిది? అవిచెప్పలేకున్నచో మరణదండన విధించుటలో మంచియున్నదా? ఇట్టి దౌర్భాగ్య సాహసంబునకా సన్యాసి పూనినపూనికొననుగాక-పసితన మందున్న చింతామణి యంగీకరించిన నంగీకరించునుగాక - సర్వశాస్త్రధర్మము లెరింగినవాడు, రాజ్యమునందెట్టి వికల్పములు సంభవించకుండ పాలించదగిన మాబావగారుగూడ యీ ఘోరకృత్యముల కామోదించి యిన్నకుండుట విచారకరముగాదా? ఏదీ - ధర్మపాల మహీపాలుడు యీసన్యాసి మాయకృత్యంబులతో సంబంధములేనివాడై తొలగియున్నను కొంతమేలగునుగదా? అవ్విధంబుననుగాక వీనికిమఠంబును-భూప్రాకారములు - యీ గొలుసుగంటలు- యీ శిరచ్ఛేదనాధికారము లేల నీయవలయును? అని పరిపరివిధంబుల చింతించుచున్న జయంతుని కన్నీరు నదీప్రవాహమువోలె స్రవించుచుండెను.

జయంతుడు నొందుచున్న బాధ చింతామణియు ననుభవింప కున్నదా? యథార్థమునకు వారిద్దరు భార్యాభర్తలై సుఖదుఃఖములను సమానముగ పంచుకొనవలసినవారు. అయితే వారిందు సతీపతులు కాలేద న్నమాటయే కాని ప్రస్తుతపరిస్థితులలో కన్నీటిధారలను పంచుకున్నారు. చింతామణియు వాపోవనారంభించినది. అయ్యోదైవమా! నేనెంతటి రాకాసి తనమున మామామగారి తలను నరుకనుంటిని. ఈవార్త విన్న నా తల్లిదండ్రులు నన్నెంత కఠినాత్మురాలిగ నిందింతురో? రాజ్యప్రజ లేమని దూషింతురో? సాటిరాచకన్నియలు నన్నేవిధంబున భావింతురోగదా? ఒకరనుటయు- అనకపోవుటయు నాకక్కరలేదు. వారేమియు ననక పోవచ్చును. మామమిక్కిలి నేనొనరించినపని వీరనారీ విధానమనియు నిష్పక్షపాతమనియు న్యాయచట్టమనియు కొనియాడుగాక. లోకుల మెప్పునకై నా మేనమామను నేను చంపుకొందునా యని విలపించుచుండ గమ్యప్రదేశమునుండి "చింతామణీ! గడువు పూర్తియైనది. శిరచ్ఛేదనము గావింపుము" అనుమాటలు వినవచ్చెను.

ఆ మాటలు వెలువడినతోడనే చింతామణీ జయంతుల శరీరములు ఝల్లుమన్నవి. వారి గుండియలలో బండలు పగిలిపోయినవి. పిడుగులు రాలినవి. "చింతామణీ! ననుచంపెదవా?" అన్నటులు జయంతుని కన్నులలోనుండి అతిదీనమయినచూపులు చింతామణి ముఖములోనికి ప్రసరించినవి. ఎట్లెట్లో దుఃఖము నుపశమింపచేసుకొని ఖడ్గము నెత్త బోవుచున్న చింతామణి హస్తము పట్టుదప్పిపోయినది.

ఇంతలో "చింతామణీ! నా యాజ్ఞను మీరిపోవుచున్నావు. ప్రమాణము నతిక్రమించుచున్నావు. సన్యాసి కోపమునకు గురికాకుము. నామాటనతిక్రమించి జయంతునే రక్షించెదవో? – నాశాపమునొంది నీవు నీతలిదండ్రులు, నీబంధుసమూహము, నీరాజ్యసర్వస్వము బూడిద యయ్యె దరో ఆలోచించుకొనుము. జాగ్రత్త" అనుమాట లతి భయంకరముగను నిర్దాక్షిణ్యముగను వినిపించినవి.

చింతామణి చివాలున వంగి కరవాలమును చేతబట్టి తీవ్రముగ విసిరినది. జయంతుని శిరంబు కంఠముమీదినుండి దూరమైనది. సన్యాసి యాజ్ఞానుసారముగ నాశిరంబును రాజనౌకరులు కోటకొమ్మన గట్టిరి. అతని కళేబరమును సన్యాసి మఠమునకు వెలుపలనున్న పెద్దకందకమున పారవైచిరి. అంతటితో జయంతుడంత మొందెను.

సన్న్యాసి మఠంబులోనికిం బోయిన సోదరుని ప్రయత్నమెటులయ్యెనో యని యంతఃపురమున తహతహలాడుచున్న యిందుమతీ మహారాణిగారి వద్ద కొక పరిచారికవచ్చి "అమ్మా! అమ్మా! జయంతులవారి తల కోట కొమ్మకు కట్టినారమ్మా" అని చెప్పెను.

ఆ మాటలువిన్న యిందుమతి నెత్తినోరు బాదుకుంటూ "అయ్యో! తమ్ముడా! ఎంతపని జరిగినదిరా" అంటు మేడ నెక్కి చూచినది. ఓ పాపిష్టి దైవమా! నీకు నేనేమి లోపము చేసితినని నాకీ శోకము చేకూర్చితి వయ్యా! నేను నోచిననోము లేమైపోయినవి? నా దానధర్మముల పుణ్య మెక్కడ దగ్ధమైపోయినది? నా పూజలెందుకు నాశనమైనవి? లేక లేక ఒక్క పుత్రికను ప్రసాదించితివి. ఆడసంతానమైనను సరే భగవంతుడిచ్చినదే పదివేలనుకొని, నా చిట్టితల్లి నే గారాబముగ పెంచుకొంటిమిగదా? అదయి నను హాయిగనుండక దాని కల్యాణమున కిట్టి లోకవిరుద్ధ కారణము లేల సంభవించవలయును? పోనీ యేనాటికైనను మంచిరోజులున్న చింతామణి వివాహ మొకదారికి వచ్చునని గుండె నిబ్బరము చేసుకొంటిమిగదా? నా పుట్టింటి వంశాంకురమైన జయంతునిగూడ చంపి యింక నన్నేమి సుఖ పెట్టగలవు? నిన్ను నమ్ముకున్న మా యుభయ వంశములను నిర్వంశము చేయుటయేనా నీ దయాదృష్టి?" అని వాపోవుచున్న యిందుమతిని జీరి ధర్మపాలుం డిట్లనియె.

ప్రేయసీ! పూర్వజన్మసంచిత ఫలము మనమిప్పు డనుభవించు చున్నాము. పురుషుడనౌటచే నేను లోలోపల కుమిలిపోవుచున్నాను కాని నాకు మాత్రము విచారములేదా? మనల నుద్ధరించుటకై యరుదెంచి నాడని యే సన్న్యాసిని గౌరవించితిమో – ఆసన్న్యాసియే మనల కిపుడింతటి దుర్గతులు గలిగించుచున్నాడు. అయినను అతడు తపస్వి. వారల వాక్శుద్ధి సిద్ధించును. ఆ సన్న్యాసికి కోపము వచ్చినచో నొక్క శాపముచే మనల నందరిని భస్మము సేయగలడు. ఈ గర్భశోకముతో, బంధువియోగముతో జీవించుటకంటె యథార్థముగ మరణించుటయె హాయి. కాని, యిందుమతీ! ధారుణీ ప్రజలందరును మన బిడ్డలే. వారికొరకైనను మనము జీవించవల యును." అనుచుండ రాణిగారించుక విచారమును దొలంగి "మహారాజా! నేనీ శోకంబును భరింపలేను. నా కిపుడీ రాజభోగములన్నియు బాధాకర ముగనున్నవి. పుణ్యక్షేత్రముల సందర్శించిన కొంత మనశ్శాంతి యగు నేమొ-తీర్థయాత్రల కేగుదమా" యనెను.

అంతట ధర్మపాలుండు భార్య శిరమును తన వక్షమున చేర్చుకొని, చేతితో తలనిమురుచు - మిక్కిలాదరణతో "సఖీ! నీ కోరికను నేను కాదనువాడను కాను. అయినను సమయము నెరుంగవలదా? ఇటుచూడు. ఇప్పుడు మహేంద్రనగరమునకు ప్రభువెవరు? ఆరాజ్య మరాచకముగ నున్నచో పరరాజులు వశపరచుకొనరా? నేనా రాజ్యార్జనకై ప్రాకులాడుటలేదు. మన జయంతుడే గతించిన పిమ్మట - చింతామణి యిట్టి చిక్కులలో నున్నప్పుడు - మనకా రాజ్యము మాత్రము ప్రధానమా? కాదు కాని, మీ నాయనగారి కోరిక ప్రకారము మహేంద్రపురము దయానిధి మహారాజులవారిపేరు మాటకు లోటు రానీయకుండుట నావిధి. అందులకై నేడే మహేంద్రపురమునకు వెళ్ళి, ఆ పురపౌరుల కీ యుదంత మెరింగించి - జయంతుని శాస్త్రమిత్రుడును, రాజకీయ తంత్రపారంగతుడును, ప్రభు కుటుంబమునం దత్యంత భక్తియుక్తుండును నగు మురారిని ప్రతినిధినిగ చేసి రాజ్యభారము నప్పగింప దలంచితి న"నెను.

అంతట నామెయు సంతసించి మహేంద్రపుర ప్రయాణమున కంగీకరించెను. ఆరాత్రి రాజదంపతుల కాహార పానీయాదులు రుచింపలేదు. కంటికి కూర్కు లేదు. రాజాంతఃపురములో వీరును, సన్యాసి మఠంబులో చింతామణియు జయంతునిగూర్చి పలవరించుచు, పరితపించుచు నారేయి నెట్లో గడిపిరి.

## రాజకుమారుల దుర్మరణం

జయంత వధ జగజగంబుల ప్రాకినది. పదుగురు పలువిధంబుల పలుకాడజొచ్చిరి. సన్యాసిని దూషించువారు కొందరు - చింతామణిని నిందించువారుకొందరు - ధర్మపాలుని యాడిపోయువారు కొందరు - ఎవరికి తోచినట్లు వారనుచుండిరి.

ఎవరేమనినను చింతామణిలో మాత్రము కొంతమార్పు కలుగక పోలేదు. శృంగారమున మునుంగదగిన యామె జీవితము నేడు వైరాగ్యమును చెందినది. రాజసౌధంబుల నుండదగిన యామె నివాస మిప్పుడు సన్యాసి మఠంబున జరుగుచున్నది. సుకుమార సుమంబులనుగోయ జంకునొందు యామె హస్తంబు లీనాడు రాజకుమారుల కంఠంబులెన్నింటినో నవలీల ద్రుంచుచున్నవి. అల్లిబిల్లి బుల్లికబురుల చెప్పిన యామే లేతబుగ్గల నోరీ సమయంబున దండధరోద్దండ దండనంబుల ఖండితముగ బల్కుచున్నవి.

వెన్నలాంటి హృదయము విషతుల్యమైనది. విశేష ప్రజాభిమానపాత్ర తిరిగి సకల జనాసూయపాత్రమైనది.

అనేక దేశములనుండి పెక్కు రాకుమారులు వచ్చుచుండిరి. వారందరును చింతామణి సౌందర్యాతిశయముల గూర్చి వినినవారె—అందరును సన్యాసి ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోవుదుమా యను అహంభావమును చెందినవారె—అందరును అకాల మరణంబున కాహుతిమైన వారె. ఆహా! ఎందరు రాజకుమారులు? ఎన్ని కళేబరములు? ఎంత రక్తపాతము? ఎంత మహాదారుణము. అపూర్వ చింతామణిచే దును మాడబడిన శిరము లొక్కటికాదు—పదికాదు—వందకాదు. వందల వందల తలలు తెగుచున్నవి. ఎంతమంది తల్లుల గర్భపుకోత నీధారుణి తలము భరించుచున్నదో చెప్పుట దుస్సాధ్యము.

అడుగో యెవరో రాకుమారుడు. ఆహా! ఎంత చక్కనివాడు? ఉంగరములు తిరిగిన తలకట్టు—విశాలమయిన ఫాలభాగము—విల్లసంబు వలె వంగిన నా కనుబొమ్మలు—సంపూర్ణ రూపంబు నొందని యా మొలక మీసము—గంభీరమయిన నా వక్షస్థలము—దీర్ఘములయిన బాహువులుగల తేజోవంతు డే యమ్మగన్న బిడ్డడో కదా? ఏ లలితాంగినో వివాహమాడి సంసారసౌఖ్యంబుల ననుభవింపదగిన మదనమూర్తియో గదా? ఏరాజ్యసింహాసన మధిష్టింపనున్న మహాదృష్టవంతుడో, తన గుఱ్ఱమును దిగి వేగమున నడచుచున్నాడు. అతని నడక యెచటకో కాదు. ఆ గొలుసును లాగుటకె. ఎంత సాహసము?

అవురా! ఏమీ యీ ప్రళయవిజృంభణ? అకాలమృత్యు వీ చింతామణీ రూపంబున వెలసి యెంద రెందరు రాచబిడ్డలను పొట్టన బెట్టుకొనుచున్నది? వందలమంది మరణించుచున్నను మిగిలినవారు భయమందరేమి? ఇటువంటి నెత్తుటి కూటిపై విరక్తి చెందరేమి? ఇది యంతయు చింతామణీ గురువుగారయిన సన్యాసి మహాత్మ్యమా? రాజ కుమారుల మూఢత్వమా? లేక కాలపరిమాణమా? యెవరు నిర్ణయించ గలరు?

ఆ వచ్చిన రాజకుమారుడును గొలుసునుబట్టి లాగుటకై యత్నించు చున్నాడు. అంతలోనె యొక ముదుసలి వానిని నివారించుచున్నాడు. అంతట నాయువకుడు తిరిగి పోలేదు. మీదు మిక్కిలి హితము చెప్ప వచ్చిన వృద్ధునితో నేదియో నిర్భయముగ మాటలాడుచున్నాడు.

యువ:— తాతా! ఎవ్వరవు నీవు?

ముసలి:— నాయనా! నేనెవరినైనను నీ మేలుగోరినవాడను. నీవు చేయబోయినపని మంచిదికాదు.

యువ:— అదేమి?

ముసు:— ఆ గోలును లాగుటవలన ప్రాణాపాయము సంభవించును.

యువ:— ఆసవాని మాటలకు సమాధానము చెప్పలేకపోయినపుడుగదా ప్రాణాపాయము సంభవించుట?

ముదు:— ఓహో! నీకీ విషయము తెలిసియే సాహసించితివా? అయితే నీవు తెలిసియే యిచ్చటకు వచ్చితివన్నమాట. నాకే తెలియక నిన్ను వారించితిని.

యువ:— అవును.

ముదు:— కావచ్చును. కాని నీ వీ గోలును లాగవలదు.

యువ:— ఎందులకు?

ముదు:— ఆ ప్రశ్నలు సమర్థించుట దుర్లభము.

యువ:— నీకు దుర్లభమయిన నాకును దుస్తరమా?

ముదు:— బాబూ! అటుచూడుము. ఆ కోటకొమ్మకు కట్టబడిన శిరములన్నియు రాజపుత్రులవే. వారందరు నీవలె ముందు ప్రగల్భములాడినవారే. నీవును నీ వదుచుదనంపు బింకమున మాటలాడుచుంటివి కాని వేరుకాదు. నాయనా! ఇంతకు మీ పట్టణమెయ్యది? మీ తల్లిదండ్రుల నామములేమి? నీ పేరెయ్యది?

యువ:— తాతా! నీ వరుస బాగున్నది. బాటను పోవువాడవు బాంధవ్యము సేయువానివలె యూరుపేరులు—కులగోత్రము లడుగుచుంటివేమి? పొమ్ము. పొమ్ము.

ముదు:— ఆగు నాయనా! ఆగు. ఆలోచనలేని పని ఆపదలకు మూలము.

యువ:— నీ నీతులు నాకు తెలియనివికావు. దూరముగపొమ్ము.

ముదు:— బాబూ! నీవు వడుచువాడవు. క్రాగుచున్న పాలు పొంగకమానవు. నేను వయసు మించినవాడను. క్రాగి చల్లారిన పాలకు పొంగులురావు. అందుచేత నీవు తొందరపడినను నేను తొందరపడను. నీ చరిత్ర చెప్పుటకు నీకిష్టము లేకపోవచ్చునుగాని నా చరిత్ర నీకు చెప్పవలయునని తలంచుచున్నాను. ఒకవేళ నీవా మాటలు వినుట కంగీకరింపకపోవచ్చును. అయినను నా మాటలు నీవాలకించువరకు నిన్ను విడిచిపెట్టను. నేను నీతండ్రివోలె బ్రతిమిలాడుచున్నాను. నామాట వినక నీవాగొలుసును పట్టిలాగితివేని నీతండ్రిమీద వొట్టు.

యువ:— తాతా! మంచి గట్టివాడవె. సరి, ఆ శిలావేదికపై కూరుచుందమురమ్ము. నీ మాటలు వినిన తరువాతనే నే నా గంటను మ్రోగించెదను.

ముదు:— మంచిది నాయనా! అటులె గావింపుము.

అనుచు వారిరువురు కొంచెము దూరమేగి విశాలమయిన నొక శిలావేదికపై నాశీనులయిరి. పాప మీ ముదుసలి యేదియో చెప్ప యత్నించుచున్నాడు. కాని వాని నోటనుండి యొక్క మాటేనియు రాకుండెను. వాని దుస్థితిని చూచిన రాకుమారునకు జాలి గల్గినది. తాతా! నీ వెవరవొ కాని నన్నింతగ ప్రేమించుచున్నావు. నీవేదియొ చెప్పదలంచియు చెప్పలేకపోవుచున్నావు. విచారమందకుము. నీ వడిగినట్లు నా వృత్తాంతమును మొదట చెప్పెద. ఆ మాటలు వినుచు నొకించుక మనస్థిమితము నొందుమని యిట్లు చెప్ప దొడంగెను.

అయ్యా! నేను కాంచనపురాధీశుండగు ప్రభాకర ప్రభూత్తముని జ్యేష్ఠనందనుండను. మా తండ్రిగారు నాకు వివాహం బొనరించి రాజ్యంబును నా కొసంగి వారు విశ్రాంతి గైకొన నిశ్చయించిరి. వారి యభిప్రాయము నొకనాడు మా జనకుండు నాకెరింగింప నేనును మనస్ఫూర్తిగ నంగీకరించితిని. అంత నాకుం దగిన వధూనిర్ణయమునకై మా నాన్నగారు వైదిక బ్రాహ్మణోత్తముల నియమించి దేశదేశముల కనిపి రాజకుమార్తెల చిత్రపటంబుల దెప్పించిరి.

బ్రాహ్మణోత్తములు గొని వచ్చిన యా పటంబులను కొల్వు కూటంబునకు దెప్పించి నాకుంజూపిరి. యదార్థమునకు వారలపరూప లావణ్యారానులేకాని నామనం బేలకో వారల నుద్వాహమాడ నంగీక

రించలేము. అందుపై నేనా విప్రులచూచి "భూసురులారా! మీరు ద్రిమ్మరిన దేశంబులలో నింతశంటె సుందరాంగనలు మీకు కనుపించనే లేదా?" యని ప్రశ్నించితిని.

అందొక ద్విజుండు నన్నుజూచి "లేకేమి—రాజనందనా! దేవతాంగనల మించిన దివ్యసుందరీమణి—నాగకన్నియల మించిన నవ్య సౌందర్యరాసి—గంధర్వకాంతల మించిన కామరూపిణి, కలదుగాని ఫలములేదు. అందుకోలేని పండు—అనుభవించలేని విందు. అమూల్య మయిన ఆ స్త్రీరత్నమొక త్రాచుపాము తలపైన తళతళ మెరయు చున్నది. వెలుగులు జిలుకుచున్నది. దరికిపోయినవా డింతదనుక తిరిగి రాలేదని" వక్కాణించెను.

ఆ పౌరునిమాటలకు నేనే గాక అప్పుడారాజసభనందున్న వారందరు వెరగు చెందిరి. మా తండ్రిగారును విప్రుని మాటలు వివరంబుగ వినదలంచి "ఓ భూసురాగ్రణీ! మీ మాటలు మా కెల్లర కాశ్చర్య మొదవించుచున్నవి. దయచేసి మీ రెరింగిన దానిని సవిస్తార ముగ తెలియం జెప్పు"డన నాతండు మగిడి మహారాజా! మన పట్టణం బునకు రమారమి పదునైదామడల దూరములో మార్తాండపురంబు గలదు. ఆ పురాధిపతియగు ధర్మపాలమహీపాలుని యేకైకకుమారి అపూర్వచింతామణి భూలోకరంభ. ఆ సుకుమారి సౌందర్యాతి శయంబులు వర్ణించుట కాబ్రహ్మదేవున కేనియు శక్యముగాదు. చింతామణి సౌందర్యవతియే కాదు. సౌందర్యమునకు మించిన శీలవతి—శీలమును మించిన విద్యావతి—విద్యారాసిని మించిన విజ్ఞానవతి యని గూడ చెప్పక తప్పదు. అయిన నేమి ప్రయోజనము? అటువంటి పుత్రికారత్నమును గన్న జననీజనకులానందమందవలసిన దానికి మారుగ నాత్మవిచారమందు చున్నారు. ఎందువలన వారికా దుఃఖమని మీరడుగుచున్నారేమో?— ఆమెకుం దగిన వరుని నిర్ణయించి పాణిగ్రహణమహోత్సవము చేయుటకు తండ్రిగారు ప్రయత్నములు సేయుచుండ నా రాజకుటుంబమునకు దైవ సముండును, చింతామణికి గురుండునైన యొక సన్యాసి చే వివాహ విధానము విఫలమైనదట. ఆమె యిపుడు తన్ను కరగ్రహణమంద దలంచి వచ్చిన రాజకుమారులను మూడు ప్రశ్నల నడుగునట. వారా ప్రశ్నలకుం దగిన యుత్తరములు లొసంగినచో పెండిలాడునట—లేకున్న నానృపనందనుని తనచేతగల కరవాలముచే ఖండించి తలను కోటకొమ్మనకు

గట్టునట. అందులకు ప్రథమ నిదర్శనముగ వందలాది రాజపుత్రుల శిరంబు లాకోటమీద కనుపించుచున్న” వని దెలిపెను.

ఆ మాటలు వినుచుండ నాకును పౌరుష మమకారంబులుగల్గినవి. తాతా! నేను షట్ఛాస్త్ర పరిశోధకుండను—పంచ వేదపారాయణుఁడను—అష్టాదశపురాణ పాఠకుడను—సకల కావ్యావలోకనానుభవపరుండను. ఈ రాజకుమారులవలె సామాన్య విద్యాసంపన్నుఁడనుగాను. చింతామణి యొసంగు ప్రశ్నలకు సమాధానమిచ్చిన నే నివ్వవలయును. లేకున్న వాటికి బదులు చెప్పవా డింక ముల్లోకంబు లందుండియుండడు. కావున నాసన్యాసి యడిగిన వాటికి ప్రత్యుత్తరములొసంగి చింతామణినే పొందవలయునని భావించి నా సంకల్పము వెంటనే నాతండ్రిగారికిం జెప్పి యీ మర్తాండపురికి రానుంటిని.

అంత నా తల్లిదండ్రులు గుండియలు బాదుకొనుచు నన్నాపి “నాయనా! శత్రుంజయా! విషయమంతయు విని నీవే యీ మూర్ఖమున చరింతువా? మన పౌరోహితులవారు సెలవిచ్చిన మాటలనుబట్టి చూడగ నయ్యది యమపురిగాని మార్తాండపురముగాదు—చింతామణి మృత్యుదేవతగాని, పెళ్ళికుమారైకాదు—సన్యాసి సంభాషణలు చిత్రగుప్తుని జమాఖర్చులుగాని, ప్రత్యుత్తరము లివ్వదగిన ప్రశ్నలుగావు. అదియునుంగాక వందలమందిని చంపిన యా రాకాసిని యిల్లాలుగ బడసిన వారు మాత్రమేమి సుఖింతురు తండ్రీ! మరియును భార్యారూపవతీ శత్రు”వను పెద్దల మాటను నీవు మరచితివా? రుచిగల పదార్థములలో రుగ్మతధికంబుగాదా? ఆడుదాని కంత కఠినహృదయంబు తగునా? అటువంటి స్త్రీ అప్సరసయే యగుగాక—అంతకు మించిన సుందరియే యగుగాక, అందమున కాశించి అంతమందుదుమా! కోరవితో తల గోకి కొను వారెందేని యుందురే?” యని నన్ను వారించిరి.

మా తలిదండ్రులేగాక నచటి వారందరు నన్ను మందలింపబూనిరి. వారెన్నియో నీతిపాఠంబు లుపదేశించుచుండిరి. చివరకు వారు చెప్పు హితబోధలు నాచెవిని బడలేదు. ఎట్లు వినవచ్చును? నా శరీరము మాత్రమే మా కాంచన పురమందున్నది కాని—నా ప్రాణమంతకు ముందే వాయువేగ మనోవేగంబులతో మార్తాండపురమునకు చేరినది. అంతట వారి నిర్బంధములతో మైకమునుండి తొలంగితిని. “పూజ్యులారా! మీరెన్ని చెప్పినను ప్రయోజనము లేదు. నామనసు చింతామణి

యథేచ్ఛమై పోయినది. సన్యాసి యొనరించిన చిక్కు సమస్యల నివారింతు నేని యింతకు రాకుమారులు సాధింపలేని దుస్సాధ్యకార్యంబును నేను జయించిన వాడనగుదును. లేదా—చింతామణి! సుందరవదనారవిందము నొక్కమారు నేత్రపర్వముగ జూడనైన చూతును. ఆ నవమోహనాంగితో మనసార నొకించుక మాటలాడనైన మాటాడుదును. నా కంతియె చాలును. నేనింక జాగొనరింపజాలనని పయనంబై నాజవనాశ్వంబు నధిరోహించి యిందు చేరితిని. కాని నేనెంత వేగముగ వచ్చితినో మీవలన నాకంత జాగయినది.

ముని:— శత్రుంజయా! అయిన నీకు సోదరులున్నారా? లేక నీ తలిదండ్రులకు నీ వొక్కడవేనా?

యువ:— నేను మాతండ్రికి కలిగిన సంతానములో పెద్దవాడను. నా తరువాత ప్రతాపుడు, అరిమర్దనుడు, విక్రముడు, సత్యకీర్తి, ధనంజయుడు, సుధాకరుడను మరి యార్వురు సోదరులుగలరు. అందు కడమవాడయిన సుధాకరుడు మాత్రము మా పిన్నిగారివద్ద చంద్రనగరమందు పెరుగుచున్నాడు. చంద్రనగరంబున మా తల్లి తోబుట్టువునకు సంతానము లేకపోవుటచే సుధాకరున కారు మాసములు నిండగానే గొనిపోయి పెంచుకొనుచున్నది. మిగతా అయిదుగురు సోదరులు నింటి పట్టున నున్నారు. నా తరువాత వాడయిన ప్రతాపుడు నాకంటె రెండు వత్సరములు చిన్న. మిగతా వారును రెండు రెండు సంవత్సరములు చిన్నవారుగ నుండిరి. మాలో ఆరవవాడయిన ధనంజయునకు నిరువది వత్సరములు నిండినవి. వారందరును నావలె రాచకీయ వ్యవహారముల నారితేరినవారు. మానాన్నగారి కన్ని విధముల వారి సహాయముచాలును.

ముని:— నాయనా! తనయు లెందరున్నను తలిదండ్రుల కెక్కుడగుదురా? శత్రుంజయా! నీ వృత్తాంతమును దెలిపి నాకించుక యూరటగలిగించితివి. ఇంక నావిషాద ఘట్టంబును చెప్పెద నాలకింపుము. ఇచట కిరువదైదామడల దూరముననున్న మహాదేవపురంబేలు వాడను. నాపేరు అమరనాథుడందురు.

వత్సా! ఆ నాటి నావైభవంబు నేనుగ వక్కాణించుట కూడని పనియే కాని నీకుం దెలియు నిమిత్తమై చెప్పబూనినాను. నేను రాజ్యపరిపాలన గావించు కాలంబున ప్రజలు సకలైశ్వర్యంబుల ననుభవించిరి—

మునులు యజ్ఞయాగాదుల గావించిరి—శిల్పులు, కవులు, గాయకులు, పండితులాది లలితకళోపాసకులు నాచే వేలకు వేలమంది పోషింపబడిరి.

ఇటులుండ నొకానొక దివసంబున నిరంతర భగవన్నామ ధ్యాన పరుండును, జితేంద్రియమూర్తియు, మహాయాగకర్తయు, పుణ్యయాత్రా లోలుండయిన మహానుభావుం డరుదెంచ నేను భక్తి వినయంబులతో నెదురేగి, దోడ్కొనివచ్చి, శక్త్యానుసారంబుగ పూజించితిని. ఆ మహానీయుడు జాతిమత నియమంబులు పాటింపక భక్తులయినవారి యాతిధ్యమును స్వీకరించువారని విని యమితానందమున వారికిం దగు భోజన పదార్థంబులు తయారు చేయించి స్వాములవారిని భోజన మందిరమున కాహ్వానించితిని.

ఆతండు నాప్రార్థన లాలించి సంతసంబున నరుదెంచి యొక బంగరు పీటపై నాశీనులయిరి. నా భార్యయే వారికి మృష్టాన్నములు వడ్డించినది. అంత నా బాటసారి భోజనముచేతముట్టి సమీపముననున్న నన్ను చూచి "రాజా! ఇంతకూ నీకు సంతాన మెందరు?" అని ప్రశ్నించెను. ఆ మాటకు బదులాడ నేరక నేను దుఃఖింప సాగితిని. నిరుత్తరుండనైన నన్ను మరింత తీవ్రముగ నాతండు చూచి "నీకు సంతాన మెందరు?" అని తిరిగి ప్రశ్నించెను. అంత నాకేమియుదోచక, భయంబున శంకించుచు "మహాత్మా! ఈ మందభాగ్యుడా నోము నోచుకొనలే"దని బల్కితిని.

శత్రుంజయా! అంతవరకు పరమశాంతమూర్తిగనున్నాతని మోమెట్లు రోషావేశమును చెందినదో చెప్పజాలనుగాని, యాతడా భోజనంబు నొకచేత దూరంబుగద్రొచి "ఓరీ! పాపాత్ముడా! బిడ్డలు లేని గొడ్రాలిచేతి యన్నము దినిపించనెంచితివా! సదాచార సంపన్నుడ నగు నన్నే మోసగింపబూనిన దోసంబునకుం దగు ప్రతి ఫలమనుభవింతువుగాక" యని లేచి వెళ్ళ నారంభించెను.

అంత నేనును నా భార్యయును పరుగునబోయి వాని పాదంబుల వంటి "మహాత్మా! చిరకాలంబునుండి సంతానములేక చింతించుచున్నాము. దైవానుగ్రహమున నేడు మీసందర్శన భాగ్య మబ్బినది. మిమ్ము సేవించి మీ యాశీర్వచన ప్రభావంబువలన పుత్రునికనవలయునని మహదానందమందుచున్న మమ్మిట్లు కోపించుట న్యాయమా? మీవంటి నిష్టాలోలురే దూర్వాగ్రహవీక్షణంబుల జూచిన మేమెంతటివారము!

తమరికి ద్రోహం బొనరించుతలంపు మాకేల యుండును? దయామయా! కోపముడింగి మమ్మనుగ్రహించి మా వంశము నిలుపు"మని మిక్కిలి వేడుకొంటిమి.

అంత నా మహామునియు మాయందసాధారణ కరుణాకరుడై, మమ్ములనోదార్చి "దంపతులారా! లెండు. మీకు పురుష సంతానంబు గల్గు వరంబిచ్చితి"నన మేమానందమందితిమి. పిమ్మట నాతండు "రాజా! నీవు కోరినట్లు ధైర్యసాహసోపేతయు—సర్వశాస్త్ర కళాధురంధరుడు—సమరక్రీడాస్వైరవిహారియు—దివ్యసౌందర్యమూర్తియగు పుత్రుం డుదయించును గాక. అయినను నారోషపూరితమయిన వాక్యంబుగూడ వ్యర్థంబుకాజాలదు. కుమారు డిరువదిరెండేడుల ప్రాయంబు నిండువరకే తిరిగి మరణించునని దెల్పెను.

ఆహా! ఈ పుణ్యపురుషుండు నాకు మరల సుఖదుఃఖంబుల రెండింటిని విధించుచున్నాడే యని దలంచి మరల కరద్వయంబుమోడ్చి "స్వామీ! ఇది యేమిన్యాయము? వంశంబు నిల్పుటకే గదా పుత్రుని ప్రసాదింపుడని మిమ్మర్థించితిని. కరుణామయులై ప్రసాదించిన వారిట్లు శెలవిచ్చుట న్యాయవిరుద్ధముకాదా? ప్రపంచమున గల తలిదండ్రు లెవ్వరును తమబిడ్డలు శతవర్షంబులు జీవించవలయుననియు—అష్టైశ్వర్యముల ననుభవింపవలయుననియు—ఆచంద్రతారార్కంబుగ వంశాభివృద్ధి గాంచవలయుననియు—వారి వలన పున్నామనరకంబునొందక పితృదేవతలు శాశ్వతశివసాయుజ్యమందవలయునని కదా మిమ్ము పూజించుట! పుట్టిచచ్చిన విచారముకంటె పుట్టకనున్న కొరంతయే మేలగును కాదా! మహామునీ! పంచభక్ష్య పరమాన్నంబులు వడ్డించి భుజింపరాదని శాసింపధర్మమా? మహాసముద్రమధ్యంబున మృత్యుదేవత కాహుతి కానున్నవానికి నావనుచేతికందించియు విడిచిపెట్టుమనుట భావ్యమా? మహోన్నతమైన రత్నసౌధంబు మీది కెక్కించి అందుండి క్రిందికి ద్రోయుట పున్నెమా"యని వేడుకొన నారంభించితిని.

అట్టి యెడ కరుణామూర్తియైన యా మహామహుండు పెద్దయుంగాలంబు దీర్ఘంబుగ యోచించి "ఓయీ! అమరనాథా! నేను నీయింట భుజింపబోయియు సిద్ధాన్నమును స్వీకరించలేకపోయితిని. నీవును నీకుదయించిన పందనునివలన నానందము చెందరాని శపించి యుంటిని.

మా తీక్షణజింహ్వా వ్యర్థంబుకారానిది. నే నశనబులు నీవు పుత్రశోకము ననుభవించకతప్పదు. ఏడుసంవత్సరములా పైయోగంబు గడచిన పిమ్మట మరల నీతనయుండు జీవించి రాగల"డని దీవించెను.

"అతిథి వాక్ప్రభావంబుగ మాకు మహాసంతానము లభించినది. ఆ బిడ్డయందు తొల్లి మహాఋషి దెలిపిన విశేషంబులన్నియు గలవటంచు మా మనంబులకుం దోచినందున నా తనయునకు "ధీమంతు"డను నామకరణ మొనరించితిని. శత్రుంజయా! మహామునుల సంకల్పము లసాధారణ ప్రతిభావిశేష సమన్వితములుగదా? నా డా దివ్యపురుషుండు నుడివిన మాటలలో భేద మెటులుండును? ధీమంతుడు మహా తేజోవంతుడై దిగంత యశోకాంతుల నశ్రాంత మభివృద్ధినందుచుండెను.

"ధీమంతున కిరువదిరెండేండ్లునిండినవి. అతని కేయాపమున మరణంబు సిద్ధించునోయని మేమాందోళన పడుచుంటిమి. ధీమంతునకు మాత్ర మా మాటను తెలియనీయక ననేక వీరుల నాధీమంతుని కండగ యుండు నటు లాజ్ఞాపించితిని. అయినను ప్రయోజనము లేకపోయినది. ధీమంతున కీ చింతామణి వృత్తాంత మెవ్వరో చెప్పిరి. ధీమంతుడును మార్తాండపుర ప్రయాణసన్నాహముననుండ మేమతని వారించితిమి.

"అది యంతయు కర్మఫలము గాకున్న నామాట నేనాడును గడి దాటని వా డీ విషయంబున వినకుండునా? తుదకు వాని జన్మచరిత్రయు వివరించితిని. ధీమంతు డా విషయంబును విన్నతోడనె మరింత యుత్సాహంబున లేచి "తండ్రీ! అటులైన మీరెంతమాత్రము నా కంత రాయము చెప్పరాదు. మనసాటి రాజేంద్రుడైన ధర్మశీలుని రాజ్య మందింత ఘోరంబు జరుగుచుండ—వందలాది రాకుమారులు మరణించు చుండ ధీమంతుడనైన నేనుచూచుచు ఉండజాలను. తండ్రీ! నన్నొక్కనినే చింతామణి సముఖంబున కనుపుటకు మీరే యింత శోకించుచుంటిరే— ప్రపంచమున నిందరు రాసుతులు గతించుచుండ వారి వారి మాతృ గర్భములెంత విలపించుచున్నవో ఆలకించితిరా? కన్న తండ్రులెట్లు కాకిశోకముల పాలయినారో గమనించితిరా? సుక్షాత్రవవంశంబునం దుద యించి యిట్టి మహాదారుణ మారణముల నెదుర్కొనలేకున్న నెందులకు? రాజబిడ్డలు సర్వదా ప్రజాక్షేమమునకై పాటుపడవలయును గదా! మరేమియు భయమందకుడు. నాకు శెలవొసంగు"డని నారెండు పాదం బుల పట్టుకొనెను.

"వాని మాటలకు నాకు మనంబుప్పొంగుచుండియు నాడు మునీంద్రుని మాటలు స్ఫురణకు వచ్చినంతనే నాహృదయముద్రిక్తమైనది. అందులకేను "తండ్రీ! ధీమంతా! నీ ప్రయత్నమునకు నేనంతరాయంబు చెప్పదలంచ లేదు కాని మరొక రహస్య మాలకింపుము. ఆ తపశ్శాలి వచించినటులు నీకిపుడు యిరువదిరెండు వత్సరములు నిండినవి. ఆతని వచనంబులబట్టి చూడ నీకు రేపటిదినంబున మహాప్రమాదము సంభవింపవచ్చును. అందులకై రెండు మూడు దినంబులైనను నీవెందును బోక యింట నుండుము. ముని వచించిన గడువు దాటిన పిమ్మట నీయిచ్ఛ వచ్చిన చోటికి పోవచ్చు"నంటిని.

"నా మాటలు పూర్తిగ వినకుండగనె ధీమంతుడు 'తండ్రీ! అటులయిన మీరింక నాలోచింపబనిలేదు. మహాత్ముల శాపంబు లేనాడును వ్యర్థంబులు కాజాలవు. ఇటువంటి ధీరకృత్యంబులందు కీడెంచి మేలెంచుట మంచిది. కాన నాప్రార్థన లాలకింపుము. మునిశాపానుసారముగ నా మరణము రేపటి దినంబునగదా? ఈ నాడే నే నా చింతామణిని చూచి, ఆ ప్రశ్నలకు ప్రత్యుత్తరంబుల నిచ్చి; మరణించిన రాకుమారుల తిరిగి బ్రతికించి రేపు సూర్యోదయకాలంబగు సరికింటికి వచ్చెదను. ఈ దినంబున నాకు మరణము రాజాలదు. ఎందువలననగ? తపస్వి యొసంగిన గడువు రేపయి యుండగ నేడెట్లు మరణింతును? ఈ దినము నేనీ కార్యంబు సాధించినవాడనగుదును. దాన మనయందుగల పరోప కారపారీణత సార్థక మందును.

'మహానీయుని వాక్యానుసారముగ నా కెటులైనను ప్రాణభంగము వాటిల్లకతప్పదు. ఆ తరువాత నేనీ మార్తాండపురంబున జరుగుచున్న రక్తపాతము నెట్లు లరికట్టుదును?

'దైవము మనకు పగవాడై నా మరణము చింతామణి చేతిలోనే జరిగించునేమొ'నని మీరు సందేహించుచున్నారా? నా కాప్రాప్తమే యున్న తప్పించుకొనగలనా? ఇంతకు దైవమే మన కనుకూలమయిన యీ విపరీత పరిస్థితులు మాత్రమేల సంభవించును? నేను మన ఇంటిలో [illegible] తప్పించుకొనగలనా? అట్టి యెడ పేరు ప్రతిష్ఠలతో [illegible] ప్రాణముల బాయుటకంటె, అందే [illegible], నేనిందు వీరస్వర్గమలంకరించెదను. అదియునుం గాక [illegible]. జీవింతునా! మనయింటి కరుదెంచిన మహాతపస్వి

శెలవిచ్చె ననుచున్నారుగదా? మరణించినవారు తిరిగి జీవించుట ప్రపంచమునం దసంభవము—కాని; మహామునుల వాక్ప్రాదములు వ్యర్థములు కావని మీరనుచుంటిరిగదా? అట్టి యెడ నేను పునర్జీవుడ నగుట యదార్థము. నేను తిరిగి సజీవుడ నగుచున్నప్పుడు మీకీ చింత యేల? ఒకవేళ నేను తిరిగి జీవింపననియే భావింతము. ప్రపంచమున నెవ్వరేనియు మరణించునని తెలిసిన పిమ్మట వారి వారి బంధుమిత్రులు శక్తికొలది వ్యయప్రయాసకోర్చియైనను మరణకాల కోర్కెలు తీర్చు చుందురుగదా. అయితే రేపటి నా మరణ కాలమునకు ముందు నేను వాంఛించిన దీ కోరికయె. మహారాజా! మీరు మహారాజులే గాక నాకు పితృదేవులయ్యు కరుణింపకుండుట న్యాయముకాదు. మీ యేకైక కుమారుని తుదివాంఛగ చింతామణిని చూచి వచ్చుట కానతి నివ్వు'డని ప్రార్థించెను.

“ఆహా! నా వరహాలతండ్రి యెంత చమత్కృతిగ మాటాడెనో సభారంగముననున్న వారందరు నచ్చెరువు నొందిరి. నా నోట నేమియు బలుకలేకపోయితిని. ధీమంతుడంత రయంబున నశ్వశాలకుంబోయి తన తురంగమును సిద్ధపరచుకొని పయనంబాయెను. ఆ సమయంబున గత్యంతరములేక వాని కనుజ్ఞ యొసంగితిని.

“ధీమంతు డట్లు హయారూఢుడై యీ మార్తాండపురమును చేరు నప్పటికి సూర్యాస్తమానమైనదట. అందుచేత నాతం డారేయి శయనించి మరునాడీ గొలుసులాగి సన్యాసి మఠంబులోనికిం బోయెనట. ఇది యిటులుండ యింటివద్ద ధీమంతుడు చెప్పిన ప్రకారంబున మరునాడు సూర్యోదయకాలంబునకు రాకుండుటంచేసి, భయంబుచెంది నేనును కుమారుని వర్తమానం బెరుంగ నిందువచ్చితిని. శత్రుంజయా! ఇక నేమి చెప్పుదును? నేనిచటకు వచ్చునప్పటికే రాజభటులిద్దరా ధీమంతుని శిరంబును కోటకు గట్టిపోవుచుండిరి. అనుకున్నంత పనియైనది. ఆనాడు ముని వచించినది జరిగిపోయినది. నేననేక విధంబుల దుఃఖించితిని. కాని నాబిడ్డ ధీమంతుడు లేని సామ్రాజ్యము నాకు స్మశానంబువలె దోచినది. పుత్రశోకముచే పట్టణంబునకు పోలేకపోయితిని. ఆ తరువాత నాబంధు వ్రాతమును—మంత్రి, సేనాధిపత్యాది మిత్రబృందమును, మహాదేవపుర పౌరులునువచ్చి ‘మరణించినవారితో మరణింతుమా? ప్రభూ పట్టణంబు నకు దయచేయు'డని ప్రార్థించిరి. నేను రాజ్యభోగంబులపై విరక్తి

చెందిన కారణంబున నాకలంజూచి 'అయ్యో లారా! అచటకువచ్చి మాత్రము నేనేమి సుఖమందెదను. ఇందుండినా కుమారుని ముఖంబు నైన చూచుకొని కొంత యనుక మనశ్శాంతి నొందెద'నని చెప్పి వారి నంపించితిని.

"శత్రుంజయా! నిన్ను చూచిన తోడనే నా పుత్రుండు ధీమంతుడు జ్ఞప్తికివచ్చెను. అందువలన వేగంబుగవచ్చి నిన్నాపితిని. బాబూ! ఆ సన్యాసి ప్రశ్నలతో మన కవసరములేదు—చింతామణి పరిచయమంత కంటెను ప్రశస్తమైనదికాదు. కావున నామాట విని నీ వీ ప్రయత్నము నుండి వైదొలంగుము. స్వగృహోన్ముఖుడవుకమ్ము. లేదా నాతో గూడ మహాదేవపురంబునకురమ్ము. ధీమంతుడులేని విచారము నిన్ను చూచియైన మరచెదము."

యువ:— అమరనాథ సుధీవరా! మహాదేవ పురంబునకే వచ్చువాడను కాంచనపురికి పోలేక పోవుదునా? మా తండ్రి నాకందేమయిన నపకారము గలిగించినగదా నేనన్య రాజ్యంబులలో తలదాచుకొ దగినంత సమయంబువచ్చెను? నా ప్రయత్నమిపుడు చింతామణి ప్రశ్నలకు బదులు చెప్పుటగాని, వచ్చిన బాటను తిరిగి పోవుటకుగాదు.

ముదు:— అచటకు బోయినచో నీకు విజయంబు లభింపదు.

యువ:— పోనిమ్ము.

ముదు:— అట్టియెడ నీకీ ప్రమాద కృత్యమేల?

యువ:—కార్యమును సాధించుటయే క్ష్మాపతినందనుని లక్షణము. ఫలాఫలంబులమాట పరంధాముని కెరుక. దయయుంచి నాకింక శెల వొసంగుడు. నేను త్వరగ పోవలయును. అనుచు శత్రుంజయుడు వెనుక బిలుచుచున్నను వినక రయంబునబోయి గొలుసులాగెను. గంట గణ గణ మ్రోగెను. రాజభటులా శత్రుంజయుని వెంట నిడుకొని సన్న్యాసి మఠంబునకుం గొంపోయిరి.

ఆహా! భయంకర మృత్యుదేవతయని యెరింగియు రాకుమారులు ప్రేమించుచునే యున్నారు—అంత మొందుచునేవున్నారు. ఇదియేమి మాయయో యూహించుట దుస్సాధ్యముగనున్నది. ఆడది—అందును కన్నె తన మందున్న చిన్నది. ఆ వన్నెలాడి చేతిలో చావు వీరందరి కానందదాయకమా యని యోచించుచుండ నమరనాథుండు తన కన్నులను

తాను నమ్మలేకపోయెను. ధైర్యము తెచ్చుకొని మరల చూచునరికి తన సందియము స్పష్టపడినది.

ఇద్దరు రాజభటులు మొండములేని తల నొక దానిని తెచ్చి కోట కొమ్మకు గట్టుచున్నారు. అకటా! అతడవడో కాదు. ఇంత దనుక తనతో సంభాషించిన శత్రుంజయుడే. చింతామణిచే నరకబడినాడు. పాప మాత డెంత దనుక చెప్పినను వినకపోయెనే? ఇంకను సందేహమా! మరికొందరు భటులా శత్రుంజయుని మొండెమునుగూడ దెచ్చి పీనుగుల కుప్పయందు పడునటులా కందకమున వైచుచున్నారు. పాపమితడైనను జీవించియుండకూడదా? ఇంతట నేనియు నీకామపిశాచము తొలంగిపోవు నన్న నమ్మిక యెక్కడిది? ఇంకెంద రింక గతింతురో—యెన్ని శిరంబు లా కోట కొమ్మకు కట్టబడునో? ఇందరి నిట్లు వధించిన పిమ్మట నారాజాంగన వివాహమాడి మాత్రమేమి సుఖమందగలదు? ఒకవేళ యీమనుజాకార మహామారి పెళ్ళికి రాకుమారుల నాశనంబు లాంఛనమై యుండునా? లేక యీ పడుచు రాజపుత్రుల తలలన్నియు గ్రుచ్చి చింతామణి వివాహంబున పూలమాలలు వైచుకొందురా? వీరినందరిని వధించిన రక్తంబును కడవలకునింపి వివాహవేడుకలో వసంతము చల్లు కొందురా!" యని శోకించుచు సమరనాథుండు స్రుక్కి, సొమ్మసిల్లి, పడిపోయెను. ఆ పడకయందే నిద్రాపరవశుడై మరల మానవలోకమును చేరునప్పటి కప్పుడే శత్రుంజయుడు మరణించి రెండవదినమైనది.

## ప్రభాకరుని పుత్రశోకము

కాంచననగరంబున ప్రభాకరుండు కొలువుదీరియుండ కొందరు వార్తాహరులరుదెంచి "మహారాజా! మన శత్రుంజయులవారు చింతామణిచే సంహరింపడినారు" అని దెల్పిరి. అంత ప్రభాకరుండు విచారింప దొడంగెను. హా! నా ముద్దుకుమారా! నీ కప్పుడే నూరేడులు నిండినవా నాతండ్రీ! నీకీ రాజ్యంబు నొసంగి విశ్రాంతిగై కొన నిశ్చయించుకుంటినే— అట్టి నీతండ్రి యడియాసలన్నియు నట్టేటముంచి పోయితివా? నాతండ్రీ! నేను తప్పక నా సన్యాసి ప్రశ్నలు విప్పగలననియు—చింతామణి చేబట్ట గలననియు, మాకెన్నియో ధైర్యంబులు చెప్పిపోయితివె కుమారా! మాతో చెప్పిన మాటలన్నియు మరచిపోయి హాయిగ స్వర్గపురంబు

చేసితివా ?" అని విలపించుచుండ మహామంత్రాదులు ప్రభువుగారి విచారమును చూడలేకపోయిరి.

ఆ సమయంబున అమాత్యశేఖరుండు లేచి "ప్రభూత్తములవారు మా ప్రార్థన లాలకించవలయునని కోరుచున్నాము. రాజేంద్రా! శత్రుంజయుని దుర్మరణమునుగూర్చి మనపురంబున దుఃఖించనివారుండరు. యువరాజులవారిని గోలుపోయినందుకు మాకు మాత్రము విచారము లేదా? శ్రీకులయిన మీవంటివారికీ యశాశ్వత శారీరములకు సంతాప మందవచ్చునా? శత్రుంజయునికై మనమేల చింతింపవలయును? ప్రపంచమున ప్రతిజీవియు యెచటనుండి వచ్చెనో అచటికి పోయితీరవలయును. నేడుగాకున్న మరొక్కనాడయిన మనమును వానిలో చేరువారలమె. కాని పెండ్లి పేరంటము చేసుకొని, రాజ్యపాలనచేయుచు చిరకాలంబు సుఖించిన పిమ్మట త్యజింపదగిన కాయమును నల్పాయువునందు దొలంగినందుకె యొకించుక చింతింపవలయును. మహాప్రభూ! ప్రతాపునకును యిపు డిరువదెనిమిదవ వత్సరముకదా? వానికిపుడు యువరాజ్యపట్టాభిషేకంబుజేసినచో శత్రుంజయులవారి దుర్మరణవిచార మొకింత మరచి పోవుటకు వీలగునని దలంచుచున్నాను."

అని చెప్పుచున్న ప్రధానమంత్రులవారి యాలోచన సమంజసముగ నున్నదని సర్వప్రజాభిప్రాయమనుచు కరతాళంబుల వాయించిరి. ప్రభాకరుండును మంత్రిగారి యభిప్రాయమున కానందించెను.

ఆ సమయంబున ప్రతాపుండును రాజకొల్వున కేతెంచి తండ్రికి నమస్కరించి "జనకా! మాఅన్నగారయిన శత్రుంజయుండు చింతామణి కరవాలమునకు బలియైనట్లు తెలిసినది. నేనిపుడేపోయి యాదుర్మార్గురాలి పీచమణంచి వచ్చెద సెలవిం"డనికోరెను.

అంతలకా భూనాధుండు చివాలునలేచి ప్రతాపుని యాలింగనము గావించి "వత్సా! నీకుంగల సోదరాభిమానము నేనెరుంగనిదికాదు. అయినను మన కిది సమయంబుగాదు. ఇందు చింతామణి దోష మేమున్నది? ఆమె చేయనున్న శిరచ్ఛేదమును ముందుగనే ప్రకటించినది. అది యెరింగియు మీయన్నయే యిచ్చగించి యామరణ వేదికను యెక్కినాడు. అకాల మృత్యువును చెందినాడు. సన్యాసిగాని, చింతామణిగాని, మన రాజ్యంబునకు వచ్చినారా? మనల నిర్బంధించినారా? కుమారా! వారిపై మనకేలపంతము? నాయనా! మీయన్నగారికి

సేయ నెంచిన యువరాజపట్టాభిషేకము నీకొనరించుటకు పెద్దలందరు నంగీకరించియున్నారు. నీవీ ప్రయాణమును విరమించుకొని మాయభిప్రాయమును పూర్తిగా మన్నింపుము. జ్యేష్ఠపుత్త్ర వియోగంబుచే నేను కుమిలిపోవుచున్న నా మనంబించుక నూరట చెందవలయునన్న నీవు రాజ్యభారమును వహింపు"మనెను.

ప్రతాపుండా మాటల కామోదించక "తండ్రీ! అన్నగారు దిక్కులేని దుర్మరణము నొందగ నేను హాయిగ రాజ్యాభిషేకము చేసికొని సౌఖ్యమందుదునా? అన్నగారిని హరించిన ఆ మహాపాతకురాలి రూపనామములేకుండ హతమార్చి రమ్మని నన్నంపవలసిన మీరిట్లు మందలించుట న్యాయమా? ప్రాణముల కాశపడి భ్రాతృద్రోహము సహించుట వీరలక్షణమా? మహారాజా! అన్నగారిని వధించిన చింతామణిని గొని వచ్చి మీ ముందు నిలుపబెట్టకుండగ నేనింక నొక్కదినమేనియు నుండజాలను. కావలయునేని యీ రాజ్యాభిషేకమును నా తరువాత వాడయిన అరిమర్ధనున కొసంగుడని బిర బిర వెడలిపోయెను.

ఆహా! విధిమహిమ. ప్రతాపుడు మార్తాండ నగరమునుండి తిరిగి రాలేకపోయెను. అది యేమి ప్రారబ్ధ కర్మమో కాని వరుసగ ప్రభాకరుని పుత్రులార్వురును హరించిపోయిరి. కడుపుపండి, కన్నుల పండువుగ బిడ్డలనుగన్నతల్లికిని పుత్రశోకము తీరలేదు. కాంచనపుర పీఠంబుపై నెక్కుటకింక రాజసంతానమున నొక్కరును మిగిలి యుండకపోయిరి.

చంద్రనగరాధిపతియగు జయసింహునకు సంతానము లేక తన యవసానకాలమందు సుధాకరుని దత్తుగస్వీకరించి, వానికి పట్టముగట్టెను. జయసింహుడు కాలధర్మము నొందిన పిమ్మట రాణిగారే సుధాకరుని సింహాసనమున కూర్చుండబెట్టుకొని బావగారయిన ప్రభాకరుని యండదండలతో రాజ్యపాలన చూచుకొనుచుండెను. ఇపుడు సుధాకరునకు పదునైదు వత్సరములు దాటినవి.

బావగారి కుమారు లార్వురు మరణించిన వార్త విని గిరిజారాణి విచారపడినది. తరువాత మరికొంతకాలమునకు సుధాకరుండును కాంచనపురి కేతెంచెను. ప్రభాకరుండా సుధాకరు నాలింగనముచేసికొని, బుజ్జగించుచు వాత్సల్యంబున కుశల ప్రశ్నలుచేసెను. సుధాకరుండును తన్నతిగారవంబున చూచు రాజదంపతులు తన కాప్తబంధువులని దలంచి కొన్ని దినంబులుండి తిరిగి చంద్రనగరంబునకుం బోయెను.

ఆ సమయంబున ప్రభాకరుండు తనమంత్రిని రావించుకొని రహస్య మందిరమున నుచితాసనుడై "సచివరా, దైవయోగంబున నాకు గల పుత్రులిద్దరు మరణించిరి. కడమవాడయిన సుధాకరుండు పసినాట నుండి పినతల్లిచెంతనే పెరిగిన వాడగుటచే నతనికి మేమెవ్వరమో తెలియ దయ్యె. ఇట్టియెడ మనమేమి సేయవలయునో కర్తవ్య మాలోచింపు"మని కోరెను.

ఆ మాటలకు మంత్రియు కూడ మాలోచించి యిట్లు భాషింప దొడంగిరి.

మంత్రి:— మహారాజా! సుధాకరుడే యిప్పుడు మన కాంచనపురంబునకు యువరాజు గాదగినవాడు. వెంటనే గిరిజారాణిగారిని పిలిపించి "ఇంకమీదట సుధాకరునకే కాంచననగర రాజ్యాభిషేకంబు గావింప వలయు" నని తెలిపినచో బాగుండునని భావించుచున్నాను.

ప్రభా:— అందులకు మామరదలేమియు నాటంకము చెప్పదు గదా?

మంత్రి:— ప్రభువులవా రనవసరమయిన సందేహము నందుచున్నారు. గిరిజారాణిగారికి మాత్రము మీయందు భక్తిశ్రద్ధలు లేవా? ఆమె కుటుంబమును నిలువబెట్టినవారు మీరేకదా? అట్టియెడ ఆ గిరిజారాణిగారు మాత్రము మీకష్టనిష్ఠురంబులనుగూర్చి యాలోచింప కుందురా?

ప్రభా:— సచివరా! గిరిజ విషయమై అటులుండనిమ్ము. సుధాకరు డారుమాసములవాడయి యుండగ వారికి దత్తు నొసంగితిమి. తిరిగి యిప్పుడు పరిగ్రహించుట దోషముకాదా? పూర్వజన్మంబున నెవ్వరి వంశమును నాశనం బొనరించితినో గాని యీ జన్మంబున మహారాజ్య భోగంబు లనుభవించుచును, నాతరువాత నాసింహాసన మెక్కుటకొక్క కుమారుడైనలేని మందభాగ్యుడనైతిని.

మంత్రి:— ప్రభూత్తమా! తమకు సంతానపు లోటేమున్నది? షట్చక్రవర్తులవలె నాయిద్దరు పుత్రులు నేటివరకు పెరుగలేదా? వారేమి విద్యాహీనులా? వివేకశూన్యులా? అంగవైకల్యులా? అసమర్థులా— కారు. కాని దైవయోగము మనకు ప్రతిబంధకమైనది. కాలగర్భంబున నా సంతానమంతయు నంత మందుటచే సుధాకరుని నిమిత్తమై యిట్లాలోచించుచుంటిమిగాని వేరేమున్నది? మహారాజా! మరియొకటాలోచింపుడు.

సుధాకరుడు చంద్రనగరాధిపతిగ యుండియె కాంచన నగరంబునకును విభుండు గావచ్చునుగదా ? అందు సుధాకరుని రాజ్యము మరింత విస్తరించుచున్నది కాన గిరిజాదేవియు శంకింపవలసిన కారణ మేమున్నది ? అదియునుగాక సుధాకరుండును, గిరిజాదేవియు వారి యిచ్చవచ్చిన రాజ్యములం దుండవచ్చును. కాంచననగర చంద్రనగరంబులలో వారికి భేద మే ముండును ?

ప్రభా:— అవును. ఈ విషయంబు ముందుగ గిరిజాదేవితో చెప్పుట మంచిదికదా ? సుధాకరుడు పసివాడు. మరియు పోరుల వలెనె పట్టుదలగలవానివలె దోచుచున్నాడు. అతనివి కన్న తల్లిదండ్రులము మేమేనని తెలియచేసినచో, తీగెనుబట్టి డొంకంతయు కదలినట్లు శత్రుం జాయాది కుమారులమాట చెప్పక తప్పునా ? చింతామణి వార్త వినినచో సుధాకరుండును మార్తాండపురమున కేగక యిందు నిలుచునా ?

మంత్రి:— ప్రభాకర భూపాలా ! మీరు వచించినది యు యదార్థమే. సుధాకరునకు చెప్పవలసినంతవరకే చెప్పవలెను. ఆ పైని విషయంబులు మధ్య పరచకున్నచో ప్రమాదము సంభవించుట యదార్థము.

ప్రభా:— అదెట్లు ?

మంత్రి:— సుధాకరుని పిలిపించి......

ప్రభా:— ఎప్పుడు.

మంత్రి:— రేపటి దినంబుననె......

ప్రభా:— మరి వాని పెంపుడుతల్లి గిరిజాదేవియో ?

మంత్రి:— ఆమెయును రావలసినదె. ముందుగ నీ సందర్భము లా గిరిజాదేవితోడనే మాటలాడి కొన్ని విషయంబులు గిరిజాదేవిచేతనే సుధాకరునకు చెప్పించిన పిమ్మట మనమేదయినను చేయవలయును.

ప్రభా:— మహామంత్రీ ! మీ యుక్తి మిగుల రక్తిగ నున్నది. ఆ విధంబున సుధాకరుని నమ్మింతుముగాని నాకు మరొక సందేహ ముద యించు చున్నది.

మంత్రి:— ఏదది ?

ప్రభా:— మన కుమారులు గతించిన చరిత్ర లోకవిదితమై యున్నది. సుధాకరునకా వార్త నెవరయిన చెప్పకుందురా ? రాజ్యం

బున నెవరి నోరుమూయగలము? కుండమూయ మూకుడుండునుగాని నోరుమూయ మూకుడుండునే యను సామెత మనమెరుంగనిదియా?

మంత్రి:— లోకులమాటల మరణవార్త యేనాటి కయినను తెలియక పోదు. కాని, కొంతకాలమయినను సుధాకరున కా విషయంబులు తెలియరాదు. ఈ నడ్మ కాలంబునందె యొక మహా సౌందర్యవతియగు రాచకన్నియను వెదకి వివాహంబు గావింపవలయును. సుధాకరుని విడిచిపోకుండగను, వరు లే తరుణమందును; యేకాంత ప్రస్తావనలు చేయకుండగను; వాని ననుసరించి యుండుట కొక పదిమంది విశ్వాస పాత్రులయిన యువక మిత్రుల నియమింపవలయును. సుధాకరుని మనస్సు సర్వదేశసుందరాంగుల యందును పోకుండ విశేషసుందరాంగనల పోషించి, నిరంతర మానందముగనుండి సుధాకరుని మైమరపించుడని వారి నాజ్ఞాపించవలయును. అతడిల్లు వీడి సవిసచో నాతని వెంట విశ్వాస పాత్రులగు యువకమిత్రు లుండునటుల చేయవలయును ఇట్టిస్థితంబున కట్టుదిట్టము చేసినగాని వానికి చింతామణి వృత్తాంతమును, సోదర మరణంబులును తెలియరావు. సుధాకరుండు సంసారగోష్ఠిలో నిమిడిరి, యుభయరాజ్య భారంబుల మోయునాడు తెలిసినను మోసము రాదు. వలయునేని సుధాకరునకు యొంటరిపాటు లిగించరాని భారంబును, మన ముకుందునిపై వేయుదము.

ప్రభా:— ఆహా! ఎంతటి రాజతంత్ర క్రియాధురంధరుండవు మిత్రమా! నినుబోలు మంత్రులుండిన ప్రభువులకు కొరంతలుండునా? నీ యిచ్ఛవచ్చినటులే సర్వప్రయత్నములు సమకూర్పుము. సుధాకర గిరిజలనుగూడ రప్పింపుము.

మంత్రి:— చిత్తము.

అని దెలిపిన మంత్రి పట్టణంబున కావలసిన యేర్పాటులన్నియు భద్రముగ చేయించెను. కాంచనపురమందుగల పల్లెపల్లెల, వీధివీధుల, నిట్లు చాటింపబంపెను.

డప్పువారును మిగుల శ్రద్ధాభక్తులతో నాబాలగోపాలమునకు తెలియునట్లు, "అయ్యలారా! మన కాంచన నగరాధిపులైన శ్రీ శ్రీ శ్రీ ప్రభాకరభూపాలు కుమారు లాఱ్వురు అపూర్వచింతామణిచే వధింప బడిన వృత్తాంతము మన కందరకు తెలిసినదియె. ఇపుడు మన రాజ్యంబు నకు ప్రభాకరులవారి తరువాత ప్రభువుకాదగువారు లేరు. మనరాజు

గారు తన యేడవకుమారుడైన శ్రీ సుధాకరరాజుగారిని ఆరుమాసముల వయసునందుండగ చంద్రనగరాధిపులయిన జయసింహామహారాజులకు దత్తుగ నొసంగిరి. ఇప్పుడా సుధాకరప్రభువులవారికే మన కాంచనపురంబును పట్టాభిషేకంబుసేయ యత్నించిరి. కాన, శ్రీశ్రీ ప్రభాకరులవారు సుధాకరునకు తానే తండ్రినని ప్రకటింపనున్నారు. అయినను శత్రుంజయ, ప్రతాప, అరిమర్ధన, విక్రమ, సత్యకీర్తి, ధనంజయులను సోదరులార్వురున్నటులు, వారు మరణించినటులు మాత్రము చెప్పదలంచు కొనలేదు. అటులా విషయంబును సుధాకరుం డాలకించినచో నాతండును అన్నలవలె మార్తాండపురికి పోయి, చింతామణి ప్రశ్నల కేమగునేమొనన్న భయంబున రాజ్యంబులో నే యొక్కరు నా విషయంబుల జెప్పరాదు. కనీసము బహిరంగముగ నాచరిత్రల నయినను వక్కాణింపరా”దని రాజుగారి యధికార పత్రిక ప్రకారము తెలియజేయుచున్నాము. ఈ ప్రకటనను అతిక్రమించినవారికి మరణదండనము తప్పకవిధింతురు. ఆ శిక్షకు వేరు యుపేక్షలేదని తెలియచేయుచున్నాము.

పై విధంబుగ చేయదగిన పనులన్నియు జరిగినవి. ఈ ప్రకటనలన్నియు పూర్తియైన పిమ్మట సుధాకరుండు కాంచననగరంబునకు వచ్చెను. గిరిజాదేవియు ప్రభాకరుని ప్రసంగమున కామోదించి కుమారుని జీరి “సుధాకరా! నీతో కొన్ని విషయంబులు చెప్పదలంచితిని.

సుధా:— ఏమిటమ్మా!

గిరి:— నీవు యదార్థముగ నాకు పెంపుడుబిడ్డవుగాని, నా గర్భంబున బుట్టిన తనయుండవుగావు.

సుధా:— ఆలాగని నే నెప్పుడు వినలేదేమమ్మా!

గిరి:— నీకాసంగతిని చెప్పదగిన సమయ మింతకుముందు రాలేదు. ఇప్పుడు చెప్పవలసి వచ్చినందున చెప్పుచున్నాను.

సుధా:— అటులయిన నన్ను కన్నవారెవరు?

గిరి:— నిన్ను కన్నతల్లి నా సోదరియగు భారతీదేవి. నీ తండ్రి యీ ప్రభాకరుండు.

సుధా:— అందులకా, ఈ రాజదంపతులు నాయం దింత పుత్రవాత్సల్యమును చూపుచున్నారు.

గిరి:— అవును తండ్రీ! మీతండ్రి జయసింహ మహారాజులవారు మరణవేదన ననుభవించుచుండిరి. వారికి సంతానము లేనందున మా బావగారగు ప్రభాకరభూపాలుండు నిన్ను మాకు దత్తు నొసంగెను. అప్పటికి నీవయసు ఆరుమాసములు మాత్రమె. నీకు కన్నతల్లిదండ్రులు లేరని తెలిసినచో నీవిక్కాంచననగరంబున నుండవని యింతవరకా రహస్యంబును నీకెఱింగింపలేము.

తరువాత నిన్నుగన్న తల్లిదండ్రులకు మరల సంతానము లేక పోవుటచే నేడు కాంచననగరంబునకు యువరాజు లేడయ్యె. కావున నింకమీదట నీవే కాంచననగరాధిపత్యమును వహించవలయును. అదియునుంగాక నీకిపుడు వివాహము సేయుట ప్రధానమైయున్నది. అందు పెళ్ళికుమారుడవు నీవే పెద్దరికము వహించుటకంటె—భర్తలేని విధవను నేను చేయుటకంటె, ప్రభాకరభూపాలుని యిష్టానుసారంబుగ జరిగించుట శ్రేయస్కరము. వారు నిన్నుగన్న తండ్రులు—నాకు బావలు. అంతియ గాక వారింక చేయబోయి చేయు కార్యములునులేవు. నీకు తండ్రియు—దైవసముండును—పూజ్యుండునైన వారి యాజ్ఞానుసారము ప్రవర్తించుట మన కర్తవ్యము.

సుధా:— అమ్మా! మీయుపదేశమునందు పనికిరాని దేమున్నది? నా భావిఫలంబునుగూర్చి దెలిపిన మీయాజ్ఞ నుల్లంఘింతునా? అటులే చేయు దనుచుండ నంత వసుక నోకించుక చాటుననుండి వారి సంభాషణ లాలకించుచున్న భారతదేవి ప్రభాకరులు ముందునకు వచ్చి సుధాకరుని తమ చెంతకు దీసికొనిరి. సుధాకరుండును రాజదంపతులయందపరిమితానందకరముగ మాతృపితృభక్తిని ప్రకటించెను. మరునాడె సుధాకరునకు మంత్రి కుమారుడయిన ముకుందుడు చెలికాడయ్యెను.

---

## సుధాకరుని వేట

ఆ సమయంబున సుధాకరుం డొక్కనాడు మృగంబుల వేటాడ నుత్సాహమందెను. వెంటనే మిత్రుడయిన ముకుందుని రావించి "ముకుందా! నాకు చిరకాలమునుండి వేటాడ నుత్సాహముకలదు. నేడు తప్పక నేదేని యుగారణ్యంబులకుం బోవుద"మని ప్రబోధించెను.

రాకుమారుని యభిమతంబును గాదన జాలక ముకుందుడును వనంబులకు పయనమైరి. వారి యాజ్ఞానుసారంబుగ రాజభటులు రెండు తురంగములగొనివచ్చిరి. ముకుందసుధాకరులా హయముల నధిరోహించిరి. ఆ అశ్వద్వయము భూమిదద్దరిలుచున్నదా యనునట్లు లఘుగతులవైచుచు-మేఘంబుల నంటుచున్నవా యన్నట్లు నాకసంబున కెగయుచు-వాయువున గలియుచున్నవా అన్నట్టులు ముందునకు దుముకుచు నతిలాఘవంబున నరణ్యసీమలకుం జనుదెంచెను.

మిత్రమా! ముకుందా! గంభీరమయిన యీ కీకారణ్యంబు నవలోకించితివా? అదిగో! అటుచూడు చీమయైనను దూర శక్యంబుగాని గచ్చపొదలు—ఫాలాక్షుని శూలంబులకన్న నిశితమైన కంటకంబులతో నిండిన యీ వెదురు పొదలు—జడలు విరియబోసి చూపరుల హృదయంబులు బ్రద్దలుచేయు భూతంబులవలె నున్న నీ వటవృక్షంబులు—నక్షత్ర మండలంబుతో నెకసక్కెములాడుచున్నవా యన్నట్లు మిన్నుముట్టుచున్న నా తేకుమ్రానులు—కర్ణపుటంబులవియ గీపెట్టు కీచురాయి—మదించిన కరీంద్రబృందములతో; గర్జించు సింహశార్దూల సమూహముతో; బుసగొట్టు త్రాచుపాములతో; ఎదురైన జీవంబులచీల్చి చెండాడు యెలుగుబంట్లతో; బెదరి పరుగిడు హరిణకోటితో, శాఖలపైనుండి వింతగ దుముకులాడు మర్కటంబులతో నిండియున్న ఈవనము మనము తప్పక వేటాడి తీరవలయు"నని సుధాకరుండు పట్టుబట్టెను.

ముకుందుడును విధిలేక తన గుఱ్ఱమును డిగ్గి విల్లు ధరించెను. వారిరువురి గుఱ్ఱంబుల నొక వృక్షంబునీడ విడచి బహుకాలము వేటాడిరి. తోడేళ్ళ వెంట పరుగిడిరి—పులులతో పోరాడిరి — భల్లూకములపట్టి బంధించిరి—ఎనుబోతుల నదలించిరి. అట్లు బహుకాలము మృగయా వినోదంబుపూర్తి గావించి—యొకించుక విశ్రాంతి గైకొన నిశ్చయించిరి.

ఆ సమయంబున వారి కించుక దూరంబులో నొక నిర్మల జలాశయము గోచరించెను. వెంటనే మిత్రద్వయమా కొలనుజేరి స్నానంబులు సేయదలంచినవారై వారివారి వస్త్రభూషణాదులను దూరముననుంచి మనోల్లాసంబుగ నీట దిగిరి. నిజమునకా జలాశయమెంత మనోహరముగ నున్నది? చక్కని తామర లా కొలనున కెంత నలంకారమును గూర్చుచున్నవి? ఝుంకారమును సేయుచు మకరందము గ్రోలవచ్చిన మధుమక్షికములు సైతము నేత్రపర్వంబును గావించుచున్నవి. ఆ

తోయంబులందున రాజహంసలు విహరించుచున్నవి. వివిధపుష్పంబులు విల్లవిరిసి సొబ్బుగ రాలిపోయినవి. ఆహా! ఇట్టి భయంకర వనమధ్యంబున నిట్టి మహాప్రాకారపు మొలచెంచు కనుగొను డిరంబులుండుట కేమికారణమా యని వా రాలోచింపసాగిరి.

సుధాకర ముకుందు లందు మునుంగుచు - లేచుచు - లోతులం జూచుచు నీదుచు చాలకాలము స్నానంబులు చేసివచ్చి మరల వస్త్రాభరణంబులు ధరించు సమయంబున మిట్టమధ్యాహ్న మార్తాండుడును పశ్చిమాద్రికి చేర నా దిక్కునకు బ్రాలుటచే తీక్షణకిరణ ప్రసారము యించుక శాంతించినది.

అట్టియెడ నా వేటగాండ్రు మరల విహరింప జొచ్చిరి. ఆహా! ఇదెంత సుందరవనలక్ష్మి. వివిధపుష్పలతా వితానంబము లెంత ప్రకృతి శోభను సంపాదించుచున్నవి. సెలయేటి కాలువ కెంతటి సీతలమారుతంబుల నొసంగుచున్నవి. కోకిలారావములెంత మనోజ్ఞముగ కిలకిలారావము చేయుచున్నవి? ముకుందా! తొందరలేదు. మన తురంగములా పచ్చిక బయళ్ళలో హాయిగ మేయుచున్నవి. మనమును యీ వనశృంగారమును తనివిదీర జూతమురమ్మని సుధాకరుండు ముందుదారి తీయుచుండెను. ముకుందుడును సుధాకరుని వెంటనంటెను.

అదిగో అటుచూడు. ఆ యినుకతిన్నెలమీద నొకించు విశ్రమింతము. ముకుందా! ఈ సంధ్యావేళ - యీ సువిశాల తిన్నెలమీద - యీ పిల్లతెమ్మెరల నడుమ స్థాయిగ శయనించుభాగ్యము మనవంటివారికి లభింపదుగదా! అని యేమియో భాషించుచుండెను.

ముకుందు డింతవరుక సుధాకరునితో సహకరించెను కాని యిక మీద వ్యతిరేకింపబూనెను. దూరముననున్న నిజపట్టణంబు చేరుట కాలస్యమగునుగదా? అందును చీకటి రాత్రులంత జాగారింపనేల? ఇంతటనేనియు తురంగములనెక్కి గృహోన్ముఖులమయినచో సుఖంబుగ నిలుజేరుదమని ముకుందుడు హెచ్చరింపబూనెను కాని సుధాకరుడ నా మాటలు చెవినాటనేలేదు. అగుగాక, మనము మన పనులను నిర్వర్తించకున్నను లోకబాంధవుండగు సూర్యభగవాను డొక చోట నిలుచుండడుగదా?

---

# సుధాకర ముకుందులు

అది సంధ్యవేళ. అప్పుడే లోకబాంధవుండు పశ్చిమాద్రిపై వ్రాలు చున్నాడు. ఎటుజూచినగాని గగనవాణి మోహమంజిమయు కెంపైనాయను నటుల కెంపుఛాయల నిండియున్నది. ఆ యమ ముఖమైన ఒడిని గురించి సర్వకర్మసాక్షియగు సూర్యభగవానుని వియోగమునకు విలపించు చున్నదో; దివమంతయు చండకిరణ ప్రసారముచే కలయింపజేసిన భానుం డించుక దూరమైనందున నమితానంద మొందుచున్నదో? నక్షత్రజాలము గాని చూచువారి నేత్రద్వయములకు మాత్ర మాహ్లాద మొదవించు చున్నదని చెప్పక తప్పదు.

అయినను ప్రకృతియం దొకరి ఖేదము మఱొకరి మోదమగుట నైజముగదా? కమలములకు విచారము—కలువలకు వినోద మొదవు చున్నటులే ముకుందునకు భీతి—సుధాకరునకు ప్రీతి పెంపొందుచున్నవి. అయ్యది ముకుందునకు ఘోరారణ్యము—సుధాకరున కుద్యానవనము. మంత్రి కుమారునకు తొందరపాటు—మహారాజకుమారునకు మందగమనంబు. వానిది ముందాలోచన—వీనిది మోహావలోకన.

"సుధాకరా! ప్రొద్దువాలిపోయినది. ఇక మన మీయరణ్య మధ్యమందుండుట మంచిదిగాదు. పొలంబులలోని రైతులు సైతము వారివారి పనుల విరమించి యిండ్లకేగు వేళ మన మీయడవిలో నొంటరి పాటున నుండనేల? నేడుదయంబునుండి యవిలాఘువంబుగ వేటాడితిమి కదా? అటు చూడు. పగలంతయు మేతలకై పోయిన పక్షి సమూహంబులును తమతమ నివాసంబులకు చేరుకొనుచున్నవి. మన మీపక్షుల కన్నను దిక్కులేని పక్షులమై యీ రాత్రికాలమం దీ మహారణ్యంబున నీ బుసగొట్టు సర్పంబుల ముందు—ఆ గాండ్రించు సింహశార్దూలభల్లూకాది మృగంబుల నడుమ—విచ్చలవిడిగ సంచరించు గబ్బిలాలయెదుట విచార నిలయంబైన నిర్వనమందుండనేల? త్వరగ నింటికే పోదముర"మ్మని ముకుందుడు తొందర పెట్టుచుండెను.

అయినను సుధాకరుడు తొందరొందుటలేదు. తొందరొందుటలేదు సరికదా, తొందరించు ముకుందుని సైతము మందలించుచున్నాడు. "ముకుందా! ఎందులకీ యందోళన? అందాలు చిందించే చందమామ సుందరమైన వెన్నెలలిందు పెంపొందించుచుండ డెందంబున కుందెదవేల? పిండారబోసినట్లీ వెన్నెల—మనోజ్ఞమయిన యీ మలయమారుతము—

నీ హృదయము నాకర్షించుట లేదా! అదియునుంగాక రాకుమారుడనైన నాకాజ్ఞ యొసంగెదవు గదా!" యనుచు మెల మెల్ల నడచుచున్న సుధాకరునితో ముకుందుడేమియు ననలేక "రాకుమారా! నీ పట్టుదలయే నీదిగాని, నీ కీర్తి నాలోచన లేదేమి! మొత్తముమీద నీవును నిరాయుధులను తీసి పోసి పట్టుదలగలవాడవనిపించుకొంటివి సుమా" యని ముకుందుడు ముందు నడచెను. యంతలో తానేదియో పొరపాటు చేసినటు లౌడుగరచి తెల్లబోయెను.

అసలె అది రాత్రికాలము. అయినను వారు పయనించుచున్నారు. వారు చెరియొక గుఱ్ఱము నధిరోహించి యుండుటచే ముకుందుని ముఖ కవళిక లగ్గట్టె కనిపెట్టలేక పోయినను, ధారాళముగ చెప్పుచున్న మాట నింకనూ సాగింపక తన్నా యాలోచననుండి మరలింప యత్నించు చున్న విధానమును సుధాకరుడు వెంటనే గమనించెను.

"ముకుందా నాకంటె మా తలిదండ్రుల కుదయించిన వా రింకను గలరా? అయిన వా రెందరు? వారివారి పేరులేమి? వా రెందుండిరి? యీ విషయంబు నా కింతవరకు తెలియపర్చని కారణమేమి? నీ వింత సందేహించనేల" యని సుధాకరుడు వరుసగ ప్రశ్నింప దొడంగెను. ముకుందుడెంతకు మారుపలుకకుండుటచే సుధాకరుండు గుఱ్ఱముదిగి, తన సందేహమును తీర్చినగాని, యింటికిరానని కూర్చుండ యత్నించుచుండ "సుధాకరా! ఈ విషయంబు కొండొక కారణంబున నీకు దెలియనీయ రాదని మీ నాన్నగారు రాజ్ఞనొసంగిరి. నేనును మీకు దెలుపనని ప్రమాణము చేసియుంటిని. ప్రమాణమును మీరుట మా ప్రభువుల వారికే ప్రమాదహేతువు. కాని నేను ప్రమాదవశమున నోరుజారితిని. నా మాటవిని నీ విపుడు యింటికిరమ్ము రేపటుదయంబున నీ యుదంత మంతయు మహారాజులవారికి విన్నవించి యా వృత్తాంతము నీకు సవిస్తార ముగ దెలియచేయుదు"నని బ్రతిమిలాడెను.

కొంతకాలమునకు వారిరువురు వాహనంబుల నధిరోహించి మెల్లగ నింటికిపోయిరి. ప్రొద్దుపోవుటచే కుమారునిరాక కెదురుచూచుచున్న మహారాజులవారి ముఖంబున కుమారుని కుశలవార్త విన్నంతనే నప్ర యత్నంబున మందహాస ముట్టిపడినది. ఆ సమయంబున నొక్క మహా రాజులకే ననలేల! రాచనగరునగల ప్రతివారి కాహ్లాదమయ్యెననుట నిస్సంశయము.

సుధాకరు డీనాడు క్రొత్త సుధాకరుడైనాడు — వాని రాకచే నెందరెందరానందమందిరను అతని హృదయంబున మాత్రము చింత దొలంగదాయె. ఆ కళావిహీనమయిన వదనము—ఆ మాంద్యము—ఆ యాహారమందయిష్టత మున్నగు లక్షణంబులచే మరల తన వారిని నొప్పించినవాడయ్యె.

---

## చింతామణి వృత్తాంతము

మరునాడు నిర్ణీతకాలంబునకు ప్రభాకర మహారాజు యథావిధిగ కొలువుదీరి యుండెను. మహారాణి వసంతతిలకయు నామె సపత్నులతో స్వర్ణమయిన సింహాసనమునకూర్చుండ రాజమర్యాదలతో మంగళతూర్యారావములు—స్వస్తివచనంబులు—కవులాశీర్వాదంబులన్నియు ముగియ మంత్రి కుమారుడైన ముకుందుడు లేచి, ప్రభువులకు నమస్కరించి, గత దినంబున వేటకేగి నప్పటి చరిత్రమంతయు జెప్పి కూర్చుండెను.

సుధాకరునకు అన్నల చరిత్ర చెప్పవలసి వచ్చినంతనే రాజదంపతులు భీతిల్లిరి. వసంతతిలక సుధాకరుని జేరబిలిచి "నాయనా! మీ యన్నల వృత్తాంతముతో మనకిప్పుడనావశ్యము. వారి చరిత్ర నడిగి మా గర్భంబున నుపశమించిన పుత్రశోకమును మరల రేకెత్తనీయకు"మని బుజ్జగించెను. కాని సుధాకరు డెంతకు వినకుండుటయు కాక "అమ్మా! మీ రా విషయంబు దెలుపరేని నేనే స్వయముగ రాజ్యంబు విడిచిపోయి సోదరుల వృత్తాంతమరయ నిశ్చయించుకొంటి"నని దెలిపెను.

అంత గత్యంతరములేక ప్రభాకరుండు తన కుమారుండిలు వీడిపోవు నన్న భయంబుతో గత చరిత్ర దెలుపుమని మంత్రి కాజ్ఞ నొసంగెను. మరుక్షణముననే సుధాకరుడు, వానితోపాటు ముకుందుడు, తక్కుం గలిగిన సభాసదులాలించుచుండ మంత్రిపుంగవుం డిట్లు చెప్ప నారంభించెను.

సుధాకరా! మనకు పదునైదామడలలో మార్తాండపురము గలదు. మార్తాండపురము మహదైశ్వర్యంబులకు నిలయంబు-చాతుర్వర్ణ ధర్మంబులందు సక్రమంబున సాగుచుండును. నా పురవైభవాదుల వర్ణింప నాదిశేషునకైనను శక్యముకాదు.

ఆ పురంబునేలు ధర్మశీలుండను మహేంద్రగనరాధిపుడైన దయానిధి మహారాజులవారి యేకైక కుమారుని వివాహమాడి ధర్మంబువిచారక రాజ్యపాలనచేయుచుండెను. అయినను వారికి సంతానములేక చింతించుచుండిరి. అటులుండ నొకనాడు దైవయోగంబున నొక మహాముని యేతెంచి ధర్మశీల మహారాజును దీవించెను. ఆయన శుభాశీర్వాద ప్రభావంబుగ నతనికి స్త్రీ సంతాన ముదయించినది. ఆమెయె అపూర్వ చింతామణి,

మాతాపితృపురోహితులు, ప్రభువుగారు నా మునీంద్రుని దైవమువలె పూజించుచుండిరి. ఆ సన్యాసి కొరకు యుద్యానంబున యోగీంద్రుని యిచ్ఛ ప్రకారము మఠంబులు—మందిరంబులు కట్టించి, అందా మునీంద్రుని వసింపమని నిత్యము వాని పూజింపబోవుచు వచ్చుచుండిరి.

చింతామణియు నైదేళ్ళబాలిక కాగా నామె నా సన్యాసికడనే విద్యాభ్యాసము చేయనంపిరి. ఆమెయు యుక్త ప్రాయమునొందునాటికి సకలవిద్యాలయం దారితేరెను. అంత నామె తల్లి యొక దినంబున "అమ్మా! చింతామణీ! నీకిపుడు వివాహంబుసేయు ప్రాయంబు చేకూరినది. నీ వింక మన వంశాచారము ననుసరించి యిల్లు దాటరాదు. కావున మీ గురువుగారికి కానుకలు గొంపోయి యిచ్చి యీ విషయంబు దెలిపి, వారి వద్ద శెలవుగొనిర"మ్మని దెల్పెను.

తల్లిదండ్రుల యాజ్ఞ ప్రకారము చింతామణి యొక బంగరు పళ్ళెరంబున గురువుగారి కొరకు కన్యక సామగ్రిని భద్రపరచుకొని తన ప్రధాన చెచ్చెలియగు కన్యలతో సన్యాసికడకేగి "ఓ గురుచంద్రా! మా తల్లిదండ్రుల యాజ్ఞానుసారంబుగ నేనింక వివాహమాడవలయునట. కావున నేడు నేనొసంగు యీ గురు కట్నము స్వీకరించి నన్నాశీర్వదింపు"డని ప్రార్థించెను.

సన్యా:— చింతామణీ! నేనును నీ తండ్రిలాంటి వాడనేగదా, నావద్ద నీకేమైనా దాపరికమున్నదా?

చింతా:— లేదు, గురుమహర్షి!

సన్యా:— అయిన నీ విపుడెవరిని వివాహమాడ నెంచితివి?

చింతామణి యించుక సిగ్గుబడియు పితృసముడైన గురువునకు యదార్థము చెప్పనెంచి "మహానీయా! మాయమ్మ తోబుట్టువు

జయంతుఁ డొక్కఁడే కలఁడు. మా మాతామహులు మరణించుకాల మున మా మామగారికి జయంతునిఁ బోషించుభారము మా నాన్నగారి యందుంచెనట. నాఁడు నేను జనింపకపోవుటచే మా తలిదండ్రులెందైన కన్యనుదెచ్చి వివాహముచేయుదమని యొకఁడంబడి వానినే బిడ్డమాదిరిగ చూచుచుండిరి. అటులుండ దైవకృపచే తమరాకయు - తమ యాశీ ర్వాదముచే నేను జనించుటయు సంభవించినది. మా యమ్మకు రక్త స్పర్శతోటి శ్రద్ధగలవాఁడును - నా తండ్రిచే నేటి వఱక మంచిశిక్షలు చూడఁబడినవాఁడును - మేనగోడలనగు నాయం దత్యంత ప్రేమాభిమానం బులుగలవాఁడునగు దయానందభూపతి నందనుండు - మహేంద్రపురపాల కుఁడు - నా మేనమామనే వివాహమాడునట్లు మా తలిదండ్రులు నిర్ణ యించిరి.

సన్యా:— మంచిదికాని అమ్మాయీ! నా యాజ్ఞానుసారంబుగ నీ వివాహంబు జరుగవలయునని దలంచుచున్నాను. అంగీకరింతువా?

చింతా:— పితృ తుల్యులయిన మీ యాజ్ఞ మీరుదునా? కాబోవు నా మాంగల్యముసాక్షిగ మీ యిష్టానుసారముగ నా వివాహము సాగింతును.

సన్యా:— అటులయిన వినుము. నా మఠమునందే నీవును యొక మందిరము గట్టించుకొనవలయును. నీవీ పరిచారికతో నందుండి వెడలరాదు. అవసరమయిన నీ తలిదండ్రులు మాత్రమువచ్చి చూచిపో వచ్చును. నిన్ను వివాహమాడుటకు వచ్చిన రాకుమారుని మూఁడుప్రశ్న లడుగవలయును. వాటికి సమాధానము చెప్పినచో వానిని వివాహమాడ వచ్చును. అతఁడు చెప్పు సమాధానము సరిపోకున్నచో నేను నీకు రహస్యముగనుండి చప్పుడుచేయుదును. వెంటనే యా రాకుమారుఁడు పరాయివాఁడయినను, బంధువయినను, కడసారికి మీ మేనమామ అయినను, వెనుకాడక నీ చేతనున్న కరవాలముచే వానిని నరికి శిరమును కోటకొమ్మకుగట్టి, కళేబరము నొక లోతైన కందకమున పార వేయించ వలయును. ఏమందువు?

ఆ మాటలకు చింతామణి ముందు భీతిల్లియు ఆడినమాట మీఱ నేరక సరేనని తలిదండ్రులకు దెలిపెను. ధర్మభూపాలుండు తన కుమార్తె వివాహంబున కిట్టి యంతరాయ మొదవినందుకు నెంతయు చింతించియు,

మునిశాపంబు పెట్టినేమోయన్న భయంబున చేత నంగీకరింపక తప్పని దయ్యెను.

తరువాత ధర్మశీలమహారాజు సన్యాసి యాజ్ఞ ననుసరించి పట్టణంబునందె ప్రత్యేకముగ చింతామణి కొరకు మందిరము నిర్మించెను. ఆ మందిరములో నుత్తరమునుండి దక్షిణమున కొక సొరంగమును త్రవ్వించెను. ఆమందిరమునందున్న కొండలమధ్య నా సొరంగము వాకిలిమూసి, తీయుటకు వేయుట కనుకూలమయిన పలక నేర్పరచి, దాని మీద పచ్చిక చల్లించి చూచువారి కనుమానము లేకుండ చేయించెను. మరియు నా సొరంగము మలచి రాకపోకల కనువగు సదుపాయములతో మొదటి ద్వారము చింతామణి మందిరమున నుండునట్లును; దానిపై నొక పలకమూత—మూతపై నొక సింహాసన ముంచెను. చింతామణి ప్రశ్నలడుగునపు డా సింహాసనమున కూర్చుండును. సమాధానము చెప్పు రాకుమారునకు చింతామణికి మధ్య తెర గట్టించెను. ప్రశ్నకాలమున సన్యాసి రహస్యముగ నుండుటకై మూత బల్లక్రింద నొక్కింత వసతి గావించెను. మరియు కోట ముందొక స్తంభము నాటించి దాని కొక పెద్ద గంటనుకట్టించి, దానికొక గొలుసును క్రిందికి జారవిడిపించెను. ప్రశ్నలకు సమాధాన మిచ్చుటకై వచ్చిన వారా గొలుసును లాగ వలయును; గొలుసువద్దను కోటముందును వీరభటులను కావలి నుంచిరి.

ఈ విధంబుగ చింతామణి వివాహము కట్టుదిట్టమైపోయినది. చింతామణి మేనమామయగు జయంతుడు వివాహమునకై తొందర పడుచు మామగారికి జాబువ్రాసెను. ధర్మశీలమహారాజు బావమరది పేర వ్రాయు తిరుగు కమ్మ యందీ విషయంబును తెలియజేయుచు, చింతామణిమీద నే నాశలు వదలుకున్నాను. నీకు మరొక రాకుమారిని దెచ్చి వివాహముసేయుదునని తెలిపెను.

జయంతుడా వార్తవిని మండిపడి “యేమీ ఆడదాని ప్రశ్నలకు నేను జవాబు చెప్పలేకపోవుదునా? సన్యాసి అంత సమర్థుడా? చూచెదను గాక”యని మార్తాండపురమునకు ప్రయాణమాయెను. మార్తాండపురము నకుబోయి వార్తగొనివచ్చిన మురహరుడును, మంత్రియగు మతిమంతుడు నెంత చెప్పినను వినక జయంతుడు తన గుఱ్ఱంబు నెక్కి పయనించి ముందుగ తన అక్కా బావల కలుసుకొనిరి.

నాయనా! జయంతా! నీవు నా తోబుట్టినవాడవు. నా పుట్టింటికి నీవే దిక్కు. చింతామణివలన మనకు విచారమేగాని సంతోషములేదు. సన్యాసిచే ప్రశ్నింపబడు ప్రశ్నలు సామాన్యములుగావు. నీవు వాటిని సమర్థించవలదు. నీకు మరొక రాకుమారిని పెండ్లిసేయదలంచితిమి. నీ వైన మామాటవిని హాయిగ సుఖింపుమని సోదరి యెంత బతిమిలాడినను జయంతుడు వినక – బావగారి హితమును తృణీకరించి రయమునబోయి గొలుసు లాగెను.

చింతామణి యీ నియమముదాల్చి అప్పటి కారుమాసంబులు. జయంతుడే మొదటివారిగ తనప్రశ్నలకు సమాధానం చెప్పెదనని వచ్చిన వాడు. మేనమామమీది యనురాగముచే చింతామణి జయంతుని కాపాడ గురువులవారిని ప్రార్థించినది. కాని, సన్యాసివినక రాజశాసనము బంధువుల కొకరీతి, పరుల కింకొకరీతి జరుగరాదనుటచే నేమియు చేయలేకపోయినది. తరువాత జయంతుని ప్రశ్నలడుగ మంటపంబునకు పిలిచి – చింతామణి తెరచాటు పీఠంబుపై కూరుచుండి "మామగారూ! నాకు మీయందు భక్తి గౌరవములు కలమాట యదార్థము. అయినను నా దురదృష్టమున మనకిట్టి యెడబాటు సంభవించినది. నా ప్రశ్నలకుమీరు సమాధాన మివ్వజాలరు. మిమ్ముచంపక నాకు తప్పదు. నాయందు దయయుంచి మీ రింతటనైనను వెనుకకు తిరిగి వెళ్లుదురేని మా గురుచంద్రు నెట్లో మన్నింప వేడుకొందు"ననెను.

జయంతున కామాటలు చెవినాటలేదు. చింతామణీ! నే నకల విద్యాసంపన్నుడను. సన్యాసి చెప్పినవి, నీ వడిగెడవి నాకు తెలియకపోవు. నే నా ప్రశ్నలకు సమాధానము లివ్వగలనని బలుకుటచే చింతామణి గత్యంతరములేక సన్యాసిచెప్పిన మూడు ప్రశ్నలు వరుసగ నడిగి ఘడియకాలము వ్యవధాన మొసంగెను. జయంతుడు వానికి బదులు చెప్పనేరక దుఃఖించుచుండ వ్రతవిధానంబు ననుసరించి చింతామణి జయంతుని తలనరికి కోటకొమ్మున గట్టించి కళేబరమును లోతైన కందకమున పారవైచినది. అది మొదలు నేటికి తొమ్మిదివందల తొమ్మిదిమంది రాకుమారులు మరణించిరి.

యువరాజా! మా ప్రభువులవారికి నీకంటె ముందార్గురు కుమారులుదయించినమాట సత్యం. శత్రుంజయ; ప్రతాప; మరిమర్దన; విక్రమ; సత్యకీర్తి; ధనంజయులనువారు. వారును చింతామణిని వివాహమాడ

దలంచిపోయి మృతిచెందిరి. మా ప్రభాకరరాజశేఖరులకు మీరు యేడవ సంతానము. మీరును మార్తాండపురమున కేగెదరేమోయనన్న భయంబున నీకా విషయంబులు తెలియనీయరాదని మీ నాన్నగారు మాకందర కాజ్ఞాపించిరి. కాన నింతవరకు నీకీవార్త రహస్యమై యున్నదని దెలిపెను.

ఆ మాటలువిని సుధాకరుడు అదియేమిన్యాయము. సాటి రాకుమారులే కాక సహోదరులార్వురను మ్రింగిన చింతామణి రమణియా? రాకాసియా? తలలు నరకింప సాహసించినవాడు యథార్థ తాపసియగునా? అయిన అందేదియో తాంత్రిక మున్నదన్నమాట నేనిదేపోయి యాగుట్టు బట్టబయలుచేసి, అన్నలను చంపిన కక్షసాధించి వత్తుననెను.

అంత సుధాకరుని తలిదండ్రులగు వసంతతిలకా ప్రభాకరు లాత్మజు నాలింగనముచేసికొని "కుమారా! ఆర్గురు బిడ్డల తరువాత నుదయించిన నీవయినా మాకనుల ముందుండకపోయెదవా? మాకీ పుత్రశోకము తీరదా? యనుచుండ సుధాకరుడు వారినోదార్చి "పుణ్యులారా! నేను చింతామణిని వివాహమాడు తలంపున పోవుటలేదు. ఏలనన? నా యన్నలచే వాంఛింపబడిన సుందరి నాకు వదిన కావలయును. వదిన తల్లితో సమానము. అదియును గాక నేను ప్రేమించక—ప్రేమించక నా యన్న లార్వుర చంపిన కఠినురాలినే ప్రేమించి వివాహమాడ వలయునా? అదికాదు. మీ పాదముల సాక్షిగ నేనా చింతామణిమీద ప్రేమచే పోవుటలేదు. వెలుపలనుండి, కోటలోని రహస్య మెరింగి నా యన్నలను బతికించుకొనివచ్చెద. అందులకే నే నే కార్యమయిన సాధింతునని వారి యొద్ద శెలవుగైకొని సుధాకరుడు మార్తాండనగ రంబును చేరుకొనెను.

---

## పద్మలతా సుధాకరులు

సుధాకరుడట్లు వయసంజై తురంగమునెక్కి మార్తాండపురమునకు చేరి కర్తవ్యము నాలోచించుచుండెను. ఇంతలో వాని కొక వైశ్యశిఖామణి గనుపించి సుధాకరుని వృత్తాంతమరయుబూనెను. సుధాకరుడు నిజముదాచి యేదియో చెప్పుచుండెను కాని నిజము చెప్పడాయె. అంత

నా వైశ్యుండు నాయనా! నీ వాలకమును చూడ నాకనుమానము గలిగించుచున్నది. నాకు నిజము దెల్పుదువేని నీకు జయంబగును. కోటకు గట్టిన తలలో నీకు సంబంధించిన వారెవరయినా ఉన్నారా?" యని యడుగ సుధాకరుండు వానితో తన వృత్తాంతము దెలిపెను.

అంత నా వైశ్యుడు "సుధాకరా! నేను రత్నవ్యాపారములు సేయు ధనగుప్తుడను వణిజుండను. మీ తండ్రిగారు నాకు చాలా స్నేహితులు. మీ యన్నల చరిత్ర నాకు తెలియును. పసితనమునందుండగ నిన్ను నేను చూచినగుర్తు. అందుచే నిన్ను పోల్చుకొని యడిగినాను. నా యింటనుండి నీ కార్యము పూర్తి గావించుకొనుము. నీ యన్నలవలె నీవు తొందరపడవలదు. శాంతముగ కార్యమును సాధింపుము. నీ వెంత కాలమున్నను మాయింట భోజనవస్త్రవాహన వసతులకు లోపముండదు. మరియు వలయుధనమైన నిత్తునని సగౌరవంబుగ వానినింటికి గొంపోయెను.

ఏడెనిమిదిరోజులు జరిగి పోయినవి. సుధాకరునకు ధనగుప్తుని సహాయమున నన్ని సదుపాయములు కుదిరినవికాని, కార్యసాధనము మాత్రము తోచ లేదు. ప్రతిదినము గ్రామమున తిరిగి విశేషముల నారయుచు కోటచుట్టును పరిశీలించుచుండెను. ఒకనాడు చింతామణి కోట వెనుక భాగమునకుపోగా నచ్చటొక మనోహరమయిన నీటి కోనేరు కనుపించెను.

ఆ జలాశయము వివిధపుష్పంబులతో, రాయంచలతో నిర్మలమైన తోయంబున నలరారుచున్నది. అచ్చటున్న చలువరాతి వేదికపై సుధాకరుడు కూర్చుని వానిచుట్టునున్న రకరక పూదీవెలనుగల వనశృంగారము నవలోకించుచుండెను. సుధాకరుడా వనంబున ప్రతిదినము సాయంకాలమున విహారముసేయుచూ మూడు దినంబులు జరిపెను.

యథావిధిగ సుధాకరుడు కూర్చుని యుండగ వాని వెనుక నేదో చప్పుడయినట్లు తోచి వెనుకకు తిరిగి చూచెను. తోటనంటియున్న కోటగోడ కొక ద్వారమును—ఆ ద్వారమున నమర్చియున్న తలుపును తెరుచుకొని వచ్చుచున్న యొక మోహనాంగిని చూచి యాతడచ్చెరు వందుచుండెను. అత డట్లు చూచుచుండగనే నా మోహనాంగి సుధాకరుని దరిచేరి యేదియో సంభాషింప మొదలిడెను. సుధాకరుడును మిక్కిలి యుక్తి యుక్తముగ భాషింపుచు "ఓ సుందరీ! ఎవరవు నీవు?

నీకు నావలన కావలసిన కార్యమేమి ? "యని యడుగ నాతరుణి యిట్లు చెప్ప దొడంగెను.

"ఓ రాజకుమారా ! చిత్రపురము నేలు నీలధ్వజుని కుమార్తెను. నాపేరు పద్మలతయందురు. నా తల్లి రోగపీడచే మరణించినది. భార్యా వియోగంబున నా తండ్రిగారును పరలోకమేగిరి. అంత శత్రురాజులు మా తండ్రిగారి పట్టణము పాలించుచు నన్ను కొందరు కసాయివారి కిచ్చి యడవులలో చంపబంపిరి. ఆ కసాయివారు నన్ను చంపెడిదానికన్న నెవరికయిన నమ్మిన కొన్నచో ధనంబు వచ్చునని యీ మార్తాండ నగరమునకు గొని రాగా ధర్మపాలన రేందుడను కొంత ధనంబునకు కొనినారు. వారప్పటికి సంతానహీనులయినందున నన్నే తమబిడ్డగా పెంచుకొనుచుండిరి. తరువాత వారికి మా చెలి చింతామణి యుద్భవించి నది. నాటనుండి ప్రభువులుగారు మా యిద్దరి నతిగారాబముతో పెంచిరి. చింతామణికి నాయందు సమాన వాత్సల్యము కలదు.

మీరీ పట్టణము చేరునపుడు కోటమందిరమున విహరించుచు నేనును, నా చెలి చింతామణియు నిన్ను చూచినాము. నీ రూపురేఖల చూచి రాకుమారుడవేయని నిశ్చయించుకొంటిమి. కాని చింతామణి ప్రశ్నలకు సమాధానము చెప్పనెంచి గోలును లాగుదువేమోనని భయ పడితిని. ఒకవేళ నట్లెనని జరిగినచో నీ యట్టి సుందరాంగు నెట్లు వధింతునా యని నాచెలియు చింతించినది. కాని దైవానుగ్రహముచే నీవటు లాచరింప నందులకు సంతోషించి, నీతో సంభాషించుభాగ్యము నాకెటులు దొరుకునాయని పరితపించుచుంటిని.

కాంచన నగరరాజనందనా ! నేనును రాచకన్నియనే గాన నన్ను వివాహమాడి నాకోర్కె దీర్పుమని ప్రార్థింప సుధాకరుం డామెను చూచి "పద్మలతా ! నా వృత్తాంతమును నీకు దెలిపితినిగదా ? ముందు నా యన్నల బ్రతికించిగాని నేనెవ్వరినయినను బెండిలాడను. వారు జీవించవలయునన్నచో సన్యాసిని జయించవలయును. సన్యాసిని జయించ వలయునన్నచో చింతామణి యడుగు ప్రశ్నలేమిటో ? వాటికి సమా ధానము లేమిదో గమనింపవలయును. ఈ విషయంబున నీవు నాకు సహాకరింతువేని నేను తప్పక నిన్ను వివాహమాడుదును. నాయందు నిజ మైన ప్రేమగలదానవేని యీ కార్యము సాధింపు"మని కోరెను.

అంతటను పద్మలత సుధాకరా! మూడింటి యొక్కయు ప్రశ్నలివిగో బాగుగ గుర్తుంచుకొనుము. ఒకటవ ప్రశ్న:- మాయవేషముతోడ తమ్ములను రక్షించుకొని; సన్యాసిచే బడిన కోపదృష్టిమరలి, మంత్రిదండమును గ్రహించి, పటిని పారద్రోలి; మరల రాజ్యపాలింప బడియు జీవించిన రాజకుమారుడిప్పుడు సజీవుడా? మృతుడా! వాని నామమేమి?

రెండవది:— మగువయై - మగవేషముదాల్చి; మంత్రిగ చరించుచు, పలువురు మగువలచే మమకారమునకు పాత్రురాలై; మగనితో పయనించుచు మాయసన్యాసిచే కలిగిన మహాపద్బంధములనుండి బైటపడిన వీరనారి సజీవియా? విగతజీవియా? ఆమె నామమేమి?

మూడవది:—సన్యాసి కను భాగవతియైన సుందరియును; పగతుడైనట్టి కీర్తివర్ధనుడును, సజీవులా? విగతజీవులా? కీర్తివర్ధను డేవిధమున చరించుచున్నాడు? సుందరి యెటులున్నది?

ఆ ప్రశ్నలకు సమాధానము సన్యాసికి తప్ప మరెవ్వారికి తెలియదు. అయినను నా శక్తికొలది యత్నించి నాకు తోచినంతవరకు సలహాలు రేపు దెల్పెదననెను. సుధాకరుం డంతటను సమ్మతించి నా రేయి యింటికి చేరుకొనెను.

ఆ మరునాడు సుధాకరుడు మామూలు తప్పక నా వనంబునకు బోయి యథాస్థానంబున గూర్చుని పద్మలత రాకకై నిరీక్షించుచుండెను. అంతవరకు సుధాకరుని రాకకై యెదురు చూచుచున్న పద్మలతయు సమయము చూచుకొని పెరటిగుమ్మమునుండి మెల్లగ సుధాకరుని చేరి "ప్రియా! గతరాత్రి నేను చింతామణితో మిగుల యుక్తియుక్తముగ మాటలాడితిని. అంత నామెయు చెలీ! నాకు తెలిసియుండిన నీ వద్ద దాచుదునా? నేనొకమారు సన్యాసిని జేరి "స్వామీ! ఈ ఘోరనియమ మేమి? దీనికి ముగింపు యెంతకాలమున కున్నది? మన ప్రశ్నలకు భావమేమి యనియడుగ నాతండు మందహాసముచేయుచు "అమ్మాయీ! తొందరపడకుము. ఆ సమాధానమిప్పుడు చెప్పరాదు. గమనించగలిగిన యోచించుకొనుము. మూడుప్రశ్నలకు సమాధాన మిందేయున్నది." "ఆ భోగజపా" యీ వాక్యమును ముఖభంగముచేసి రెండక్షరములు కలుపవలయును. మరల దానిని ముఖభంగముచేసి మొదటి రెండక్షరములు కలుపవలయును. మరలదానిని ముఖభంగముచేసి రెండక్షరములు కలుపవలయును. అట్లేర్పడిన మూడు [illegible]లో వరుసగ నీ

ప్రశ్నలకు సమాధానములున్న" వని తెలిపెనట. అంతకంటె తనకేమియు తెలియదట. ఆ మాటయు యథార్థమని చెప్పెను.

సుధాకరుం డా మాటను రెండు మూడు పర్యాయము లుద్ఘాటించుచు నేదియో యోచించుచు చివాలున నేదియో గమనించినట్లు పద్మలత వైపు చూచి ప్రేయసీ! గమనించితివి. చూడు "ఆ భోగజపా" అని గదా వాక్యము. దానికి ముఖభంగమన మొదటి యక్షరమును తీసివేసి రెండక్షరములు కలిపినచో "భోగ" మైనది. అనగా మొదటి ప్రశ్నకు సమాధానము భోగపురమందుగలదు. తరువాత "భోగజపా" యను దానికి ముఖభంగమనగ మొదటి యక్షరములుదీసి రెండక్షములు కలిపి నచో "గజ" మైనది. రెండవ ప్రశ్నకు సమాధానము గజపురములో నున్నది. మిగిలినది "గజపా" ముఖమనుచు "గ"ను తీసివేయగ "జపా". మూడవప్రశ్నకు సమాధానము జపాపురమున తెలియ గలదని నేనూహించుచున్నాను. నీవేమందువనెను.

పద్మలతయు వాని సూక్ష్మబుద్ధి కానందించి తాను వలచినవా డుత్తమరాజవంశీయుడు—సుందరాకారుడే కాక విశేషవిద్యా వివేక వంతుడనియు, సమస్థుడనియు నప్పొంగెను. సుధాకరుడును త్వరితముగ ప్రశ్నలకు జవాబులు సంగ్రహించుకొని వచ్చి, అన్నలను బ్రతికించుకొని, సన్న్యాసి మదమడించి, నిన్ను వివాహంబాడి కాంచనపురంబునకుం గొంపోయెదనని చెప్పి సుధాకరుం డంనుండి బయలుదేరెను.

---

## భోగపుర ప్రయాణము

సుధాకరుడంత తన యశ్వంబు నధిరోహించి నైఋతి దిక్కుగ పయనించెను. ఆ ప్రదేశమంతయు దట్టమయిన అడవులతోను, విశేష [illegible] ను విడిచినదై జనసంచారము [illegible].

[illegible] భీకరమగు నా యరణ్యంబుదాటి కొంత నిరామయ ప్రదేశంబులో [illegible] మరల నొక యరణ్యంబును జొచ్చెను. రెండవ యరణ్యమును మొదటిదానివలెనే భయంకరమై గనుపట్టెను. అంతట [illegible] ధైర్యంబుతో విలోకించుచుండ నొకించుక

దూరంబున వానికి విశ్రాంతి గైకొంట కనువగు ప్రదేశమున్నటులుతోచి నిజాశ్వమునటకు బోనివ్వ నందొక నిర్మల తటాకంబును, సమీపంబున పొన్న, జాజి, దేవదారు, గన్నేరు మున్నగు పూజాపుష్పంబులతో నిండిన చెట్లు, మామిడి, నారింజ, ద్రాక్ష, నారికేళ, సీతాఫలాది ఫల వృక్షంబులు కానుపించెను. కాన సుధాకరుండు "ఓహో! ఈ స్థలంబును బట్టిచూడ నిదియొక ముని నివాసంబువలె తోచుచున్నదని యావంక పయనించగ నందొక పర్ణశాలయు, దాని కీవలగ నొక చెట్టుక్రింద పులి చర్మంబుపై కూరుచుండియున్న తపస్విని గాంచి సంతోషమందెను.

వెంటనే నా రాకుమారుడు తన హయమును పచ్చికమేయుటకై విడిచి, తానా చెరువునందు పాదప్రక్షాళనము గావించుకొని, దరినున్న పుష్పంబులను గోసికొనివచ్చి మునీంద్రున కెదురుగ కూర్చుండెను. ఆ మునియు చాలకాలమునకు కన్నులుదెరువగ సుధాకరుడు త్వరితముగ బోయి పుష్పంబులు వాని పాదంబులందుంచి నమస్కరించి నిలిచెను.

అంత నాఋషి "నాయనా! చిరంజీవీ! ఎవ్వరవు నీవు? నిర్మానుష్యమయిన యీ యరణ్యంబున నేల జొచ్చితివి? నావలన నీకు కాదగిన కార్యమేమి" యని బలుక సుధాకరుం డతివినయంబున తన కథ నంతయుంచెప్పి "స్వామీ! నా కా భోగపురంబునకు మార్గంబును; సన్యాసి ప్రశ్నలకు సమాధానంబును తెలియ చేయు"డని ప్రార్థించెను.

ఆ మాటలు వినిన జటివర్యుండు "వత్సా! నీవు చెప్పిన భోగపురమును గురించి నేనింతదనుక విని యైననుండ లేదు. నీవు గోరిన సహాయము చేయుటకు నాకు శక్తిలేదు. అయినను మునిసేవ వృధాపోవునదికాదు. నీకు నే నొక మంత్రించిన ఫలము నొసంగుచున్నాను. దానిని భుజించిన నీ కాకలి దప్పికలుండవు. శ్రమయు మరణంబులు గలుగవు. నీ విచట నుండి పడమర దిక్కున బయలుదేరి వెళ్ళు. అందొక పర్వతంబుగలదు. అయ్యది యదార్థంబుగ నీవంటివారు చేరరానిదే కాని, నా మంత్రఫలంబును భుజించినందున నీకు చక్కని దారి కనుపించగలదు. నీ వట్లు పర్వతంబులుదాటి అయ్యెడనుండి మునీంద్రుని చేరుము.

ఆయన మా గురువుగారు. దినమున కొక మారే కన్నులు తెరుచును. నీ వా సమయంబువరకు వేచియుండి తరుణముచూచి "అయ్యా! మీ శిష్యులవారు పంపగ వచ్చితినని చెప్పుము లేకున్నచో

వారు [illegible] మహా[illegible] [illegible] [illegible] మంత్రించి యొసంగెను.

అంత సుధాకరుఁడా ఫలంబును కన్నుల కద్దుకొని భుజించి మరల గుఱ్ఱమునెక్కి [illegible] ప్రయాణముచేసి అయిదవనాఁటి దూరములో నున్న ముని యాశ్రమ[illegible] పయనంబుగా నాముని తిరిగి "నాయనా! నీ వచ్చుటకి [illegible] [illegible], [illegible] చనవలయును. నీవు వచ్చునంతకు నీ గుఱ్ఱము నా యాశ్రమమున రక్షింపబడుచుండును. నీవద్దానిందుంచి వెళ్ళు[illegible]" యని మునీంద్రునకు నమస్కరించి తురంగమువీడి కాలినడకతో ప్రయాణంబు సాగించెను.

సుధాకరు డట్లే [illegible] ముని శ్రేష్ఠుని యాశ్రమంబునకు బోయి ముందుగ నందుండు మునిబాలకుతో తన వృత్తాంతమును దెలుపుకొని యొక చెట్టుక్రింద కూర్చుండెను. ముని శ్రేష్ఠుండు కన్నులు దెరువగ నా మునిబాలుండు అయ్యా! మునుపు పూర్వపరంబున నున్న మీ శిష్యుల వారిచే పంపబడిన రాకుమారుండు మిమ్ము చూడ వచ్చినాడని దెలిపి సుధాకరుని బిలువ నాతండు [illegible] నమస్కరించి నిలుచుండెను.

నమస్కరించి నిలుచున్న వానిం జూచి మునిశ్రేష్ఠుండు కుశల ప్రశ్నలు వేయుచు తద్వృత్తాంతమంతయు నెఱింగి "బిడ్డా! కాంచనపురం బిచ్చటకు షుమారె[illegible] దూరాన నుండును. అందుండి యింత దనుక శ్రమించివచ్చిన నీ సాహస కార్యత్వము—నీ కార్యదీక్ష మిక్కిలి ప్రశంశనీయము. నీవు దెలిపిన భోగపురమును గురించి నేను వినియుంటిని గాని, చూచి యుండలేదు. కారణము భోగపురము భూభాగంబున లేదు. సముద్రములో కొన్ని యోజనముల దవ్వేగినగాని నీవా పురమును చేర జాలవు. మిగిలిన గజపురము, జవాపురములును సంద్రమునందే గలవు. అయినను వాటికి చాలదూరముల నుండును. నిన్నచ్చటి కనుపు శక్తి నాకు లే"దనెను.

సుధాకరుడంత యోగానందుని పదంబులబడి మహాత్మా! తమ వంటి మహనీయు [illegible] మేమేమి చేయగలము? దయయుంచి యెటులైనను నాకుపకరించు[illegible] దెలియ చెప్పకున్న నెట్లలని ప్రార్థింప నా యోగానందుడు జాలిగలవాడై "వత్సా! లెమ్ము, నీ కొక యుపాయంబు దెలిపెద"నని వానిని బుజ్జగించి "నాయనా! యీ మంత్రఫలం [illegible] భుజింపుము. నీకు సముద్రమున ప్రయాణము సేయు శక్తి లభిం

చును. అదిగో, అటుచూడుము. ఆ కనబడుచున్న కొండనెక్కి గహ్వరమున్న లోయలోనికి దిగుము. అందొక నీటిపాయ యుండును. అది సముద్రమున కొక మార్గము. అందు నీవు ప్రయాణము సాగించినచో పది యామడల దూరమున నొక కాళికాలయంబుండును. దాని సమీపంబున జయంతీ పురముండును. ఆ పురవాసులు ప్రతిసంవత్సరము దేవతలకు కొలుపులు చేయుదురు. నీ వచటికేగువరకే నాశనము నశింపజేయగలదు. నీవందు కేవలము కాళిని జపింపుము. ఆమె నీకు ప్రసన్నురాలగు మంత్రరాజంబు నుపదేశించెదనని—యా మంత్రము నొసంగెను.

సుధాకరుండంత మునియొసంగిన పండునుదిని; మంత్రోపదేశము నొంది, వారికడ శెలవుగైకొని యుల్లే పర్వతంబుల మధ్యనున్న నీటి సారంగముద్వారా సముద్రభాగంబున నున్న నతి సుందరంబయిన కాళికాలయంబును జొచ్చి, శుచియై; నిర్మల మనంబున యోగానందునిచే యుపదేశమయిన మంత్రమును జపింప కాళికాదేవి ప్రత్యక్షమై "ఓయీ! రాకుమారా! నీ కేవరంబులు కావలయునో కోరు"మనెను.

రాజనందనుండును భక్తి పెంపొంద నాదేవికి నమస్కరించి "తల్లీ లోకమాతా! నేను కాంచననగరాధిపుని తనయుండను. నాపేరు సుధాకరుడందురు. నాయన్నలార్వురను వధించిన చింతామణి ప్రశ్నలకు సమాధానము భోగపురంబున నుండునని పోవ ప్రయత్నించుచున్నాను. కాన భగవతీ! నాయందు దయయుంచి భోగపురంబునకేగు మార్గంబును, సన్యాసి ప్రశ్నలకు జవాబులు తెలియజేయు"మని ప్రార్థించెను.

అంత నాకాళికయు "రాకుమారా! చింతామణి గురువులైన సన్యాసి నాకు భక్తుడు. తొలుత నాతడనేకవరంబులు నాచే సంపాదించి యున్నాడు. కాని తరువాత వాడు చేయు పాపంబులకు మేరలేదు. పాపభారంబున మాత్రంబు నా వరంబులు ప్రభావంబును గోల్పోవునని నాడే నేను చెప్పియుంటిని. నీకు జయంబు చేకూరుట సత్యంబు. కాని భక్తునికి వ్యతిరేకముగ నేనేమియు చేయజాలను. భోగపురంబున సన్యాసి మొదటి ప్రశ్నకు సమాధానమున్నది. అది నేనెరుంగుదును. అయినను నేను మాత్రము చెప్పరాదంటిని. నీవును నా భక్తుడవు గాన నీ కొక యుపకారము చేసెదను. అద్ది యేమందువేని నీవు మార్తాండపురమునకు బోయినపుడు కోటకొమ్మనున్న శిరములన్నియుదీసి కళేబరములున్న కందకములో వేయించి "కాళికా వరప్రసాదితులారా! లేచిరం"డని

వారు మాటాడనే మాటాడరని పండు నొకదానిని మంత్రించి యొసంగెను.

అంత సుధాకరుం డా ఫలంబును కన్నుల కద్దుకొని భుజించి మరల గుఱ్ఱము నెక్కి పశ్చిమంబుగ ప్రయాణముచేసి అయిదామడ దూరములో నున్న ముని యాశ్రమమునకు పయనంబుగాగ నాముని తిరిగి "నాయనా! నీ వచ్చుటకి వాహన మెక్కి పోరాడదు. పాదచారివై చనవలయును. నీవు వచ్చువరకు నీ గుఱ్ఱము నా యాశ్రమమున రక్షింపబడుచుండును. నీవద్దానిందుంచి వెళ్ళుమ్మనగ నతండట్లేయని మునీంద్రునకు నమస్కరించి తురంగమువీడి కాలినడకతో ప్రయాణంబుసాగించెను.

సుధాకరు డట్లే పయనించి మునిశ్రేష్ఠుని యాశ్రమంబునకు బోయి ముందుగ నందుండు మునిబాలకునితో తన వృత్తాంతమును దెలుపుకొని యొక చెట్టుక్రింద కూర్చుండెను. మునిశ్రేష్ఠుండు కన్నులు దెరువగ నా మునిబాలుండు అయ్యా! మనకు తూర్పువనంబున నున్న మీ శిష్యుల వారిచే పంపబడిన రాకుమారుండు మిము చూడ వచ్చినాడని దెలిపి సుధాకరుని బిలువ నాతం డతిరయమున నేగి నమస్కరించి నిలుచుండెను.

నమస్కరించి నిలుచున్న వానిం జూచి మునిశ్రేష్ఠుండు కుశల ప్రశ్నలం వేయుచు తద్వృత్తాంతమంతయు నెరింగి "బిడ్డా! కాంచనపురం బిచ్చటకు షుమారెనుబదియామడదూర ముండును. అందుండి యింత దనుక శ్రమించివచ్చిన నీ సోదర వాత్సల్యము—నీ కార్యదీక్ష మిక్కిలి ప్రశంసనీయము. నీవు దెలిపిన భోగపురమును గురించి నేను వినియుంటిని గాని, చూచి యుండలేదు. కారణము భోగపురము భూభాగంబున లేదు. సముద్రములో కొన్ని యోజనముల దవ్వేగినగాని నీవా పురమును చేర జాలవు. మిగిలిన గజపురము, జపాపురములును సంద్రమునం దేగలవు. అయినను వాటికి చాలదూరములుండును. నిన్నచ్చటి కనుపుశక్తి నాకు లేదనెను.

సుధాకరుడంత యోగానందుని పదంబులబడి మహాత్మా! తమ వంటి మహనీయు లట్లనిన మేమేమి చేయగలము? దయయుంచి యెటులైనను నాకుందగు నుపాయమేదేనియు చెప్పుకున్న నెట్టులని ప్రార్థింప నా యోగానందుడు జాలిగలవాడై "వత్సా! లెమ్ము, నీ కొక యుపాయము దెలిపెద"నని వానిని బుజ్జగించి "నాయనా! యీ మంత్రఫలం బును భుజింపుము. నీవు సముద్రమున ప్రయాణముసేయు శక్తి లభిం

చును. అదిగో, అటుచూడు. ఆ కనపించు కొండనెక్కి మధ్యనున్న లోయలోనికి దిగుము. అందొక నీటిదొన యుండును. అది సముద్రమున కొక మార్గము. అందు నీవు ప్రయాణము సాగించినచో పది యామడల దూరమున నొక కాళికాలయంబుండును. దాని సమీపంబున జయంతీ పురముండును. ఆ పురపౌరులు ప్రతిసంవత్సరమా దేవతలకు కొలుపులు చేయుదురు. నీ వచటికేగువరకే నాఫలము పనిచేయగలదు. నీవందు శుచివై కాళిని జపింపుము. ఆమె నీకు ప్రసన్నమగు మంత్రరాజంబు నుపదేశించెదనని—యా మంత్రము నెరింగించెను.

సుధాకరుండంత మునియొసంగిన పండునుదిని; మంత్రోపదేశము నొంది, వారికడ శెలవుగైకొని యట్లే పర్వతంబుల మధ్యనున్న నీటి సొరంగముద్వారా సముద్రభాగంబుననున్న నతి సుందరంబయిన కాళికాలయంబును జొచ్చి, శుచియై; నిర్మల మనంబున యోగానందునిచే యుపదేశమయిన మంత్రమును జపింప కాళికాదేవి ప్రత్యక్షమై "ఓయీ! రాకుమారా! నీ కేవరంబులు కావలయునో కోరు"మనెను.

రాజనందనుండును భక్తి పెంపొంద నాదేవికి నమస్కరించి "తల్లీ లోకమాతా! నేను కాంచననగరాధిపుని తనయుండను. నాపేరు సుధాకరుడందురు. నాయన్న లార్వురను వధించిన చింతామణి ప్రశ్నలకు సమాధానము భోగపురంబున నుండునని బోవ ప్రయత్నించుచున్నాను. కాన భగవతీ! నాయందు దయయుంచి భోగపురంబునకేగు మార్గంబును, సన్యాసి ప్రశ్నలకు జవాబులు తెలియజేయు"మని ప్రార్థించెను.

అంత నాకాళికయు "రాకుమారా! చింతామణి గురువులైన సన్యాసి నాకు భక్తుడు. తొలుత సాతెడనేకవరంబులు నాచే సంపాదించియున్నాడు. కాని తరువాత వాడు చేయు పాపంబులకు మేరలేదు. పాపభారంబున మాత్రంబు నా వరంబులు ప్రభావంబును గోల్పోవునని వాడే నేను చెప్పియుంటిని. నీకు జయంబు చేకూరుట సత్యంబు. కాని భక్తునికి వ్యతిరేకముగ నేనేమియు చేయజాలను. భోగపురంబున సన్యాసి మొదటి ప్రశ్నకు సమాధానమున్నది. అది నేనెరుంగుదును. అయినను నేను మాత్రము చెప్పరాదంటిని. నీవును నా భక్తుడవు గాన నీకొక యుపకారము చేసెదను. అద్ది యేమందువేని నీవు మార్తాండపురమునకు పోయినపుడు కోటకొమ్మనున్న శిరములన్నియుదీసి కళేబరములున్న కుండములో వేయించి "కాళికా వరప్రసాదితులారా! లేచిరం"డని

పిలువుము. అవ్విధంబున మూడుసారులు పిలుతువేని మృతినొందినవారు తిరిగి బ్రతికివత్తురు. నీ వింకబోయిర"మ్మని దీవించెను.

అంత సుధాకరుండు "ఔరా! మార్తాండపురమునకేగిన సన్యాసి యెంతటి ప్రజ్ఞాశాలి. ఇట్టిదేవతలచే వరంబులు పొందినవాడు కావుననే తానింతటిశక్తిని చూపుచున్నాడు. దేవి నన్నును శుభంబుగ దీవించినది గదా! అంతియుగాక మరణించిన వారిని బ్రతికించు నుపాయంబును చెప్పినది. ఆపై కార్యంబునకు భగవానున్నాడనినమ్మి కాళికాలయంబు దాటి సముద్రభాగంబున జయంతపురంబును ప్రవేశించి, ఆ పురపాలకుండయిన సోమనాథ మహారాజునకు తనరాక దెలిపెను.

సోమనాథుం డంత వానిం బిలిపించి సుధాకరుని చూచినతోడనే మిగు లానందమునుపొంది; తరువాత వాని వలన గతచరిత్రంబు వినగ వాని మనంబున నాశ్చర్యంబుగలిగెను. భళిరే! ఇంత చిన్నప్రాయంబున నీతం డవసీస్థలంబునగల ఘోరారణ్యంబుల నిర్గమించుటయేగాక— దుర్భర పర్వతశ్రేణి నధిగమించుటయేగాక—మునుల సహాయమందుటయేగాక సముద్రమార్గమున సైతమెట్లీ యోజనముల దూరము రాగలిగెను! ఇట్టి ధైర్యసాహస దీక్షాపరుడైన సాటి రాకుమారునకు సాయమొనర్చుటే మనకుం జరిగిన కార్యమని దలంచి "సుధాకరా! నాకు భోగపురము మాత్రము తెలియును. అచటకు బోవలయునన్న ఓడప్రయాణము చేయవలయును. వ్యాపారార్థమై మాసమునకొక పర్యాయమా యోడవెళ్ళి వచ్చుచుండును. నీ యదృష్టము మంచిది. కావుననే నేడా పడవ ప్రయాణమగుచున్నది. నీకు వలయు ధన, కనక, వస్తుసముదాయ మొసంగి అందు నీ ప్రయాణముజరుగు నట్లు చేసెదను. ఆ పయికార్యము నీవు సాధింపు"మన నాతం డానందించెను.

వెంటనే సోమనాథ రాజేంద్రుడు యోడ సరదారుని పిలిపించి "ఓయీ! మా మిత్రులయిన యీ సుధాకరుని నిరపాయకరముగ భోగపురము చేర్పు"డని దెలిపెను.

మరునాడు సుధాకరుడెక్కిన యోడ భోగపురముండెడు ద్వీపమును చేరుటకై బయలుదేరినది. నూరామడ ప్రయాణముసాగినగాని వారు ద్వీపమును చేరలేరు. అగాధమయిన సముద్రమునందా సరంగు లతిలాఘవంబున నోడను నడుపుచుండిరి. అయిననేమి వారి దురదృష్టము చేత వాయువులు విపరీతముగ వీవనారంభించెను. ఆ సుడిగాలులు

ప్రతాపంబున సముద్రజల మొక్కొకసారి యోడ నాకసమున కెగుర వేయుచు—నొక్కసారి పాతాళంబునకు గొంపోవుచు సల్లడ తల్లడ చేయసాగెను. ఓడ సరదారు, సరంగులు వారి శక్తికొలది ప్రయత్నించిరి—తెరచాపలు దించిరి—లంగరులు వదలిరి. తుట్టతుదకా గాలి క్రమముగ శాంతించి పడవకు స్థాయి దొరికినదిగాని వారి కానందము లేకపోయినది.

జరిగిన కల్లోలములో వారికి దిక్కు తెలియలేదు. ఓడ నీటిజాలున బడి త్వరితముగ బరువెత్తుకొని పోవుచున్నది. ఆ చిత్రమేదియో సరదారు గమనించి "అయ్యలారా! మనకందరకు మరణము సమీపింపనున్నది. అదిగో, అటుచూడుడు. ఆ యెత్తుగ కనుపించుచున్నది అయస్కాంత పర్వతము. దాని యాకర్షణచే మనయోడ మన స్వాధీనముదప్పి పరుగిడుచున్నది. మరికొన్ని ఘడియలలో మన యోడ నందున్న యినుప సీలలన్నియు నూడి యా పర్వతము నంటుకొనును. చీలలుపోగా ఓడ విచ్ఛిన్నమై పోకనిలువదు. మనమందరము మరణించుటకు సిద్ధముగాన దైవధ్యానము చేయుడని చెప్పుచుండ నయస్కాంత శైలము సమీపించనే సమీపించినది.

సరదారు చెప్పినటులు యోడనున్న ఉక్కు యినుప సామానంతయు చెదిరిపోయి పర్వతము నంటుకొనెను. ఓడయందు నీరు జొచ్చుటచే నది సముద్రంబున మునింగిపోయినది. అందున్న వారందరు మరణించిరి కాని సుధాకరునకు మాత్రమెటులో నొక రాయి చిక్కినది. దాని మీదగ చల్లగ కొంతదూరముబోయి ప్రాణములను దక్కించుకొనగలిగెనే కాని ప్రయోజనమేమియు కానరాలేదు.

అయినను యీ సమయంబున నింతకంటె చేయు కార్యమేదియు లేదని బహుప్రయాసచెంది మెల్లగ పర్వతంబునెక్కెను. అట్లా పర్వతోపరిభాగంబునకుబోయిచూడ నందొక విఘ్నేశ్వరాలయంబు కనుపించెను. దానిముందున్న ధ్వజమునకు రాగి తొడుపు వేసియుండెను. ప్రక్క నొక నీటికోనేరుయు, దాని వెంట ఫలపుష్పభరితంబునయిన యుద్యానవనము గాంచి యతం డచ్చెరువునొందెను. ఆహా! ఏమీ దైవముయొక్క మాయ? ఇట్టి మహాసముద్రమధ్యంబున, నీ సూదంటు రాతికొండమీద నీ శిల్పమేమి? ఇచట కెవరయిన నెట్లువత్తురు? తిరిగిపోవుటెట్లు? అనలి భాగంబున నిట్టి దేవళంబు నిర్మించిన వారెవరు? ధ్వజము నాటిన

దెవరు ? ఈకోనేటితో నాకేమిపని ? ఈయుద్యానముయొక్క ప్రయోజన మేమి ? ఒకవేళ యిది పాతాళనగరవాసులు నిర్మించిందా యేమని చాల కాలము తర్కించుకొనినను వానికే దారియు పోడకలేదు.

తుదకేమియు తోచక భగవానుని ధ్యానించుచు తన మేని బట్టలను శుభ్రముగ నుతికి నారవేసికొని, వనంబులోని పండ్లు, ఫలంబులు తెచ్చి, మరల బట్టలుధరించి, విఘ్నేశ్వరుని పూజించి "వినాయకా! మహాదేవా! నన్నేల యిందు చేర్చితివి ? నాకు స్థలభేదముదక్క మరేమియుదోచలేదు. ఇందుండి భోగపురంబునకుగాని, కాంచనపురంబునకుగాని పోవు నుపాయ మేది ? నన్నిందు కీ నడిసముద్రమునందిట్టు లొంటరిగ చేర్చితివి తండ్రీ! ఇకమీద నన్ను పాలనము చేతువో నీటముంతువో నీయదే భారమని నమస్కరించి, లేచి ప్రక్కనున్న వనంబులోని కమ్మని పండ్లుభుజించి, కొలనులోని నీరుద్రావి వచ్చి గుడిలో పరుండెను. సముద్రప్రయాణంబున చెందిన బడలికచేతను; అంత కష్టమయిన కొండనెక్కుటచేతను డస్సి యున్న సుధాకరున కంతలోనే నిద్రపట్టెను.

ఆ రాత్రి వాని స్వప్నమున వినాయకుండు ప్రత్యక్షమై "ఓయీ! చింతింపకుము. నన్ను పూజించినవారికి కార్యసాఫల్యము కలిగితీరును. నీ తలక్రిందనొక రాయియున్నది. నీ వద్దానిని పెకలింపుము. దాని క్రిందనొక యిత్తడిచే చేసిన విల్లు గలదు. అచ్చటనే సీసముతో చేసిన మూడు బాణంబులు గలవు. నీవా యిత్తడివిల్లును సంధించి సీసము బాణంబుల నీ నాగధ్వజస్తంభంబుపై ప్రయోగింపుము. అంతననా ధ్వజంబు విరిగి నీటిలో బడును. వెంటనే నీరు యుబికి యొక పడవ నీయొద్దకు వచ్చును. నీవేమియు మాటాడక నా పడవనెక్కి కూర్చుండుమువేని యా చిన్నపడవ నిన్ననాయాసముగ భోగపురంబునకు చేర్చును. నీవు పొరపాటుచేనైన నోరువిప్పినచో మరల నాపద పాలయ్యెదవ"ని దెలిపి యదృశ్యుడాయెను.

మరునా డుదయమున మేల్కాంచిన సుధాకరుండు స్వప్నగత విషయంబు నంతయు బాగుగ స్ఫురణకు దెచ్చుకొనిన పిమ్మట లేచి కాలకృత్యములన్ని తీర్చుకొని, విఘ్నపతిని మనంబున ధ్యానించి అయినను చూతమని తన తలక్రిందనున్న రాతిని గురుతించుకొన్న వాడగుటచే దానిని పెకలించి చూడగ నిత్తడివిల్లును, సీసపు బాణంబులు వానికి గనుపించెను. అప్పుడు సుధాకరు డానందమున వాటిం గైకొని గర్భా

లయంబునందున్న వినాయకునిం జేరి మరల నమస్కరించి—తిరిగివచ్చి ముమ్మారా సీసపు శరంబుల నిత్తడి వింట సంధించి తామ్ర ధ్వజంబుపై విడిచెను.

వెంటనే నా ధ్వజంబు నడిమికి తెగి నీటబడెను. సముద్రజలంబు పై భాగంబువరకు నుబికెను. అందొక చిన్నపడవ సుధాకరుని సమీపించి నిలుచుటచే నతం డందెక్కి కూరుచుండెను. అంత నా పడవ సముద్రభాగంబున బయలుదేరి పోవుచుండెను. చాల దూరము పోవునప్పటికి అందొక ద్వీపము కనుపించుచున్నందున సుధాకరుం డానంద మును పట్టలేక చేతులెత్తి "హే దయానిధీ! నీ కృపాకటాక్షంబుననే నేను ధన్యుడనైతి"నని బలుకుచుండ నా పడవ నప్రయత్నముగ నీటిలో మునింగిపోయెను.

సుధాకరుం డంత నీదనారంభించుటచే నదృష్టవశంబున వాని చేతి కొక పలకదొరికినది. దాని సహాయంబున నీది యొడ్డుకుం జేరి "అయ్యో! దైవమా! నేనెంతమందబుద్ధిని? స్వప్నంబున నామహాత్ముడు చెప్పిన మాటను మరచి మాటలాడితిని. ఈ కొంచెముసేపు మౌనముగనున్న భోగపురమునకీపాటికి చేరి యుందునుగదా" యని తలపోయుచుండ సముద్రమున నొకయోడ తన్ను సమీపించుచున్నటులు కానబడియెను.

సుధాకరు డాయోడనుచూచి "ఇట్టి నిరామయ ప్రదేశంబును చేరవచ్చుచున్నవారు వీరెవరై యుందురు? ఒకవేళ దొంగల కేమయిన నీ ప్రదేశంబు నివాసమేమొ? వారికంట నేనుబడిన ప్రమాదము గలుగు నేమొ? ఏది యెటులయిననూ నేను దాగియుంటమంచిది. ఆ తరువాత నిందు వచ్చువారు మంచివారని తోచినచో వారల జేరవచ్చును. లేదా! వారు తిరిగి పోయిన పిదపనే మనము బయటికి రావచ్చునని దలంచి, మార్గంబున కనుకూలముగను; మిక్కిలి యెత్తుగను, దట్టమయిన పత్రంబులతో నిండినదియునగు నొక వృక్షంబునెక్కి రహస్యంబుగ కూర్చుండెను.

ఇంతలో నాయోడ రేవును సమీపించినది. అందుండి యొక ముసలి మరొక యువకునితోగూడ ముందరుగుచున్నాడు. వాని వెంట ననేకు లయిన నౌకరులున్నారు. వారు విలువైన వస్తువాహన, వస్త్ర, భోజన పదార్థంబులను దెచ్చుచున్నారు. వారట్లు కొద్ది దూరంబులో గల పర్వతంబుల మధ్యకుబోయిరి. తరువాత నేమి జరుగుచున్నదో సుధాకరు

నకు గనబడ లేదు. తిరిగి వారు వచ్చుచుండిరి. ఈ సారి ముసలి
మాత్రమే వచ్చుచుండెను. కాని యువకుడు కానరాలేదు. ఇది యేమి
చిత్రము? బాలుని వీరేమి చేసియుందురు? ఈ ప్రదేశంబున నిట్లు
చేయుటేమి? అనుమానములకైనను కొదువగాని యీ పదార్థములతో
నతడందేల నుండవలయునని యోచించుచుండ, ముసలియు, నా నొక
రులు వచ్చిన యోడ తిరిగి పోవుచుండెను. సుధాకరుం డది గమనించి
యువకుం డుండెడిచోటును బాగుగ గురుతుంచుకొని, చెట్టుదిగి యా
పర్వతంబును ప్రవేశించెను.

అందెందును వాని కా యువకుండున్న చోటు దొరుకలేదు. అందు
చేత నిందేదైన పాతాళగృహమున్న దేమోయని చూచుచుండ వాని కొక
మూలరాయి కనుపించెను. సుధాకరుండు వానిబలంబు కొలదా రాతిని
తొలగించి చూడ నందొక మార్గ ముండెను. ఆహా! ఆ పాతాళ
గృహంబున చక్కని గాలియు, వెలుగునుగలవు. సమస్త భోగంబులు
వెలయుచున్నవి. సుధాకరుం డట్లుచనగ నందొక మందిరంబున నున్నత
శయ్యయు, దానిపై నెత్తైన దిండునానుకొని కూర్చుండిన పదునారేడుల
చిన్నవాడే తానంతకముందు చెట్టుపైనుండి చూచిన యువకుండని దలంచి
వానిం జేరి నిలుచుండెను.

సుధాకరుని చూడగ నా యువకుండు గజగజ వడంకుచు లేచి
నిలుచుండుటచే నతండు వాని నాలింగనముచేసి "తమ్ముడా! ఎందుల
కిట్లు భీతిల్లుచున్నావు? నేను నీ కపకారినికాను. విశేషించి మిత్రుడను.
నే నొక కార్యంబున నిందు చిక్కుబడితిని. నీ వృత్తాంతముచెప్పి నాకు
మిత్రుడవు కమ్మనికోరెను. ఆ యువకుండును అన్నా, కూర్చుండుము.
నా కథ వివరించెదనని వానికి వలయు భోజన పదార్థంబు లొసంగి యిట్లు
చెప్ప నారంభించెను.

"అన్నా! ఇచ్చటికి చాలదూరమున సువర్ణద్వీపముగలదు. అది
విశాలమయినది. అందు చంద్రకేతుండు పాలించు చంద్రనగరము మా
నివాసస్థలము. నేనొక మహాధనికుడైన వైశ్యనందనుండను. నా పేరు
గుణభూషణుండు. మా తండ్రికి చాల కాలమునకు నొక యోగివరం
బున నే నుదయించితినన్న మాట. నా జననకాలమును లిఖించి జోస్యులు
జాతకంబును వ్రాయ శాస్త్రసమ్మతముగ లగ్నమును నిర్ణయించి కోటి
వ్రాసిరట. వారు నాకు పదునారవసంవత్సరము పూర్తికాగ గొప్ప

గండమున్నదని చెప్పిరి. ఆ గండముయొక్క దృష్టి నెలవరకు నుండు నట. ఈనెల జరిగినచో నూరేడు లాయుర్దాయమును; మహారాజ వైభవము ననుభవించువాడనగుదునని చెప్పిరట. అయస్కాంత పర్వతంబుననున్న రాగిస్తంభంబును నీటబడవేయు రాజకుమారుడుదప్ప నితరులు నన్ను సంహారింపజాలరు. వానికంట బడకున్న నాకు మృత్యువు లేదు. అందుచేత మా తండ్రిగారు నన్నీ ప్రదేశంబున నెవరికి దెలియకుండ దాచినాడు. నీవు చూచిన ముదుసలియే నాతండ్రి. నేటికి పదునైదు దినంబులు గతించినవి. ఇంక పదునైదు దినంబులు జరిగినచో నాకు సంపూర్ణాయువు లభించినట్లే"యని మరియు సోదరా నీ వృత్తాంత మేమియని ప్రశ్నించెను.

సుధాకరుండు తానే నూదంటురాయిమీది ధ్వజంబును నీటబడవైచితినని చెప్పెదనేని నేనెంత యూరడించినను గుణభూషణుండు శంకించుండునని నా మాటమాత్రము దాచి "తమ్ముడా! నేను కాంచన నగరమందుండు ధనికుడైన వర్తకుని కుమారుడను. నాపేరు సుధాకరుడు. ద్వీపాంతర వ్యాపారము నాకు చాల యిష్టము. కావున భోగపురమునకు క్రొత్తగ పోయిరావలయునని వెలలేని రత్నభూషణములతో ప్రయాణమై వచ్చుచుండ సుడిగాలిచే నాయోడ మునింగిపోయినది. పరివారమందరు నీట మునింగిరి నేనుమాత్ర మెట్లో తప్పించుకొని యీ గట్టుచేరితిని. కాని సంతోషమేమి? కట్టుబట్టలు తప్ప నావద్ద నేమియు మిగులలేదు. అంత కాయకసరులుదిని మూడు దినంబులు జరిపితిని. ఇంతలో మీ చరిత్రగాంచి యిందు వచ్చితి"నని చెప్పెను.

గుణభూషణుండందుల కానందించి "అన్నా! సుధాకరా! ఈ సమయంబున నాకు తోడుగనుండుటకే నిన్ను భగవంతు డిచట కనిపియుండును. నీకేమియు భయములేదు. నావద్దనుండి యీ పదునైదు రోజులుగూడ నిర్విచారముగ సుఖింపుము. పదునారవ దినంబున మా తండ్రిగారు వత్తురు. నేను జీవించియుందునేని నన్ను మాతండ్రి యింటికి గొనిపోవునపుడు నిన్నును మా యింటికి గొంపోయి వ్యాపారంబునకు వలయు ధనమునిచ్చి నిన్ను భోగపురమున కనిపెద"నని చెప్పెను.

మహదానందమున సుధాకరుడతని ఆలింగనము చేసికొని "తమ్ముడా! జోస్యుల మాటలన్నియు యథార్థములుకావు. గణితము పొరపాటు బడినపుడిట్లే పొరపాటులెక్కల వ్రాయుచుందురు. నిన్నవ

లు చంపబోరు. రాగి స్తంభము నరికినవా డిందు రాగలడా? వచ్చి
నను నీవు వాని కపకారివి కావు, నిన్నెట్లు చంపునని ధైర్యంబు చెప్పెను.

అవ్విధంబున పదునాల్గుదినంబులు జరిగిపోయినవి. పదునైదవ
రోజు జరుగుచున్నది. ఈ రొక్క రాత్రియు గడచినచో వైశ్యకుమా
రున కాయుర్దాయము నూరు సంవత్సరములు. గుణభూషణుండును,
సుధాకరుండు నామాటలు చెప్పుకొని మహానందంబున రేపు తాము
చంద్రనగరమునం దుండు మనుకొనిరి. ఆ రాత్రి గుణభూషణుని
స్వప్నంబున పులులుపైకి దుమికినట్లును; సింహంబులు పైనబడినట్లును కన
పించెను. వెంటనే లేచి, సుధాకరుని నిదురలేపి "అన్నా! నా కల
యందు పులులు సింహములు కనుపించుచున్నవి. ఎన్నడులేని యిట్టి
పీడకల లేలరావలయును?

సుధా:— తమ్ముడా! నీ మనసులోని భయంబున నట్టి కలలు
కంటివి కాని ద్వారము మూయబడగ పులులెట్లు రాగలవు?

గుణ:— అట్లన రాదు. లిఖితమున్న తప్పదు. నిజమునకు యీ
రాత్రియేగద నాకు గండంబు? కావున నీ గోడమీదనున్న కత్తిని
చేధరించి జాగ్రత్తగ నుండుము. ఒకవేళ పులికూన లేమయిన సమయం
బును చూచుకొని మన మందిరములో ప్రవేశించినవేమొ? మనకు తెలి
యని మార్గ మేదయిన యిందు శత్రువుల కనుకూలమై యున్నదేమొ.

సుధా:— గుణభూషణా! నీకాభయ మక్కరలేదు. అయినను
అంతయేల? నేనా కత్తినిబట్టి మెలకువతో కాంచియుండును. ఏప్రాణి
వచ్చినను వెంటనే ఖండించి నిను కాపాడెదనంచు కత్తినందుకొన
బోయెను. ఆ కత్తి సుధాకరున కందలేదు. దాని నందుకొనుటకై
గుణభూషణుని మంచముమీదికెక్కి కత్తిని జాగ్రతగ పట్టుకొని
మంచము దిగబోవ ప్రమాదవశమున వానికాలుజారి క్రిందకు జారగిల
పడుటలో సుధాకరుని చేతనున్న కత్తి వానికి తెలియకుండగనే గుణ
భూషణుని గుండెలలోన నాటుకొనిపోయి అతడు మరణించెను.

సుధాకరుండు గుణభూషణుని మీద బడి విలపించుచు "అయ్యో!
గుణభూషణా! నన్ను బాసిపోయితివా? నిన్నెటులయిన బ్రతికింప దలంచు
కుంటినే? ఇది యేమి పాపము? నీ సహాయంబున రేపు నేను భోగపుర
ప్రయాణము గావింపనుంటినే? రేపు మీతండ్రి వచ్చిన నేమిచెప్పుదును?
యేమిచెప్పినను వాని శోకము మాన్పగలనా? నన్నాయన కనికరించునా?

యని చింతించుచు, మరల వాఁడు రాకముందే తానాచోటును విడచుట మేలని దలంచి సుధాకరుండు మెల్లగ దారిపట్టెను.

అతం డాలోఁ బయల్వెడియు గుణభూషణుని గూర్చి శోకించుచు నొకవృక్షంబు మూల కూర్చుండెను. అప్పటికి ప్రొద్దెక్కినది. ఎండ తీవ్రముగనున్నది. ఇట్లెంతసేపు చింతించి యేమి ప్రయోజనము? ముందు కర్తవ్యము యోచింతమని పిచ్చివానివలె దిరుగుచుండెను. అట్లు కొంత దూరంబు చన నందొక వనంబును, ఆ వనంబున తపంబాచరించుకొను చున్న నొక మునిని చూచి సుధాకరుం డొక్కింత ధైర్యంబు బూని వాని కడ కేగెను.

కొంతవరకా సన్యాసియు కన్నులు విప్పి చూచి తనయెదుటనున్న రాకుమారుని యావద్వృత్తాంతము నాలించి “బాలకా! ఈ రాజ్యము నేలురాజునకు సన్యాసి యనిన నతిగౌరవము. నీకు వలయు కాషాయ వస్త్రంబులు, యోగదండము, కమండలము, పాదుకలు, జింక చర్మము నిచ్చుచున్నాను. వీటిని ధరింపుము. నా విభూతి ముఖమున ధరింపుము. నీ ముఖము చూచినతోడనే యీ పట్టణమేలు ప్రభువు నీకు సకలోప చారంబుచేసి భద్రంబుగ నిన్ను భోగపురంబున కనుపగలడని తెలిపెను. సుధాకరుండును భక్తితో వానికి నమస్కరించి ముని యొసంగిన వేషము ధరించి రాజదుస్తులు, భూషణంబులు రహస్యంబుగ భద్రపరచి తన వెంట నుంచుకొని తపసి యాశీర్వాద మంది యా నగర భూపతిని దర్శింప బోయెను.

తాపసి తెలిపినట్లా రాజేంద్రుండు సుధాకరుని గౌరవించి, పాద పూజ లాచరించి, ఫలహారంబు లొసంగి; పిదప నాతండు కోరినట్లు నొకయోడను సిద్ధముచేసి సగౌరవముగ మాయాసన్యాసిని భోగపురంబు నకు చేర్చెను.

సుధాకరుండు పరమానందంబున భోగపుర వైభవంబునుగూర్చి మిక్కిలిగ ప్రశంశించుకొనుచు పట్టణంబున ప్రవేశింప యత్నించెను. కాని భోగపురముయొక్క కట్టుదిట్టము లతనిని మహాశ్చర్య నిమగ్నుని చేసినవి. పట్టణముచుట్టు విశాలముగ నెత్తయినగోడ. దాని కొకటియే గొప్ప ద్వారము. పట్టణమునుండి పోవలయుననినను, రావలయుననినను వారి కదేమార్గము. అందు కొందరు కావలియుండు వీరభటులుగలరు. నగరున ప్రవేశించు క్రొత్తవారందరు వారివారి యూరిపేరులు వారికి

గల బాంధవ్యములు—వచ్చుచున్న కార్యములు తెలుపవలయును. ఆ విషయము విచారించుటకొరకు యధికారియుండును. అచట కేగిన వారి జవాబును నరిగనున్న భోగపురంబులోనికి పంపింతురు. సందేహాముగ నున్న ప్రభువులవారికడ విచారణ బెట్టుదురు. దుష్టుడని తెలిసినచో వెంటనే తల నరికింతురు. సన్యాసియైనచో యే విచారణయు లేక నురిదీయించుదురు.

ఈ కట్టుదిట్టము తెలియని సుధాకరుడు గుమ్మమును చేరగానే అంజలి భటులు వానిం గొంపోయి ద్వారపాలకాధికారి కప్పగించెను. ఆ యధికారి వాని నురిదీయింప నాజ్ఞలిడుచుండ సుధాకరుండు "అయ్యా! నేను సన్యాసినిగాను; కాంచననగరాధిపతి కుమారుడను. క్షత్రియుండను. ఇన్నూరు యోజనముల దూరమునుండి భూభాగములుదాటి, సముద్ర ప్రయాణంబులుచేసి యిందు రాలేక చాలబాధలు పడినాను. ముని వేషంబున నేనిటకు సుఖంబుగ చేరగలనని దెలియుటచే నొక ముని మాట ననుసరించి యీ వేషము ధరించితినే కాని నేను యదార్థమైన సన్యాసినిగాను. ఇవిగో నా వస్త్రభూషణంబులు" అని తనవద్దగల రాజరికపు దుస్తులు హారములను చూపెను.

అంత నా ద్వారపాలనాధికారి వాని మోమును చూచియు నితండు యదార్థముగ రాజపుత్రుడేనని నమ్మి వానికి విధించు నురిశిక్షను తప్పించెను.

సుధాకరుండంత వానియందు భక్తిగలవాడై; అయ్యా! సన్యాసినైన నురిదీయించమని కఠినశాసనమిచ్చుటకేమి కారణమని యడిగిన నా ద్వారపాలనాధికారి "బిడ్డా! వినుము. మా పురమునేలు వసంతసేన మహారాజు చాల మంచివాడు. అయినను సన్యాసియన్న నింత పగ గల్గుటకు గల కారణ మొక పెద్ద కథ. సావధానుండవై వినుము.



## సన్యాసి మొదటి ప్రశ్న

సుధాకరా! ఈ భోగపురము నింతకు ముందు పాలించు రాజు సార్థకనాముడైన సత్యశీలుడు. ఆయనగారి తమ్ముడు అన్నకు దగిన కీర్తిశాలియగుటచే నాతనిని యశోవంతుడనుచుండిరి. విజయపురంబు మాకు యేబదామడల దూరములోనున్నది. ఆ రాజ్యము మా ప్రభు

వులగారి మాతామహులపాలనలోనిది కాని అందు రాజకుటుంబమంతయు గతించుటచే నదియు సత్యశీల మహారాజు పాలింపవలసిన వాడయ్యెను. అందుచేత సత్యశీలుడు విజయపురంబును యశోవంతునకు పట్టముగట్టి తమ్ముని నా రాజ్యంబున నుంచ నన్నదమ్ము లిరువురు కడుసమర్థతతో రెండు రాజ్యంబుల పాలించుచుండిరి.

సత్యశీలుడు సంతానార్థమై వరుసగ నేబదిమందిని వివాహమాడెను. అయినను వానికి పుత్రయోగములు గలుగలేదు. ఇట్లుండ వాని కొల్వున కొక తపసివచ్చెను. సత్యశీలుండతని నుచితరీతి గారవించి "మహాశయా! సుతులులేని వారికి గతులు లేవని చెప్పుదురుకదా? సంతానంబునకై నేనేబదిమందిని వివాహ మాడినను. నాకు పుత్రసంతానము లేదయ్యె, దీనికిం దగు నుపాయంబు సెలవిం"డని ప్రార్థించెను.

ఆ మునిచంద్రుడును మహారాజులవారిని దీవించి "సత్యశీలా! నీ దానధర్మంబులవలన నీ పాపంబులు తొలంగినవి. ఇంక కొంతకాలంబున నీ యేబదిభార్యలందు నేబదితనయు లుదయింప నుండిరని తెలిపి తన దారిని తాను బోయెను.

తరువాత నా ఋషిపుంగవుండు చెప్పినట్టులే సత్యశీల మహారాజుల వారి యేబదిభార్యలును గర్భముల దాల్చిరి. కాన వారందరి కానం దము గలిగెను. ఇటులుండ నొక దినంబున రాజకొల్వున కొక స్త్రీ సాధువు వచ్చెను. సత్యశీలుం డామె నుచితరీతి గౌరవించి "అమ్మా! యోగినీ! నీకేమి కావలయు"నని యడుగ నామెయు మందహాసముచేసి "రాజా! నా కేమియు నక్కరలేదు కాని నీకొక్క విషయంబు చెప్ప దలంచి వచ్చితిని. నీ పెద్దభార్యయు—పట్టమహిషియునగు విపులాదేవి భోగపురమం దెచ్చటను ప్రసవింపరాదు. అట్లయినచో నీ రాజ్యంబు నకు తీరని మహాపకారము కలుగనున్నందున చెప్పకపోవుట మా దోష మని చెప్పితిని. తరువాత నీ యిష్టమని బలికెను.

న్యాయముగ సత్యశీలునకు విపులాదేవియందుండు ప్రేమ యత్యధి కము. విపులాదేవియు భర్తను దైవముగ పూజించు మహాపతివ్రత. అయిననేమి? యోగిమాట ప్రకారము విపులాదేవి పట్టణంబున నుండిన యామె కుదయించు సంతానమున రాజ్యమునకేమి యనర్థము సంభ వించునో? రాజు ప్రజాక్షేమము గోరవలసినవాడు కాన రాజ్యక్షేమంబు నకై విపులాదేవిని బహిష్కరింప నెంచెను.

వెంటనే మేధావిని పిలిపించి "సచివరా! రాజ్యక్షేమమునకై యోగినిమాట నేను పాటించుచున్నాను. భోగపురపు సరిహద్దుల కావల నెందైనను నొక దివ్యభవనము నిర్మించి విపులనందుంచి, ఆమెకు వలయు సదుపాయంబులు సేయుట మంచిదికాదా యని యడుగ మేధావి నమస్కరించి "మహాప్రభూ! నాకొక యూహ యొదవుచున్నది. పట్ట మహిషిగారు భోగపురపు సరిహద్దులలో ప్రసవింపరాదనిగదా యోగిని సెలవిచ్చెను. అయిన నామె సరణ్యాంబులలో నూతన భవనంబులు నిర్మించి అందుంచుటకంటె విజయపురికంపించుట మేలు. మీ తమ్ముడగు యశోవంతుడును వదినగారియందు మాతృభావంబుగల విధేయుడు. వారికి సంతానములేదు. అన్నబిడ్డను వారును మహదానందంబుగ పెంచు కొందురని దలంచుచున్నాను. తరువాత దేవర యిష్ట"మనెను.

సత్యశీలుండా యాలోచన కానందించి విపులాదేవిని విజయపురికి రాజమరియాదలతో పయనంబుచేసి తమ్మున కొక లేఖ వ్రాసిపంపెను. యశోవంతుడు లేఖచే సమస్త విషయంబు గమనించి వదినగారిని మాతృ దేవివోలె నారాధించుచు తన యింట నుంచుకొనెను. యశోవంతుని భార్య సుగంధియు నక్కగారియందమిత భక్తి విధేయతలతో మెలంగు చుండెను.

తరువాత భోగపురంబున సత్యశీలుని నలుబదితొమ్మిదిమంది భార్య లును, విజయపురంబున విపులాదేవియు ప్రసవించి యేబదిమంది పుత్రుల కనిరి. యశోవంతుడును నా బాలకునకు జరుపవలసిన వేడుకలన్నియు జరిపి వసంతసేనుడని నామకరణముచేయించి యతిగారాబమున పెంచు చుండెను.

దినదిన ప్రవర్ధనుడైన వసంతసేనుండయిదేండ్లవాడు కాగా వానిని సర్వకళాధురంధరుడైన పండితులవద్ద చదివింపబంపెను. అట్లా రాకుమా రుండు పదునారువత్సరంబులు గాంచు నప్పటికి గురువులను మించిన శిష్యుడై అస్త్ర, శస్త్ర విద్యలందును, కత్తిగదా ముష్టియుద్ధంబులందును వితర్క—వ్యాకరణ ధర్మశాస్త్రంబులందు ప్రవీణుండయ్యెను. ధైర్యసాహ సంబులు వానికి నైజంబులు—పరోపకారమతని కాటపట్టు. న్యాయదక్షత వానికి నిలయంబై రాకుమారున కుండదగిన సలక్షణంబుల నలరారు చుండెను. మరికొద్దికాలంబులో వాని కిరువదిరెండేండ్లు నిండినవి. యశో వంతుడతనికి యువరాజ్యపట్టాభిషేకంబు సేయ ప్రయత్నంబున నుండె.

ఇంతలో నొక నాడొక సేవకుడు "అమ్మా! ఈ కాగితము మహారాజులవారి మందిరమున దొరికినది. వారి కిష్టావలయునని ప్రభువుల వారు వేటకై పోయియుండిరి. దీనిని తమవద్ద నుంచు"డని చేతికిచ్చెను. వసంతసేనుం డా యుత్తరము విప్పి చదువగ నం దీవిధంబున వ్రాసి యుండెను.

చిరంజీవి నా ప్రియ సోదరుడు యశోవంతున కాశీర్వాదములు. ఉభయక్షేమముల తరువాత— మొన మొన్న శత్రువులు మన భోగపురమును ముట్టడించిరి. అయినను నా కుమారులయిన నలుబదితొమ్మిదిమంది బల పరాక్రమమూర్తులై వారి నెదిరించి రాజ్యమునకు శాంతి చేకూర్చిరి. విపులకుమారుడు యిచటనున్న నేమిజరిగెడివో? ఈ సమయమున లేకుండుటయే మేలు. యోగిని మాటలనుబట్టి వసంతసేను డింతటి సమర్థుడు కాడని తలంచెద. కావున వానిని భోగపురము రానీయకుము. వాడికకమీద నీవే తండ్రివి. వాని క్షేమము చూచుకొనవలయును. జాగ్రత్తగ చరించెదవని తలంచుచున్నాను. యిట్లు మీయన్న భోగపురాధిపతి— "సత్యశీలుడు".

అని యున్న జాబును చదువగ వసంతసేనునకు కన్నుల నీరు దిరిగెను. దేహమంతయు గగుర్పొడిచెను. నోట మాట రాలేదు. "ఏమీ? నేను సత్యశీలుని కుమారుడనా! యీ యశోవంతుడు నాకు పినతండ్రియా? ఐన నేనును, నాతల్లియు నిందుండ కారణమేమి"యని పరిపరిరీతుల నాలోచింప దొడంగెను.

యశోవంతుడును వేటనుండి యింటికి రాగ వసంతసేనుని గాంచి పలుకరింప నాతండు దుఃఖించుచు "మహీపాలా! ఈ కమ్మనుబట్టి చూడ మీరు నాకు పినతండ్రిగారుగాని, తండ్రిగారు కాదని స్పష్టముగ దెలియు చున్నది. కావచ్చును. నా కందునుగూర్చి మీయొద్ద నుంట కేకోరంత యులేదు. అయిన నా కా విషయమేల యిప్పటివరకు తెలియనీయ లేదు? కారణంబు దెలుపవేని నాకీ రాజ్యమక్కరలేదు. నేనే వనంబులకేనిం బోయెదనన్న వసంతసేనును చూచి, యశోవంతు డిక గత్యంతరములేక జరిగిన వృత్తాంతమంతయు దెలిపెను.

వసంతసేను డా మాటల నాలకించి "నాన్నా! మంచిదికాని నేనొక మారు భోగపురంబునకుబోయి తమ్ములను, తండ్రిగారిని చూచి రావల యునని యున్న"దనికోరెను. యశోవంతుడు వసంతసేనుని నిలిపి "నాయనా!

నీ వచటకేగినచో ప్రమాదము సంభవించును. ఏలనన!—నీ మూలమున భోగపురమునకు చెరువున్నదని కదా యోగిని చెప్పెను. రాజు ప్రజా క్షేమంబు కోరవలసినవాడు కాన నీయందెట్టి పుత్రవాత్సల్యముగలవార యినను ప్రజాభిప్రాయానుసారము నిన్ను శిక్షింపవలసివచ్చును. కావున నీవు భోగపురము బోరాదనెను.

ఆ మాటలువిని వసంతసేనుండు తండ్రీ! భోగపురమునకుబోయి నను నేను వసంతసేనుడననియు, విపులాదేవి కుమారుడననియు చెప్పనని ప్రమాణము చేయుచున్నాను. మారుపేరుతో నయినను పోయి చూచి వచ్చుటకనుజ్ఞ దయసేయుడని ప్రార్థించెను. అతనియందమితమైన శ్రద్ధాభిమానంబులుగల యశోవంతుడామాటలకింక బదులు చెప్పనేరక నంగీకరించెను.

తరువాత వసంతసేనుండు పినతల్లియగు సుగంధివద్దను, తల్లియగు విపులాదేవివద్దను యనుజ్ఞ వడసి, శుభలక్షణంబులుగల నొక తురంగము నెక్కి వారమురోజులు ప్రయాణముచేసి మరాపురముచేరెను. యూరి వెలుపలనున్న నొక వనంబున తన గుఱ్ఱమును విడిచి, తానును దాహము పుచ్చుకొని స్థాయిగ కూరుచున్నపిదప నావన పాలకునిచూచి "అయ్యా! ఇది యేయూర"ని యడిగిన యతండు భోగపురమని తెలుపగ తనలోతా నానందించెను. మరియు నీవనం బెవరిది ?

వనపాలకుడు:— ఈ వనము సత్యశీల మహారాజులవారిది.

వసం:— అయిన నీ పురవిశేషము లేమి ?

వనపాలకుడు:— అది తరువాతమాట, ముందు నీ వెవరవు ? మా పురంబున నీకేమి పనియో చెప్పుము.

వసం:— మాది జయంతీపురము. రాజుగారేదయిన నుద్యో గము నిత్తురేమో యని వచ్చినాను.

వనపాలకుడు:— అలాగా ! మా ప్రభువులు చాల మంచివారు. ఎవరేది యడిగిన దానిని తప్పక నొసంగుదురు. కాని యిది తరుణము కాదు. ఏలనన పోయిన యుద్ధములో మారాజుచేతిలో యోడిపోయిన శత్రువులందరు గుమిగూడి యెక్కుమారుగ వచ్చినారు. ఘోరమయిన సంగ్రామము జరుగుచున్నది. అనగూడదు కాని, యీసారి జయము మాకు లభించు సూచనలేమియు కనుపించుటలేదు. రాజకుటుంబ

మంతయు రాజ్యప్రజలందరు చింతా సంద్రమున మునింగియున్నారు. ఈ సమయములో నీకేమి యుద్యోగము లభించును ?

వసం:— యదార్థముగ యీ సమయము మంచిదే కాకపో వచ్చును. కాని, నేను నమ్ముకొనివచ్చిన రాజులవారికి నా సేవాధర్మము చూపుటకిది మంచియదను. ఆ యుద్ధము జరుగు దిక్కెయ్యదియో నాకు చూపింపుము. నేనిదే బోయి శాత్రవుల జయించి మనభోగపురం బునకు జయంబు గలిగించెదనని మరల తురంగము నెక్కి, కళ్లెమును సడ లించి; యొరనున్న ఖడ్గమునుదూసి; మాతృదేవిని స్మరించుకొనియొక్క పరుగునబోయి యుద్ధభూమిలో ప్రవేశించెను.

వసంతసేనుని కత్తిపదునున కనేకమంది శత్రువులు కూలిపోయిరి. అంత మిగిలినవారు భోగపురంబును జయించుట మన తరముగాదని తలంచి పారిపోయిరి. ఎవ్విధంబునను సంబంధము లేని యీ యువకుం డెవ్వడా, యింత సాహసంబునవచ్చి, మనకీ యఖండ విజయంబు చేకూర్చినవాడంచు దలంచుచు, సత్యశీలుండు వసంతసేనుని పిలిపించి యుచితాసనంబున కూర్చుండ నియమించి " బాలకా! ఎవ్వరవు నీవు ? మేము కోరకయే మాకిట్టి సహాయముచేయు బుద్ధి నీకేల గలిగెన"ని వాత్సల్యమున నడిగెను.

అంత వసంతుడు భక్తితో నమస్కరించి "అయ్యా! నేను జయంతీ పుర నివాసిని. నాపేరు విక్రముడు. నా కేదియేని నౌకరి నొసంగుదు రేమోనని మిమ్మాశ్రయింప వచ్చితిని. నేను వచ్చుసరికి మీరీ యుద్ధ కలాపంబున నుండుటచే శత్రువుల నెదుర్కొంటిన"ని బలుక భూపాలు డానందమంది " వత్సా! నీవంటి శౌర్యధనుడు, వినయసంపన్నుడు నా రాజ్యంబున నుండగోరిన నౌకరి లేకపోవునా ? ఈ నాడే సర్వసైన్యాధి పత్యము వహింపు"మని గారవించెను. మరియు నా కుమారులయిన నలు బది తొమ్మిదిమందికి మీరు గురుత్వము వహింపవలయుననియు వాంఛించెను.

వసంతసేనుడు తన ప్రయత్నము ఫలించినందులకు లోలోన సంత సించుచు, సైన్యాధిపతియై రాకుమారులందరు తన తమ్ములు కాన నెంతయో నాదరముతో చూచుచుండెను. ప్రభువుగారికి, ప్రజలకు విక్రమునియం దభిమానము దినక్రమేణ నభివృద్ధియగుట రాజకుమారుల కసూయగలిగింపజొచ్చెను. ఒకనాడు వారందరు విక్రముని కడకేగి

వేటకుంబోయి వత్తుమని యనుజ్ఞ నడిగి వనంబులకుం బోయిరి. కాని పోయినవారెంతకు తిరిగి రాకపోవుటచే నందరు శంకింపదొడంగిరి.

ఎంతటి వారికైనను ప్రమాదములు జరుగుచుండును గదా! సత్యశీలుం డంత తొందరపడి వసంతసేనుని పిలిపించి "విక్రమా! నా బిడ్డల నన్యాయంబుగ వనంబులకేల పంపితివి? వారందరు మరణించి నచో నొంటిపాటుగ నున్న నను వంచి సింహాసన మెక్కవలయునని దలంచి తివా? లేకున్నచో నీవే మాయోపాయము చేయుచున్న నా తనయులలో నొకరైనను తిరిగిరారు!" యనుచుండ విక్రముండు నమస్కరించి లేదు మహాప్రభూ! నేనే మోసంబును చేయలేదు. ఇది యంతయు కర్మ ప్రభావంబుగాని, నా కపట చిత్తము కాదు. నే నిదే వెళ్ళి రాకుమారుల వెదకి తెత్తునని నాతండును గుఱ్ఱము నెక్కి మనువాడువయమే వరణ్యంబులకుం బోయెను.

వసంతసేనుం డట్లు మహారణ్యాంబంతయు సోదరులకై తిరిగి తిరిగి వేసారి యొక పెద్దరాతిపై కూర్చుండి జరిగిన దానికై పరిపరి విధంబుల శోకించెను. నలుబదితొమ్మిది మందిలో నొకరిద్దరైనను కానరారు. ఒకవేళ దుర్విధి ననుసరించి వారలేకారణముచే నయినను మరణించి యుందురాయన్న వారి దుస్తులయినను కానరావు. ఒక గుఱ్ఱమయినను కనుపట్టదేమిచిత్రమా యని నిట్టూర్పు విడిచి మెడ నించుక పైకి నెత్తి చూచెను. ఇంచుక దూరంబులో కొన్ని గుఱ్ఱంబులు నడిచిన గుర్తులు కనుపించగ వసంతసేనుం డుత్సాహంబున మరల గుఱ్ఱము నెక్కి యాబాట కుంబోయి పరిశీలింపసాగెను.

అందు తాను తలంచినట్లే గుఱ్ఱపు గిట్టలజాడ కనుపట్టుటచే వసంతసేనుం డట్లు పోజొచ్చెను. ఆ మార్గంబు తొలుత కొన్ని చెట్ల మధ్యగ బోయి తరువాత నొక కొండ లోయలోనికింబోయెను. అయ్యది గాఢాంధకారమైయున్నది. ముందు చాల దూరమున వెలుంగు కన్పడు టచే వసంతుడా బాటను విడువక నేతెంచెను. పోవుచున్న కొలదా వెలుంగు పెద్దదై కనుపట్టెను. అచటకుంచేరి చూడ నదియొక విశాలప్రదేశము. చలువరాళ్ళచే కప్పబడియున్నది. మనోహరమైన వెలుగు గాలియు ప్రసరించుచున్నవి. అందొక మూల దివ్యభవనంబుగలవు. వసంతు డది యొక రాక్షసులనివాసమో, యేమో నని సందేహముగల్గెను.

వెంటనే తన గుఱ్ఱము నొక్కచో భద్రముగఁ గట్టి, తాను శత్రుహస్తుఁడై పరులకంట బడరాదని దలఁచి దాగుచు నా మందిరమును ప్రవేశించెను.

అందొక సర్వాంగసుందరియు నొక భయంకరమయిన జడలు విరియఁబోసికొని మీసములు గడ్డములు పెంచుకొన్న సన్యాసియు వానికి కనుపించిరి. వసంతుఁడు చాటున నుండియే వారి విషయము గమనింప దలంచెను. కొంత తడవునకు వారి సంభాషణలను బట్టి యా కన్నియ సన్యాసికేమియు కాదనియు, వాఁడా సుందరి నపహరించి రతిసుఖంబుల ననుభవింపఁదలయునని నిర్బంధించుచుండెననియు గమనించెను. అయినను మనము ముందుగ తొందరపడరాదు. సమయమునకై వేచి యుండుట మంచిది. ఒకవేళ సంతప్రమాదము సంభవించు పరిస్థితికి వచ్చినపుడే చూతమనియు వసంతుఁడు శాంతించెను.

కొంత తడవున కాసన్యాసి బయటకుపోగా వసంతసేనుఁ డా లతాంగినిజేరి "సుందరీ! భీతిల్లకుము. నీ పరిస్థితి దెలిపెదవేని నీకు నాచేతనైన సహాయము చేయుదును.

కనకాంగి:— ఎవరవు నీవు?

వసం:— కల్యాణీ! భోగపురనగరాధిపతి కుమారుఁడను. నా పేరు వసంతసేనుఁడు. నా తమ్ములు వేటకై వనంబులకువచ్చి సాయంకాలమునకు తిరిగి రాకుంటచే వారి నన్వేషింపవచ్చితిని. అరణ్యమంతయు దిరుగ నొకచో గుఱ్ఱముల కాలిబాటలు నాకు కనుపించి వాటి ననుసరించి ఇందు ప్రవేశించితిని. ఇందు చాలసేపనుండియు నే నాతని దుండగమును గాంచుచు దాగి యుంటిని. సమయమగుటచే నిన్ను పలుకరించుచున్నాను. నీ కిష్టమయిన యీ మునిరూప రాక్షసుని బారినుండి తప్పింతును. ఏమందువు?

కన:— రాకుమారా! నిన్నటి దినంబున నీ తమ్ములే గాఁబోలు నలుబదితొమ్మిదిమందిందు ప్రవేశించిరి. ఆ సమయంబున నీ దుర్మార్గుఁడు నన్ను బలాత్కరించుట చూచి నన్నురక్షింప సన్యాసిపై కత్తిదూసిరి. కాని యేమి లాభము. సన్యాసిచేతనున్న యా మంత్రదండ ప్రభావముచే వారందరు నిందు శిలారూపులై పోయిరి. వారి యశ్వంబులును పాషాణములై పోయినవి. నీవును వారివలె తొందరబడక నిదానించినందులకు చాలసంతోషము; నా చరిత్ర సాంతముగ దెలిపెద కూరుచుండుము.

సన్యాసి వచ్చువరకు చాల కాలముపట్టునన వసంతుడు కనకాంగి ప్రక్కగ కూరుచుండెను. ఆ సుకుమారియు నొకింత దగ్గరకుచని తన చరిత్ర నిట్లు చెప్పెను.

నందివర్ధనుడనురాజు భాగ్యధామమను పట్టణము నేలుచుండెను. ఆ రాజన్య చూడామణికి వకుళాదేవియను భార్య గర్భంబున బుట్టిన దానను. నాపేరు కనకాంగి. నా దురదృష్ట వశంబున నా తల్లి కొద్ది కాలంబునకే మరణించెను. మా తండ్రిగారు మరు వివాహమాడిననో నా సుఖంబున కంతరాయము గలుగునని పునర్వివాహంబున కంగీకరింపలేదు. నన్నొక రాకొమారున కొసంగి వివాహంబుగావించిన పిమ్మట తనరాజ్య మల్లున కొసంగవలయునని నన్నతిగారాబమున పెంచుచుండెను. నాతో గూడ మాతండ్రి గంభీరుని పెంచుచుండెను.

వసం:— గంభీరు డెవరు ?

కన:— గంభీరుని దొక చిన్నకథ. ఒకనాడు మా తండ్రిగారు వేట కతమున నరణ్యమునకేగి వచ్చుచుండ నందొక స్త్రీ విలపించు చుండెనట. దిక్కులేని వారల నాదరించుట ప్రభు లక్షణం బగుటచే నందివర్ధనభూపతి యామెనుంజేరి "అమ్మా! ఎవరవు నీవు ? ఎందుల కిట్లు కుందుచుంటివి ? నేనీ నగరాధిపతిని. నీకు చేతనైన సహాయము చేసెద దెలుపు"మన నామె మా తండ్రిగారితో నిట్లు చెప్పదొడంగెను.

నందివర్ధన మహీపాలా ! నాపేరు వసుమతి యందురు. మేము జాలరి వంశీయులము సామాన్య కుటుంబీకులము. పద్మాకరమను పురంబున వసింతుము. నాకు నవమాసంబుల గర్భము పూర్తియగు చున్నది. పురుడు బోయుటకు మావారెవరు లేనందున పద్మాకరము నుండి నేనును నా భర్తయు మా పుట్టింటికి బోవుచున్నాము. పేదవార మయిన మాకు వాహనంబులుగాని, పరివారముగాని లేవుగదా, అట్లు నడిచిపోవుచుండ నొకపులి మాయగవచ్చి నా నాథుని నోటవేసుకొని పోయినది. ఇంక నేనేమి చేయుదును; నాగతి యేమికావలయునని బోరున నేడ్వసాగెనట.

ఆమె దీనాలాపములకు జాలిపడి మానాన్నగారు వసుమతితో "అమ్మా! నారాజ్యంబునకు వత్తువేని నిన్నును, పుట్టనున్న నీ బిడ్డను పోషించెద. నీ యిష్ట మేమన నామె యంగీకరించి మా భాగ్యధామ నగరంబునకుం చేరెను. ఆ సమయంబున మాయమ్మ నన్ను గర్భంబున

ధరించియున్నది. అందుచేత వసుమతికి కూడ కోటలో నివాసమేర్పరచి, మా యమ్మకు పురుడుపోయు మంత్రసానిచేతనే వసుమతికి వలయు సహాకారంబులు చేయించెను.

రెండుమూడు రోజులు వ్యత్యాసముగ మా తల్లియు, వసుమతియు ప్రసవించుటచే నేనును, గంభీరుడును ఉదయించితిమి. తరువాత మా తండ్రిగారు నతనికిగూడ నాతోబాటు విద్యాబుద్ధుల గరపుచు నాదరించెను. ఆ సమయంబున మే మన్యోన్యముగనే పెరిగితిమి. పిదప నాకు యవ్వనప్రాయమురాగ తండ్రిగా రియనుజ్ఞ చొప్పున నేను రాజాంతఃపురము వీడకుండుటచే గంభీరునకు నాకు చూపులుగూడ దూరమైనవి.

ఆ సమీపంబులోనే మా నాయనగారొక భయంకర వ్యాధి మూలముగ దివంగతులైరి. మారాజ్యము మంత్రుల యధీనమైపోయినది. భవిష్యత్ రాజ్యపాలనా విధానమునుగూర్చి రెండుపక్షము లేర్పడినవి. అందొక పక్షమువారు గంభీరుడు రాజుగారిచే పోషింపబడినవాడు. అత డెవడైనను వానికి కనకాంగి నిచ్చి వివాహముచేసి రాజ్యాభిషేకము సేయుదమనియు; మరియొక పక్షమువారు అదియేమి మరియాద? ఎందయినను రాకుమారునిచూచి కనకాంగికి వివాహముసేయుదమనియు పోరాటంబులు జరుగుచున్నవి.

నా చరిత్ర యిట్టి సంకటంబుల బడేనేమాయని విలపించుచుంటిని. నన్నప్పట్టున నోదార్చువారయినను లేకపోయిరి. నేనట్లు దుఃఖించి దుఃఖించి నిద్రించితిని. కొంతసేపటికి నన్నెవరో పిలిచినట్లు భయపడి లేచితిని. అంత నాయెదుట నొక బలిష్టుడైన పురుషుండు నిలుచుండి యుండెను. వాని చూచినతోడ నా దేహమా పాదమస్తకము కంపింపనారంభించెను. ఎట్టకేలకు నేను ధైర్యముచేసి యెవ్వరవు నీవు? ఎందులకు వచ్చితివని ప్రశ్నించితిని.

వాడింతయు జంకక నేను గంభీరుని దూతను. అత డొక జాబును పంపగ గొనివచ్చితినని దానిని నాచేతికిచ్చెను. నిజముగ దానిని చదువ వలయునని యభిలాష లేకపోయినను విషయ మెరుంగుట కేనియు చదువవలయును గదా, అందుచేత నే నా జాబు విప్పిచూడ నిటులున్నది.

ప్రేయసీ! కనకాంగీ! మనవిద్దరము చాలకాలము సన్యోన్యముతో పెరిగినాము. పురంబులోని వారందరు మన కిద్దరికి వివాహమయినచో

బాగుండునని తలంచుచున్నాను. నాకును నీయందధికమైన యనురాగము గలదు. నిన్ను చూడనిది నేనెంత నిలువజాలను. మోహనాంగీ! ఈ జాబుచూచిన వెంటనే దీని వెంట బయలుదేరిరమ్ము. హాయిగ మన మానంద మనుభవింతము. నేను తొలుతనుండియు యీ భాగ్యధామంబున నున్న వాడను. నన్నే పెండ్లాడుదువేని మన మీ రాజ్యంబుననే యుండి మీ తండ్రికోర్కె ప్రకారము ధారుణి నేలగలము. అటులుగాక నీవు మరొకనిని వివాహమాడినచో నాతండు నిన్ను వాని పురంబునకు గొంపోవును. అపుడు భాగ్యధామము శత్రువుల పాలగును కాన నాహిత మాలించి వెంటనే రమ్ము. ఇట్లు నీ క్షేమభిక్షు నర్థించుచున్న గంభీరుడు" అని యుండెను.

అంత నా కా యుత్తరము చూడగ మహాగ్రహంబుగలిగినది. "ఓరీ నీచా! నా తండ్రి చే పెంచబడిన నీవు నాకు సోదరమాత్రుడవు. జ్ఞానంబు లేని వాడెవడో పలికిరని నీవును పశువువై యరచుచున్నావా? అదియునుంగాక నేను సుక్షత్రియ వంశమున జనించిన దానను. నీవో జాలరివాడవు తక్కువజాతివాడికీ మరి మాటలిచ్చుట మా తండ్రిగారిదే పొరపాటు. ఇకనైన నోరు గట్టిపెట్టుకొని బుద్ధికలిగి బ్రతుకు" మని నేను చెప్పినట్లుగ చెప్పుమని నా వార్తాహరునితో చెప్పి పంపితిని.

కాని యా దురాత్ముడు నన్నంతటితో విడువలేదు. గంభీరునకు నా యందనురాగము హెచ్చు కాజొచ్చినది. అందుకు రెట్టింపుగ నాకు వానిపై నసహ్యము పెంపొందుచున్నది. మరువాడు తగిన బలగంబుతో స్వయముగ రాజాంతఃపురమున ప్రవేశించి "ఓసీ! నీవు నాకు దక్కక పోగలవటే? అంతఃపురములోని స్త్రీలు, భటులందరు నావారు. నా మాట వినకున్నచో నిన్నిపుడే బంధించి నాకోర్కె దీర్చుకొందునంచు బెదరించెను. అంతట నేను వానిని నిందించితిని. నే నెంత నిందించినను వాడు కోపంబు బూనక నన్ను పట్టుకొన సమీపించెను. నే నెట్లో వానిని తప్పించుకొని పెద్దగ కేకలు వేసితిని. నా కేకలువినియు నన్ను రక్షింప వచ్చినవా రెవరు లేరు.

అపుడు నా హృదయంబున భయ మెక్కుడగు చున్నది. ఈ దురాత్ముడు కోటలోనివారి నందరిని లంచములచేతనో, మరెటులో తన వశము చేసికొనినమాట యదార్థము. ఈ సమయంబున నేదేని యుపాయము చేయకున్న నీ దురాత్ముని బారినుండి తప్పించుకొని పోజాల

నని దలంచి "గంభీరా! రాజగువారికిని, రాకుమారుని వివాహమాడు వారికిని మిగుల కార్యదీక్ష యుండవలయును. అట్టి పట్టుదల నీయం దెంత వరకున్నదో చూడగోరి యింత దనుక యిట్లు ప్రవర్తించితిని. అదియునుం గాక మన కుదయించు కుమారుడే ముందు ముందు భాగ్యధామ సింహాసన మెక్కవలసినవాడు. కాబట్టి మనము వేదసమ్మతముగ వివాహమాడి, శుభలగ్నంబున కలియవలయునుగాని యిట్టి గౌరవభంగమయిన పనులు చేయరాదు. ప్రభువులమయిన మనమే యిట్లుచేసిన యింక ప్రజలెట్టి వారగుదురు? కావున నీవీ రాత్రి యిందున్నచో మనమిద్దర మేకమైనటులే లోకము భావించును. కాన నాయపకీర్తి రాకుండ నీవిపుడు వెళ్ళిపోయి రేపే మన వివాహలగ్నంబు పెట్టింపుము. శ్రీఘ్రంబున నా ప్రయత్నమున నుండుమని బొంకించితిని.

గంభీరుండును నావాక్యంబులు యదార్థంబులని నమ్మి సంతోషం బుతో నింటికి పోయెను. తెల్లవారినచో నే నింక నా దురాత్ముని బారి బడుట సత్యము. కాన నెందేనిపోయి మానసంరక్షణ గావించుకొన నిశ్చయించుకొన్నందున నా రాత్రి యే గూఢ మార్గంబున కోటవీడి, ప్రాణంబులపై నాశదొలంగి, యొంటరిదాననై నడువనారంభించితిని. ఆ యర్ధరాత్రంబున నెట్లు వచ్చితినో, యెచటకని వచ్చితినో ఎంత దూరము వచ్చితినో నాకే తెలియదు. బాగుగ తెల్లవారి సూర్యో దయమగు నప్పటికి నేనొక సముద్రతీరముననుంటిని.

నేనా సముద్రమువైపు చూడగ నొకయోడ నాదెసకే వచ్చు చున్నట్లు కనుపట్టెను. దైవయోగముచే నన్ను రక్షించువా రెవ రయిన నందుండిరేమోనను భ్రాంతిచే చూచుచుంటిని. మరికొంత సేపులో నాయోడ నాసమీపమున కేవచ్చినిలిచెను. అందుండి నలువురు మనుష్యు లొక చిన్నపడవనెక్కి నన్ను సమీపించిరి. అందులో నొక వయసు మళ్ళిన వాడుండెను. అతడా యోడ కధికారియైన మహాధనికుడు. మిగి లిన మువ్వురు వానినౌకరులు. ఆ ముదుసలి నన్ను సమీపించి" అమ్మా! ఎవరివి నీవు? ఇందుండ కారణమేమి"యని నన్నతివాత్సల్యమున నడిగి నాడు.

ఆయనను చూచినతోడనే నా కెందులకోగాని వానియందొక విధమైన పితృభావము జనించినది. అందుచేత నా చరిత్రనంతయు వానికి సవిస్తరముగ తెలియచేసికొంటిని. పాపమా తాతయు నోపికవహించి

నా దీనచరిత్రనంతయు నాలించెను. నేనట్లు నాకథను ముగించి వాని మోమును చూచితినిగదా, వాని రెండునేత్రములు నీటిధారలచే నిండి పోయినవి. అదిచూచినతోడ నాకొక విధమయిన వింతగలిగినది. ఎవ రీతడు? నా దీనచరిత విన్నంత నీ ముసలి వింతగ దుఃఖించుట కేమి కారణము? అని నెవ్వెరబోయితిని.

అంత నాతండు కన్నీరు తుడుచుకొని, తనచేతితో నన్ను తన దగ్గరకుతీసికొని "అమ్మా! భయమందకు. నందివర్ధన మహారాజ పుత్రిక వైన నీకా యిన్ని కష్టంబులు? నాకంఠములో ప్రాణముండగ నీకేభయము నుండదు. నాతోడ నాయింటికిరమ్ము. నిన్నే నాకుమార్తెగ భావించి నీవుకోరిన రాకుమారునకు నిన్ను పరిణయంబుసేయుదున నేను. ఆమాటలకు నాకేమియు దోచక యితండెవడు నాయందిట్టిప్రేమ గల్గుట కేమికారణ మాయని నేనాలోచించుచుండ నాతండు మరల "అమ్మాయీ! నన్ను గురించి సందేహించుచున్నావా? అయిన నా వృత్తాంత మాలకింపు"మని మరల యిట్లు చెప్పదొడంగెను.

కనకాంగీ! నాపేరు వసుగుప్తుడు. వైశ్యకులజుండను. నానివాసము మాణిక్యపురము. మాణిక్యపురము మలయద్వీపమందున్నది. నేను వజ్రాలబేరముచేయుచు ననేక పర్యాయములు మీ భాగ్యధామమునకు వచ్చెడివాడను. నందివర్ధన మహారాజు నాకెంతయు నండగ యుండెడు వాడు. నీకు చిన్నతనంబున చేయించిన మణిహారములోని రవ్వలు నావద్దకొన్నవె. ఒక పర్యాయము నా రత్నాలమోడ దొంగల పాలు కాబోవుచుండ మీ తండ్రిగారు దైవమువోలె వచ్చి దొంగల జయించి నా సొమ్ము నాకప్పించిరి. గాన నాకు వారు మోడరత్నంబు లుచితంబుగ నిచ్చినట్లేననిదలంచితిని. వలయునేని యారత్నంబులన్నియు నీకొసంగుటకు నాకభ్యంతరములేదు.

నన్నా దొంగలనుండి రక్షించినది మొదలు మా యిద్దరికి స్నేహము కలిసినది. పెద్దతనముచే నేనిపుడు వ్యాపారమునకు వచ్చుటకులేదు. కాని ఒక పర్యాయమువచ్చి మీ తండ్రిగారిని చూచి రావలయునని దలంచుచున్నాను. ఇంతలో నీ వాయనగారి మరణవార్త వినిపించితివి. అపుడే నాకు దుఃఖముగల్గినది. మరియు నీ దురవస్థవినగ యీ పాటు లన్నియు నా బిడ్డకే కలిగినట్లుతోచి యిట్లు విలపించుచున్నాను. నేను నీకు

తండ్రినే యనుకొనుము. నా వెంటరమ్మనిన నేనును వానిమాటలు నమ్మి
పోవుటకు సమ్మతించితిని.

అంత నందరము చిన్న పడవ నెక్కి, అందుండి యోడలో ప్రవే
సించితిమి. ఓడయు ప్రయాణము చేయసాగినది. అందొక నిగూఢ
మైన గదియందు స్నానాదులు ముగించుకొని రాగ నా వైశ్యుండు నాకు
వలయు భోజనపదార్థంబులుదెచ్చి యొసంగెను. నేను వాటింగొని
తృప్తిగ భుజించితిని. వసుగుప్తుడును నాదరంబుతో మా పట్టణంపు
విషయంబులన్నియు నరయుచు కూర్చుండెను. ఓడయు నడిసముద్రమును
చేరినది. ఇంతలో సరంగుల కేకలువిని మా వణిజుండు బైటకుపోయి
చూచెను.

ఇంకేమున్నది? మా కెదురుగ నొక యోడ వచ్చుచున్నది. అది
సముద్రపు దొంగలయోడ. ఆ టెక్కెములను చూచి మా యోడవారు
గురుతుపట్టిరి. దొంగలు బలవంతులు, పలువిధములయిన యాయుధం
బులుగలవారు. వారీ విధంబున నెన్నియో యోడలను దోచుకొనిరి.
మా పడవ వారి కంటబడినది. వారు మావైపునకే వేగముగ వచ్చు
చున్నారు. మేము వెనుకకు తిరిగి పోవుటకైనను అవకాశము లేక సముద్ర
మధ్యభాగమున నుంటిమి. అంత నేనును నాదుర్విధినిగూర్చి నిందించు
కొనుచు సాటివారలవలెనె దైవధ్యానము సేయుచుంటిని.

మరికొద్దికాలములో శత్రువులయోడ మమ్ము సమీపించినది. అందు
లోని దొంగలు సులభముగ మా యోడలోనికి ప్రవేశించిరి. మా వా
రెంత బ్రతిమిలాడుచున్నను వినక నొక్కొక్కరి నా దొంగలు నీటిలో
ద్రోసి నా వద్దకువచ్చిరి. దొంగల నాయకుడు నన్నుచూచిన వాడగుటచే
దీనిని సముద్రమున నెట్టక మనయోడలో చేర్చుండని వాని పరివారమున
కాజ్ఞచేసెను. వారు ధనము, మణులు, వస్తుసముదాయమును చేర్చి
నటులె నన్నును వారి యధీనములో చేర్చుకొనిరి. నా కష్టములు
గట్టెక్కలేదు. ఇదియేమి భగవానుడా! నాకేది దారి యని చింతించు
చుంటిని.

మరునాడుదయంబు నా యోడ యొక ద్వీపమునకుచేరెను. చిన్న
చిన్న పడవలలో వా రపహరించిన ధనధాన్య వస్త్రభూషణాదులన్నియు
చేరవేసుకొనుచు నన్నును నొక పడవనెక్కించి గట్టునకుచేర్చిరి. అది

కొక సామాన్యమైన యూహ. అయినను వాలకమునుబట్టి యది దొంగలవల్లెయని దలంచితిని. వారందరు నన్నాదొంగల సరదారునకు పెళ్లి సేయుటకై లగ్నము బెట్టిరి. అదింక మూడురోజులున్నది. ఈ సమయంబులో నాత్మహత్య గావించుకొని దొంగ కిల్లాలును గాకుండ మరణింప యత్నించితిని. అయిన నేమిలాభము ? అందున్న కావలి వారా యవకాశము నాకు చిక్కనివ్వలేదు. ఇంతలో నొక సన్యాసి వచ్చి నే నున్న గుడారమువద్ద నటునిటు దిరుగుచుండెను. వానిని చూచుచుండుమని కాపలాయున్నవాడు దాహమునకై పోవగ నాదొంగ సన్యాసి తనచేతనున్న మంత్రదండమున నన్ను తాకెను. వెంటనే నాకు చైతన్యము నశించి యేమి జరిగిదో తెలియక పోయినది.

నేను మరల మానవాకారము పొందునప్పటికీ గుహయందుంటిని. తరువాత నీ సన్యాసియు తన్ను వివాహమాడవలసినదని నన్ను నానా హింసల బెట్టుచున్నాడు. ఇతని వాలకముచూచి నన్ను మంత్రలబ్ధమున దెచ్చియుండునని యూహించితిని. నిన్నటిదినంబున మీ తమ్ముల కాబోలు నను రక్షింపబోవ నీ కపట సన్యాసి తనచేతి మంత్రదండముచే వారిని నిర్జీవులజేసెనని చెప్పియుంటినిగదా ? రాకుమారా ! నీవును తొందరబడినచో యీదుర్మార్గుని చేతిలో శిలారూపమునొంది యుందువు అటుసేయకుంట యెంతయు మేలయ్యె. మరి నేదేని యుపాయంబున సన్యాసి చేతి మంత్రదండము నపహరించితివేని వాడూరక సమయగలడు. ధైర్యంబునయుక్తినిపన్ని, నన్ను రక్షించి మీచరణదాసిగచేసికొండని వసంతసేను పాదములంటెను.

వసంతసేనుడంత నయ్యింతి నత్యంతప్రీతితో దగ్గరకు తీసికొని రాకుమారీ ! భయపడకుము, నేనిందే దాగి యుండెదను. నీవాసన్యాసి యందనురాగమున్నటులు నటించి, నమ్మించి, మంత్రదండమును దూరముచేయుమని చెప్పెను.

మరికొంతసేపటికి సన్యాసి వచ్చుచుండెను. అది గాంచి వసంతసేనుడు రహస్యస్థానమున ప్రవేశించెను. ఇంతలో సన్యాసియు నరుదెంచి రాకుమారి కనతిదూరములో కూరుచుండెను. ఏమి సుందరీ ! నన్ను వివాహమాడుట కింకనయిన నంగీకరించితివా ?

కన:— అయ్యా! మీరిట్లు నన్ను నిర్బంధించుట న్యాయముకాదు. నేనును సుకుమారినగు రాచపట్టిని. నీ మీసములు—గడ్డములు నాకసహ్యా మును గలిగించుచుండ నేనెట్లు నిన్ను వివాహ మాడుదును?

సన్యా:— ఆ మాట దెలిపినచో నీ గడ్డమును దీయించక పోయితినా? యిందులకా నన్నింత వేధించితివి?

కన:— నీచేతనున్న మంత్రదండముచే నన్నిందు జేర్చితివి. దానిని నీచెంత నుండుటచే నాకు మరల భీతిగలుగుచున్నదని చెప్పెను.

సన్యా:— అటులయిన నిదిగో దీనిని దూరమున నుంచుచున్నాను.

కన:— మీ రద్దానిని దూరమున నుంచి యిటురండు.

సన్యా:— ఇదిగో వచ్చితిని.

కన:— మహామునీ! నన్ను విడిచి మరల నెవరినీ ప్రేమింపవు గదా?

సన్యా:— సత్యముగ మరెవరిని ప్రేమింపను.

కన:— ఒకవేళ నీవటులచేసిన నాగతియేమి యని సన్యాసితో వేమేమో సంభాషించుచుండ చాటుననుండి సమయంబునకై పొంచుచున్న వసంతసేనుడు చటాలున గంతిడి మంత్రదండమును చేకొనెను. అంత సన్యాసి భీతిలి వసంతసేను ననేక విధంబుల మోసగించి నా మంత్రదండ మును గ్రహింప చూచెనుగాని, ఆ కార్య మతనికి స్వాధీనము కాదయ్యె.

మరియు వసంతసేనుడు మంత్రదండముచే శిలలై పడియున్న తన తమ్ములను, గుఱ్ఱములను బ్రతికించెను. సన్యాసిని చంప యత్నించెను కాని వాడనేకవిధంబుల ప్రార్థించుటచే "దుర్మార్గా! నీ ముఖమింక మా ప్రపంచమున చూపక నేండేనిపోయి బుద్ధిమంతుడవై జీవింపుమని చెప్పి కనకాంగితో నిజాశ్వముమీద తాను తిరిగి భోగపురము పయనమై వచ్చు చుండెను.

వసంతసేనునికన్న ముందు వచ్చిన తన తమ్ములొకచోట నిద్రించు చుండుటగాంచి వసంతసేనుడు యించుక విశ్రాంతిగై కొన మరియొక చెట్టు క్రింద కనకాంగితో శయనించి నిద్రించుచుండెను. ఆ సమయంబున రాకుమారులు నిదుర లేచి విక్రమునిచూచి అసూయచెందిరి. విక్రముని వధించి మంత్రదండము హరింప నెంచుటచే అందులో పెద్దవాడు మెల్లగ

బోయి విక్రముని కత్తితో పొడిచెను. అంతలోన కనకాంగి మేల్కాంచుటచే వారా మంత్రిపుత్రులు వెరపుచెందినవారై పారిపోయి భోగపురము చేరిరి.

అంత సత్యశీలమహారాజు కొడుకులజేరి యేమిటి బిడ్డలారా! వేటకై బోయిన మీ రింతకాల మెందుండిరి. విక్రముడేడియని యడుగ వారు "నాన్నా! మేమొక రాక్షసుని మాయలోబడి రాలేక బోయితిమి. తిరిగి వానిని మేమే జయించివచ్చితిమి. కాని, విక్రమునిజాడ మాకేమియు తెలియదని బొంకిరి.

ఆ మరునాడు సత్యశీలుడు సభదీరియుండగ నొక భటుడువచ్చి "మహాప్రభూ! జీవకారుణ్యుడను నొక వైద్యశిఖామణి మీ దర్శనార్థమై కాచియున్నాడని దెలుప వారిని శీఘ్రంబుగ లోనికి ప్రవేశపెట్టుమని యాజ్ఞాపించెను. అంత జీవకారుణ్యుడు, కనకాంగియువచ్చి నిలుచుండిరి. రాజు వారికిందగు నాసనంబులిచ్చి కూర్చుండుడని యొగించి "ఏమి వృత్తాంతమనియెను. అంత జీవకారుణ్యుండు మహారాజా! మీవద్ద విక్రముడను పేరుతోనున్నవాడు విమలాదేవి కుదయించిన కారణంబున నతండు మీవద్ద మారుపేరుతో నౌకరి చేసినాడు. నీ చిన్న కొడుకు లొక మాయా సన్యాసిచే మంత్రింపబడియుండగ నాతడే వారిని బ్రతికించినవాడు. ఆ సమయంబున నతనిని వివాహమాడిన యీమెయే నీ పెద్దకోడలు కనకాంగి. ఈమె భాగ్యపురిరాజు నందివర్ధనునిపుత్రి. వీ రిరువురు నిద్రించుచుండ వసంతసేనుని తమ్ములలో పెద్దవాడే అతనిని చంపెను. అంత వైద్యునికొరకై నీ కోడలు దగ్గరనున్న మా యూరికి వచ్చి నాకుం దెలుప నేనందు పోయిచూచితిని. కాని మేము వచ్చువరకతడందు లేడు. మీరా వసంతునిజాడ నెరుంగుటకు సదుపాయంబులు చేయుదురని నీకోడలిని గొనివచ్చితినని దెలిపెను.

అంత కనకాంగియులేచి మహారాజా! వసంతసేన మహారాజునను రక్షించబోవుటకు ముందుతన రహస్యచరిత్ర నంతయు నాకు చెప్పుటచే నేనిట్లు రాగలిగితినని నమస్కరించెను.

అంత సత్యకీర్తి జీవకారుణ్యునకు సగౌరవముగ మరియాదలుచేసెను. కనకాంగిని "అమ్మా! నందివర్ధన రాజకుమారీ! నీవు మాకోడలివగుట కెంతయు మావున్నెము. కాని శౌర్యనిధియైన నీపెనిమిటి నాకుమారుడని గమనించలేక నొక సామాన్య నౌకరుగ భావించిన మందభాగ్యుడన

కానిమ్ము. యీ దురాత్ములింతటి పాపంబున కొడిగట్టిరా! రాజ ధర్మంబుగ నిట్టి యఘాయిత్య మాచరించిన నలుబదితొమ్మిదిమందికి నురి శిక్ష విధించుచున్నాను. అని తన న్యాయపాలన నిలుపుకొనెను.

మరునాడుదయమున కుమారుల నందరిని యురి కంబముల కెక్కించిరి. ఇంతటి దుష్టులయిన వారికీ ప్రాయశ్చిత్తము కావలసినదే యని కొందరు—సత్యశీల మహారాజెంత ధర్మపాలకుడు గాకున్నచో కుమారులను పక్షపాతంబు లేక తగిన శిక్షను విధించుచున్నాడని శ్లాఘించు వారు కొందరు, జనులు గుంపులుగూడి యరచిరి. రాకుమారుల తల్లులందరువచ్చి పుత్రులచూచి దుఃఖించుచుండిరి. మహాప్రభువులవారి సెలవయినది. నేరస్తుల కుత్తుకలకు నురిత్రాళ్ళ బిగించిరి. ఇంతలో నెవరో దూరమునుండి "ఆపుడు, ఉరినాపుడు" యని కేకలు వేయుచు గుఱ్ఱముమీద రయంబునవచ్చి సభాస్థలిని నిలిచెను.

సత్యశీలుండంత గుఱ్ఱము దిగిన వాని నాలింగనము చేసికొని "నాయనా! వసంతసేనా! వచ్చితివా! ఎటులు బ్రతికితివి తండ్రీ" యని యడుగ నాన్నా! తమ్ములకత్తిదెబ్బతో నేను మరణించలేదు. వనంబునచరించు చెంచులు కొందరు నన్నుచూచి వారి గూడెములకుం గొంపోయిరి. తరువాత నోషధులచే గాయమును మాన్పి నన్నారోగ్య వంతునిగచేసి, యీ మంత్రదండము నాడు నాప్రక్కనబడియున్నదనియు దానిని వారు భద్రముగ దాచితిమనియు చెప్పి నాకొసంగిరి.

నన్ను చంపిన నేరముక్రింద తమ్ములకు నురిశిక్ష విధించి మీన్యాయ దక్షత గురించి చెంచులు నాకు చెప్పిరి. కావున నా తమ్ములను రక్షించుకొనుటకై నేను త్వరితముగ వచ్చినాడను. తండ్రీ! వారిచే గాయముదిన్న నేను మరణించక జీవించితినిగాన వారా శిక్ష కర్హులు గారు. వారిని మన్నించవలయునని ప్రార్థించెను.

సత్యశీల మహారాజులవారి యనుమతిచే రాజకుమారులు మరణశిక్ష నుండి బైటపడిరి. వసంతసేనుని శ్లాఘింపనివారు లేరు. తమ్ములును వచ్చి తప్పిదము మన్నింపుమని అన్నగారి పాదంబుల వ్రాలిరి. ఇంతలో కనకాంగియువచ్చి వసంతసేనుని గలిసికొనెను. ఆ శుభసమయంబుననే సత్యశీల మహారాజు విజయపురంబునుండి తన పెద్దభార్యను పిలిపించి — తమ్ముని మరదలను రావించి సమస్త బంధుమిత్ర సపరివార వందిమాగధ

బృంధము భళీయన వసంతసేనునకు యువజరాజ్య పట్టాభిషేకము గావించెను.

తరువాత కొంతకాలంబునకు సత్యపాలుడు దివంబున కేగ వసంత భూపతి నేడీ భోగపురమును పాలించుచున్నాడు. కావున నీ మహీపాలుండు సన్యాసియను వారెవరువచ్చినను ఖండించమని మా కాజ్ఞనొసంగిరి. సుధాకరా! నీవు యథార్థమయిన సన్యాసివి కాకపోవుటంచేసి నిను వధింపక విడుచుచున్నాము. ఈ రాత్రి మాయింట భుజించి హాయిగ శయనింపుము. రేవునీకు మహాప్రభువులవారి దర్శనంబు గలిగింతునని దెలుప నతండును సంతసించెను.

మరునా డుదయంబున వసంతసేనుం డాసీనుడై యుండ ద్వారపాలకాధికారి సహాయంబున సుధాకరుండు రాజకొల్వునం జొచ్చెను. అంత భోగపురాధిపతి వచ్చిన పరదేశి నాదరించి వాని రాకకుంగల కారణమంతయు నెరింగి అయ్యా! అంత దుర్భేద్యమైన ప్రశ్న యేదియో వివరింపుమన సుధాకరుం డిట్టులనెను.

మారువేషముతోడ తమ్ముల రక్షించుకొని సన్యాసిచే బడిన కోమలీమణిని, మంత్రదండమును గ్రహించి, జటిని పారద్రోలి, మరల హత్యగావింపబడియు జీవించిన రాకుమారుడీవుడు సజీవుడా? విగతజీవుడా! వాని నామమేమి?

అనుచున్నంతనే వసంతసేనుండుగ్రుడై "యేమీ! ఆ చెనటి సన్యాసి యింకను బ్రతికియున్నాడా? ఈనాటికిని పరులనువచించుచున్నాడా దెలుపుము సుధాకరా! ఆ ప్రశ్నలకు కారకుడనైన రాకుమారుడను నేను నేను మరణించినట్లు దెలిసినచో యాకపటి తిరిగివచ్చి మంత్రదండమును అపహరించి. కనకాంగిని బలాత్కరించుటకై కాబోలు నీ ప్రశ్న నడిగించుట? వానిం జూపుము. వెంటనే సంహరించెదననెను. ఆ మాటకు సుధాకరుండు. అయ్యా! ఇంకను రెండు ప్రశ్నలకు సమాధానము తేలవలయును. అందులకై నేను గజపురము, జపాపురముపోయి వచ్చుచు నిన్ను కలుపుకొని మార్తాండపురమున కేగెదగాని దయయుంచి సన్యాసి చేసిన చరిత్ర దెలుపు మనగ వసంతసేనుండు తన వృత్తాంతమంతయు దెలిపెను.

ఆ దినమందు సుధాకరుండు విశ్రాంతి తీసికొనగ వసంతసేనుం డతని నతిగౌరవంబున చూచి మరునటి దినంబున కొందరి సేవకులతో

గూడ సుధాకరుని కుశలంబుగ గజపురంబునకు జేర్చి రమ్మని యాజ్ఞాపించెను. సుధాకరుండును వారి సహాయముచే గజపురంబుచేరి "భోగపుర పౌరులారా! నేనింక నాకార్యంబుల జక్కబెట్టుకొని వత్తును. మీరు మీ నగరికేగి మీ రాజుగారితో నాయక్షేమసమాచారంబుల దెలుపు"మన వారును తిరిగిపోయిరి.



# గజపుర వృత్తాంతము

సుధాకరుండా సముద్రభాగంబున గజపురంబును గని మహాశ్చర్యంబు నొందెను. ఆహా! ఇట్టి ప్రదేశంబు లీ జగత్తులపై గలవని ముందెన్నడు నాలకించి యుండలేదే? ఏమీ యీ పుర వైభవము? మహాకవులేనియుని వర్ణింపజాలరని తోచుచున్నది. అట్టిచో నేనా యింక దీనిని గురించి శ్లాఘింపగలవాడను?

ఈ వనంబుల సమస్తమయిన సుగంధరాజంబులు లభించునట. మరియు నిందలి గజంబులు మిక్కిలి ప్రసిద్ధి గాంచుటచేతనే యీ పురంబునకు గజపురంబను నామంబు సార్థకమయ్యెనట యని దలంచుచు కాంచన నగర రాపుత్రుండు గజపురాధీశ్వరుల వారికోట యొద్దకుంబోయి తన రాకను ప్రభువులవారి కెరిగించెను. తానట్లు జెప్పక పూర్వమే నాయూరి పౌరులాయనను బంధించి రాజుగారి కడకుం గొంపోయిరి.

సుధాకరుని చూచి భానుమంతుడు "ఓయీ! సన్యాసీ! మా పురంబున బైరాగులు తిరుగరా"దని శాసించి యుండ నీ వేల యింత ధైర్యంబుగ వచ్చితివి. నిన్నిదే నా కరవాలంబున నరికెదనని గర్జింప నా బాటసారి "ఓ రాజా! నేను సన్యాసినిగాను. సన్యాసికి విరోధిని. నే నొక కార్యంబున నీ మాయా ముని వేషము ధరించితి"నని బలికెను.

భాను:— నీవు బైరాగివి కాకున్న రాజకుమారుడవా?

సుధా:— అవును రాకుమారుడనే. కాంచనపురము మాది. ప్రభాకర మహీపతి నందనుండను. నా పేరు సుధాకరుడు. మార్తాండ పురమున మహాఘోరముచేయుచున్న సన్యాసి ప్రశ్నలకు సమాధానమునకై రాచరికపు వేషంబుననున్న నా రహస్యంబు దెలియు నేమోనని మాయ నాటకమాడితిని.

భాను :— అలాగుననా ! నీ ముఖవర్ఛస్సును, వాక్యముల గంభీరత చూడ నీ మాటలు నిజంబులని నమ్మి నిన్ను చంపక విడుచుట యెగాక నీకు గౌరవమిచ్చుచున్నాను. ఇటు వచ్చి యీ యుచితాసనంబున కూర్చుండి నా కా విషయమంతయు దెలుపుమన సుధాకరుం డించుకయు ప్రాల్మాలక నడచిన కథ నా మూలాగ్రముగ దెల్పి "సన్యాసి ప్రశ్నలలో రెండవదానికి జవా బీ గజపురంబుననే దెలియగలదట. మీరు నా కా సహాయము చేయవలయు"నని కోరెను.

అంత భానుమంతుం డా ప్రశ్న యేదియో వినిపింపు మన సుధా కరుండు "మహారాజా ! వినుము—

మగువవై, మగ వేషముదాల్చి; మంత్రిగ చరించుచు నలువురు మగువల మమకారమునకు పాత్రురాలై మగనితో పయనించుచు మాయ సన్యాసిచే కలిగిన మహాపన్నంబునుండి బైటపడిన వీరనారి సజీవియా ? విగతజీవియా ? ఆమె నామమేమి ?

ఆ మాట వినినంతనే భానుమంతు డతిరోషంబున "ఏమీ ! ఆ దుష్టసన్యాసి యింకను జీవించి లోకాపకారము గావించుచున్నాడా ! వాడెందుండెనో చెప్పుమన సుధాకరుండు వానిని శాంతింప చేసి మహారాజా ! వాడెందును బోవడు. నే నింక జపాపురంబునకు బోయి వచ్చినగాని నేనును మీరును భోగపురాధిపులైన వసంతసేన మహారాజు గారును కలిసి వెళ్లవలయును. కాని ముందు దయయుంచి సన్యాసి ప్రశ్నకుం దగిన చరిత్ర నేదియో తెలుపు మన నాతం డిట్లు సుధాకరునితో చెప్ప మొదలిడెను.

సుధాకరా ! వినుము. నా భార్యయగు సౌదామినియే సన్యాసి యడిగిన కాంత. నాడు మాతండ్రి శత్రుంజయుడీ రాజ్యమును పాలించు చున్నాడు. మా తల్లి శాంతాదేవి, మంత్రి బుద్ధిసాగరుడు. సేనాధిపతి ప్రతాపుడు. వారందరి సహాయముతో మానాన్నగారు రిపుజన భయం కరుడై రాజ్యంబు నిర్విచారంబుగ బాలించుచుండెను.

నేను మా తండ్రిగారి కేకైక కుమారుడను. నన్ను విడనాడి నా తల్లిదండ్రు లొక గడియయైనను జీవింపరాని యనురాగముతో పెంచు చుండిరి. నేనును యిరువది వత్సరంబులనాటికి సర్వవిద్యలయం దారి తేరి సాటి రాకుమారులయందు మిన్నయై యుంటిని. మా తండ్రిగారును నా కింక యువరాజ్యపట్టాభిషేకము సేయుదలంచుచుండెను.

అటులుండ నేనొకనాడు విలాసంబుగ మా పూదోటలో విహరించు చుంటిని. తలవని తలంపుగ నాముందొక సుందరి ప్రత్యక్షమాయెను. తొలిచూపుతో నాయమ వనకన్యయో, దేవకన్యయో యనునట్లు భావించితిని. కాని ఆమె మరెవ్వరునుకాదు. మా సేనాధిపతి కుమార్తె. చిన్నతనంబులో మేమెంతయు ననురాగంబున కలిసి మెలిసి తిరిగిన వారము. నాతోడనె యా యింతియు విలువిద్యయు, కత్తి, ముష్టి యుద్ధంబులు నేర్చెను. కాని యవ్వనప్రాయ మంకురింపగ మనకులాచారముల ప్రకార మామె యిలు దాటరానిదగుటచే కొద్దికాలంబునుండి మాకు చూపులు లేక పోయినవి. కాని పసినాటికంటె నాతలాంగి యెన్నోరెట్లు సౌందర్యవతియై నా కన్నులతో చూచుచున్న దానినే నమ్మలేకుండ చేసినది. అపుడు నేను నగవుచు "సౌదామినీ!" యని పిలిచినాను.

సౌదా :— భానుమంతా!

నేను :— ఇందేల వచ్చితివి?

సౌదా :— భానుమంతా! మనము విడరాని యనురాగంబున తిరిగి పెరిగితిమిగదా! నన్ను వివాహమాడెదనని నాకు వచించిన మాటలు మరచి పోయితివా? ఇపుడా సమయము సమీపించినది. నీకు మరొక మారు జ్ఞాపకము చేయవలయునని వచ్చినాను.

నేను :— సౌదామినీ! ఇదియేమి న్యాయము? నాడు నాకతి బాల్యము. తెలియక పలికిన మాట నిజమే. అయినను నేను తండ్రి చాటు వాడను. మా తలిదండ్రు లీ వివాహంబున కంగీకరింపరు. కావున నా మాటలు మరచిపొమ్ము.

సౌదా :— భానుమంతా! స్త్రీ లనిన అంత తేలికవారనుకొను చుంటివా? ఏనాడు నిన్ను మనసున దలంచితినో ఆనాడే నీవు నాకు భర్తవైతివి. నాడె నేను నీకు భార్యనైతిని. నీవు మీ పెద్దల యనుమతిని పొందిగాని పొందకగాని నన్ను వివాహమాడకున్న నే నే దేని ప్రాణ త్యాగము చేసికొంటయె యదార్థము. నాకు శ్రాద్ధక్రియలుచేసి పెండ్లాడుమన కన్నీరు నించిన సౌదామినిని చూడలేక నప్రయత్నముగ నామె చేతులు పట్టుకొని లేదు ప్రేయసీ! ఎటులయినను నిన్నే వివాహమాడు దును. ఈ సూర్యచంద్రాదిగ్రహంబుల సాక్షిగ నీవు నాభార్యవు. ఇంత

సంతోషంబున నింటికి బోవుచుంటిని. సౌదామినియు సంతసంబున తన మందిరంబునకుం బోయెను.

ఆ రాత్రి యీ కార్యమెట్లు సాధింతునా? నా తల్లిదండ్రుల నెట్లు లొప్పింతునా యను విచారముచే నాకాకలి వేయక నేను భోజనము చేయలేదు. ఆ విచారముచే నాతల్లి నన్ను జేరి నా విచారమునకు హేతువేమని పలుమారు ప్రశ్నించుచుండ నా మనోగతంబు దెలుపుట కిదియే సమయంబని సౌదామినీ వివాహప్రశంస దెలిపితిని. నా మాట వినినంత మాతల్లిగారు మిక్కిలి కోపించి నన్ననేక విధంబుల మందలింపజొచ్చెను. నేనెంతకు వినకుంటచే నాతండ్రియు నా పక్షము వహించి మా నాన్నగారి కెంత చెప్పినను వినక పూర్తిగ తిరస్కరించెను.

ఆ సమయంబున నాకేమియు దోచక సైన్యాధిపతి యింటికే బోయితిని. ప్రతాపుడు నన్ను గౌరవంబున కూర్చుండజేసి నారాకకుం గారణమడిగెను. నీ వలన సహాయము నొందు గావలసి వచ్చితినని నేను బల్కితిని.

ప్రతా :— ఆదేశమేమో సెలవిండు. చేతనైన చేసెదను.

నేను :— అయిన వినుడు నా కీయాలోచన చెప్పుము. యువతీ యువకుల ప్రేమ ననుసరించిన పాణిగ్రహణము మంచిదా? పెద్దల యనుమతి వివాహము మంచిదా?

ప్రతా :— మహారాజా! మీకు సమాధానము చెప్పగలనా? అయినను నా యభిప్రాయము దెల్పెద వినుడు. పెద్దలు కులము, గోత్రము, సాంప్రదాయమును మున్నగువాటిని చూతురు. వధూవరులు వారివారి మనోభిలాషలను ప్రధానముగ పాటింతురు. ఒకప్పుడు దాంపత్యమున స్వయంవర వివాహమే ధన్యత చెందవచ్చును. తల్లిదండ్రులనుమతించనపుడు వధూవరులు స్వతంత్రించుటయే మంచిదని నాయభిప్రాయము.

నేను :— అయిన నేను మానాన్నకిష్టములేని కన్నియను బెండ్లాడ దలంచినచో నీవు నాకు సహాయము చేయుదువా?

ప్రతా: — దైవము మీ కనుకూలించునుగాక. యువరాజా! మీకట్టి యనురాగముగల మహాదృష్టవంతురా లెవరో చెప్పెదరా?

నేను :— ఎవరో కాదు. నీ కుమారి సౌదామిని. ప్రతాపా! మా ప్రేమలు పవిత్రమయినవి. మా నాన్నగారు నా మనోగతంబు గమనించుట

లేదు, నీవును నిరాకరింతువేని మేమాత్మహత్య గావించుకొందుము కాని జీవింపము. అదియునుం గాక నీ కుమార్తె నాభార్యయగుటవలన మహారాణి కాగలదు. వివాహంబు జరిగిపోయిన పిదప మహారాజుగారెంత కోపించినను నేను యేకైక నందనుండను గాన తుదకంగీకరింపక బోడు. వారికి తెలియకుండ ముందీ కార్యమును మీరు పూర్తి చేయవలయునంటిని.

అంతవరకు చాటుననుండి నా మాట లాలకించుచున్న సౌదామినియు తనతండ్రిని బ్రతిమిలాడెను. ఆ సమయంబున సమీపములోనున్న శుభ లగ్నమందు సౌదామినితో నా వివాహము ప్రతాపు నింట రహస్యముగ జరిగి పోయినది.

వివాహంబు జరిగిన మరుదివంబుననే యీ వార్త మా తండ్రిగారికి తెలిసి ప్రళయకాలరుద్రునివోలె మండిపడి "నన్నును నా భార్యను చిత్ర వధచేయు"డని యాజ్ఞాపించెను. అందులకు మంత్రియగు బుద్ధిసాగరుడు "మహాప్రభువులవారు తొందరబడుచున్నారు. పాపమో, పుణ్యమో జరిగిపోయినది. యువరాజుగారి తప్పులు తండ్రిగారయిన మీరు మన్నింపకున్న నెవరు సైరింతురు. ప్రభూ! దూరమాలోచింపుడు. భానుమంతు నీ చిన్న నేరంబునకు కడదేర్తురేని రేపు గజపురసింహాసన మెక్కువారెవరు ?" అని ప్రార్థించినను వినక మాతండ్రిగారు యెట్టకేలకు "సచివరా! అటులైన తెల్లవారుసరికి సౌదామినీ భానుమంతుల నా రాజ్యమునుండి యెందేని పొమ్మనుమను"మని కఠినముగ నాజ్ఞాపించెను.

బుద్ధిసాగరుడు నాయం దిట్టి యుపకారముచేసినవాడై నన్ను బిలిచి జరిగిన దంతయుదెల్పి "భానుమంతా! కష్టము తెల్లకాలము కాపురములు సేయవు. నాహితమాలకించి నీభార్యతోగూడ నెందేని కొంతకాలము తలదాచుకొనుము. మంచిరోజులు వచ్చినతోడనే మనపురము చేర వచ్చును. రేపటి వేకువన నీ ప్రయాణమునకు వలయు సన్నాహముల చేయింతు"నని బలికెను.

నేనును గత్యంతరములేక మంత్రిమాట ననుసరించి మరునాడు తెలవారుసరికి సౌదామినితో నౌక నడవిని చేరితిని. అప్పటికి మాప్రయాణము పదియామడలు జరిగినది. అందు మేమిరువురము మావిధిని గురించి

చింతించి భయంకరమయిన యడవిలో పదిదినంబులు నడచితిమి. ఎంత నడిచినను మహారణ్యంబున దారియు దరిలోచదాయె.

ఒకనాటి మధ్యాహ్నంబున సౌదామినికి తీరని దాహపీడన మేర్పడెను. మంచినీటికై నే నందందు వెదుక నొకచోట కొండకాలువయు నందు మధురజలంబులు నుంటచే నేను కడుపారద్రాగి యొకతామరపాకు దొప్ప నిండ నీరంబుగొనివచ్చితిని. సుధాకరా! అందేమయిన మార్గమున్నగదా పోయిన బాటను తిరిగివచ్చుట ? సౌదామిని గలచోటు తెలియక చాల దూరము తిరిగితిని. ఎందును కనుపించక పోవుటచే పిలిచితిని. బిగ్గరగ కేకలు వైచితిని. కాని లాభము లేకపోయెను. తిరిగి తిరిగి తుదకు మతి చెడిపోయి నేను దేశంబుల పాలయితిని. తరువాత సౌదామినిని చేరిన విధంబు పిదప చెప్పెదనుగాని యిక నాభార్య చరిత్ర నాలింపుము.

సౌదామిని నారాకకై యా దినమంతయు చూచినది. నేనామెను మోసగించి పోయితినని కొంతసేపు — బాట పొరబడి యుందునని మరి కొంతసేపు తలంచుచు — దుఃఖించుచు — రోదనముచేయుచు నెట్లో నా రాత్రిగడిపినది చివరకేమియుదోచక తా నిటువంటి ప్రదేశంబుల నొంటరిగ నెవరి కంటనైనబడిన నేమి యపాయము సంభవించునోయని శంకించి దరినున్న పల్లెకుంబోయెను. ఆ పల్లెలోని యొక యిల్లాలు సౌదామిని యందు జాలిగలిగినదై యొక జోశ్యురాలి యొద్దకుం గొంపోయినంత నామెయు చింతించి "అమ్మా! నీభర్త జీవించియున్నాడు. కాని సంవత్సరమువరకు మీకు యెడబాటుతప్పదు. నీకీ స్త్రీరూపముననున్న కీడు సంభవించు సూచనలున్నవి. పురుషవేషము ధరించితివేని సంపూర్ణ విజయంబు చేకూరు"నని చెప్పెను.

జోశ్యురాలి మాట ప్రకారముగ నాసతీమణి యా మూట యందుంచబడిన నా దుస్తులు ధరించి, పురుషరూపంబుతో గుఱ్ఱంబునెక్కి మార్గంబెరిగి యాపల్లెచేరియుండిన రాజ్యంబునకుబోయి పరదేశీయులకై నియమింపబడిన సత్రంబున ప్రస్తుత నివాసమేర్పచుకొన్నది.

ఆ సాయంకాలమున సత్రపు యజమానివచ్చి పరామర్శింప సౌదామిని "అయ్యా! ఈ పురమందలి విషయంబులు దెలుపుమనెను. అంత వాతండు "ఓ బాటసారీ! మా పురముపేరు చంపకపురము. మా ప్రభువులవారు నీలధ్వజ మహారాజు. ఆయనగారికి నంద, సునందలను

కుమార్తె లిద్దరు గలరు. వారు రూపవంతులు, యవ్వనవంతులు, సోదరీ ప్రేమను విడనాడనివారు. వారు వేరువేరుగ వివాహంబులాడినచో వారి రొకదారి పోయినచో నొకరి నొకరకు దూరమగుదురని వారిద్ద రొక రినే పెండ్లియాడ దలంచిరట." యని తెలిపెను.

## సన్యాసి రెండవ ప్రశ్న

పురుషవేషంబునందున్న సౌదామిని నీలధ్వజమహారాజుం దర్శించి మహారాజా! నేను గజపురాధీశ్వరుండయిన శత్రుంజయ మహీపతి నందనుండను. నాపేరు భానుమంతుండు. నేనొక కారణంబున నిందు వచ్చినాడను. నాకు మీ కొలువునందేదేని యుద్యోగమిప్పింతురాయని యడుగ నాతండాలోచించి సాటి రాకుమారునకు తగిన నౌకరియా యోచించుచు ప్రధానమంత్రిపదవి నొసంగి; ప్రత్యేకభవనంబు మున్నగు వసతులు గల్పించెను.

ఇట్లుండ నొకనాటిరేయి భయంకరమయిన ధ్వని గజపురంబున వినబడెను. మాయా భానుమంతుడా శబ్దంబున కేమి కారణమని యడుగ నీలధ్వజుండు "మంత్రివరా! అదేదియోనాకు తెలియదు. చాలకాలమునుండి మా రాజ్యమునకిట్టి విలయంబులు గలుగుచున్నవి. ఈ కేకలిట్లే మూడుదినంబు లుండును. మరల కొంతకాలము వినబడవు. ఈ మధ్యకాలంబున మనరాజ్యములోని ప్రజలు విశేషంబుగ నశించుచుందురు. భానుమంతా! దాని నింతవరకు గమనించినవాడును, యీ విపత్తునుండి ప్రజలరక్షించినవాడును లే"డని తెలిపెను.

ఆ మాటలు వినిన సౌదామిని మహారాజా! అయిన నేటిరేయి నేనా విషయంబు గమనించి పట్టుకొనెదగాకయని సాయంకాలమునందే తత్ప్రయత్నమున నుండెను. గతదినంబువోలె భయంకరనాద మారంభించగ మాయా భానుమంతుండు యూరి యుత్తరపుదిక్కు ననుసరించి యా గాఢాంధకారంబున చాల దూరముపోయి, శ్మశానంబుచేరెను. అచటనొక శవంబును ముందుంచుకొని పెద్దపెట్టున నేడ్చుచున్న యవ్వనిం డాసి పరామర్శించిన సౌదామినితో "అమ్మా! ఇతడు నాబిడ్డ నా కందరును పోయిరి. వీడినినేను ప్రాణములతో సమానంబుగ పెంచుకొనుచుండగ నీ యూరి రాజన్యాయము నా కుమారుని వధింపజేసెను. నేనా పుత్రశోకమున విలపించుచుంటిని. నా కిందెవరు దిక్కులే"దని పలికెను.

ఆ మాటలు విని జాలిపడిన సౌదామిని "అవ్వా! ఎంతచింతించి నను మరణించినవారు తిరిగిరారు. ఎవ్వరు లేనియెడల నా యింటికి రమ్ము. నీ బిడ్డగ నిన్ను పోషింతును. నేనీ రాజుకడ నుద్యోగిని. పట్టణంబునబుట్టు నీ విలయంబు నెరుంగవలయునని వచ్చుచుండిన నా ముసలిది తిరిగి అయ్యా, అటులైనరమ్ము. నీకా ధ్వని జనించుచున్న గుట్టను చూపెదననుటచే ముందు సౌదామినియు, వెనుక నా ముసలిదియు చాల దూరము నడచిరి.

సౌదామినికి చెవులు చిల్లులువడునట్లు అరపులు వినవచ్చుటచే వెనుకకు తిరిగిచూచినది. అపుడు తనవెంటనున్న ముసలమ్మలేదు. వికృతాకారియు, దీర్ఘకాయురాలునగు నొక భూతము కనుపించి "ఓసీ! నరకాంతా! ఇన్నాళ్ళనుండి మాకు మంచి మాంసము దొరుకలేదు. నిన్ను చక్కరవాయసంబుగ తిందునని మీది కురుకుచుండెను. సౌదామిని కానాటితో జీవిత మంతమగుచున్నదని నిర్ధారణగలిగి, యెట్లును మరణించుచున్నాను. అయిననూ సాహసించిన వచ్చు నుపద్రవములేదుగదా యని మనంబున (శ్రీ) వీరహనుమానుని దలంచి, యొరనున్న కత్తి నిలాగి యొకమారుగ లంఘించి యా భూతమును మెడవైచుకొని యొకచేతితో దాని కొప్పుపట్టుకొనెను. వెంటనే నా భూతము వింతగ క్రిందపడుటచే సౌదామిని తనచేతి కత్తిచే జుట్టు మొదలంటకోసెను.

అపుడా భూతము శక్తిహీనమై మాయాభానుమంతుని పాదముల వ్రాలి తన్ను జంపవలదని బహువిధంబుల ప్రార్థించినది. కాని లోక సంహారివగు నీ చరిత్రంబేమియని యడుగ నా భూతలంబుల తల్లి సౌదామినితో యిట్లు చెప్పెను.

అమ్మా! నేను భూతంబులకు తల్లిని. అరుణాద్రియందు మా నివాసము. మేము కొన్నికొన్ని ప్రదేశంబులను తిరుగుచుందుము. మాకు మాయారూపములు దాల్చుశక్తియుగలదు. నేనే శ్మశానంబుననుండి మూడు దినంబులు పెద్దరొదచేయుదును. నాభయంకర నాదంబుచే గజపురంబున ననేకులు చచ్చుచుందురు. రాత్రిళ్ళు శ్మశానంబునకు వచ్చి కాలిపోయినవాటిని, పూడ్చినవాటిని తినుచుందును. నేడు నీవు వచ్చుట గమనించి—నీవాడుదానవనియు తెలిసి—పడుచుదాని మేనికండలు రుచిగనుండునని, కమ్మగ మెక్కవలయుననియు నాశించి నిన్నీమోసము చేసితిని. తల్లీ! నీకు నమస్కారము. ఇదిగో యీ రత్నమును గైకొని

నాజుట్టు నాకిమ్ము, జుట్టులేనిపక్షమును కోరలుపీకిన పాముతో సమాన మని ప్రార్థించెను.

చిట్టచివరకు సౌదామిని దుష్ట భూతమునకు చేతులు ఖండించి ప్రాణములతో విడిచిపెట్టి తిరిగి తన గృహంబునకుచేరెను. మరునాడుద యంబున సౌదామిని భానుమంతుని వేషముతోనె కొలువున కేతెంచి ప్రేతమును జయించిన వార్తను సవిస్తరముగ దెలిపి తాను గొనివచ్చిన రత్నమును ప్రభువులవారికి బహూకరించెను.

నీలధ్వజుండు నూతన మంత్రి ప్రభుభక్తికి — ధైర్యసాహసంబులకు మిక్కిలి సంతసించి యతం డిచ్చిన రత్నమును తనకుమార్తెల కిచ్చెను. ఆ రత్న మతిసౌందర్య ప్రకాశంబులు వారి స్త్రీల మణులన్నిటికంటె మిన్న దగుటచేసి నందసునందలు తగవులాడుకొన నారంభించిరి. అంత వారు తండ్రినిచేరి మరియొకరత్నంబు దెప్పింపకున్న నింక మెతుకైనను ముట్ట మనుటచే ప్రభువులవారు కుమార్తెలయం దనురాగంబు పెంపున మాయా భానుమంతుని పిలిచి "మంత్రివర్యా! ఎటులైనను సాధించి మొన్నగడించి నట్టి రత్న మింకొకటి సంపాదించగలవా" యని కోరెను. సౌదామినియు "మహారాజా! అది నేను నమ్మకము చెప్పజాలను. దైవముందు భార ముంచి ప్రయత్నించెద"నని బల్కెను.

సుధాకరా! సౌదామిని యింత సాహసంబుసేయ నేలనందు వేమో! మరేమియు కారణములేదు. పతివియోగముచే జీవితముపై విరక్తి చెందినది. ఆత్మహత్య మహాపాతకము. కావున నిట్టి సాహసముచే సాధింతునా జగత్ప్రఖ్యాతివహింతును. మరణింతునా భర్తనుబాసి జీవించుటకంటె హాయిగ వీరస్వర్గంబున కేగెదనని దలంచి సాహసంబునకు పూనుకొన్నది. కావున తగిన సన్నాహముతో నర్థరాత్రి సౌదామిని మరల శ్మశానంబున కేతెంచెను.

ఆ శ్మశానంబున నొక సర్పంబు యైదుశిరంబులు గలిగి, అయిదు తలలమీద దేదీప్యమానంబులైన మణులతో ప్రకాశించుచున్నది. సౌదా మిని వాటిని చూచినది. కాని, యా మణులెట్లు లభించునాయని యాలో చించుచు నెదురుగనున్న పాముయొక్క కాటునకు గురియాదునేమో యని శంకించి దారి తప్పుకొనెను. అంత నా భుజంగంబు గుఱ్ఱముగామారి మరల గోరు వంకగమారి యొక గొయ్యివద్ద కూర్చుని అందు పూడ్చిన శవంబుపై మట్టిని త్రవ్వుచుండెను.

సౌదామిని ప్రాణంబులను తెగించి ధైర్యముబూని వెనుకగబోయి నొక్క వ్రేటున దాని కుడిరెక్కను తెగవేయగ నాగోరువంక భూతాకారము దాల్చి తెగిపోయిన చేతితో భూమిపైబడి బాధ నొందుచుండెను. ఆసమయంబున వసతిచూచుకొని రాకుమారి వాని సిగను కత్తిరించి చేతబట్టుకొని వధింపబోగా నా భూతంబుపెద్ద మాయా భానుమంతుని ప్రాణభిక్షగోరెను.

సౌదా:— ఓయీ! మొన్నటిభూతంబు మరల మా పొలిమేరను ద్రొక్కనని చెప్పిపోయినది. నీవేల యిందువచ్చితివి?

భూత:— అమ్మా! మహారాణీ! మన్నింపుము. ఆ భూతము మా కందరికి తల్లి. నేనా భూతంబులకెల్ల పెద్దను. అధికారిని. మా తల్లికిగల్గిన దురవస్థచూచి నిన్ను మ్రింగవలయునని వచ్చుచుంటిని. మీరు నాకిందెదురయితిరి. అందుచే మాయోపాయంబులనైన నిన్ను హరించదలంచిన మాట యదార్థము. ఇచటకురాగ మానవమాంసము వాసనవచ్చినది. దీనిని తిని తరువాత మీ చెంతకు రావలయునను కొంటిని. ఓ వీరవనితామణీ! మీ శక్తిసామర్థ్యములు నాకిపు డర్థమైనవి. ఇకమీద మీజోలికిగాని, మీ నరులజోలికిగాని రాను. నన్ను దయయుంచి విడిచిపెట్టుము. శరణుగోరిన వారిని చంపుట మీబోంట్లకు ధర్మము కాదుగదా?

సౌదా:— అటులయిన నేను మీ నివాసభూములను చూడ వలయునను కొంటిని. చూపింపుము.

భూత:— తల్లీ! మీరందు రాజాలరు.

సౌదా:— అటులుగాదు. నేను చూచి తీరవలయును.

భూత:— అటులైన తమదయ. నాకును చేతి బాధ యధికంబుగ నున్నది దయచేయుడని సౌదామినిని తన నివాసంబునకుంజేర్చి "అమ్మా! నీ యిచ్చవచ్చినంతసేపు పందుగల వింతల చూచిన పిమ్మట నన్నుం బిలుతు వేని మిమ్ము సుఖాయాసంబుగ తమమందిరమునకు జేర్చెదనని చెప్పి దూరముగబోయెను.

సౌదామిని వృత్తాంతమును, సామర్థ్యమును తెలిసికొను శక్తిగల భూతములన్నియు నామెను చూచి పారిపోయినవి. అందా రాకుమారి నిర్భయంబుగ తిరుగజొచ్చెను. ఆమె కందెన్నో యద్భుతములైన కట్టడ

ములు కనుపించెను. మణుల ప్రకాశము మనోహరముగ నుండెను. అచటి శిల్పములు, భవనంబులు, నుద్యానాదుల చూచినచో మన భూతలంబున నున్న పట్టణంబులేవియు వాటికి సమానములుగావని నాభార్య నేటికిని చెప్పుచున్నది.

మాయా భానుమంతుడా భవనవైభవంబుల శ్లాఘించుచు నందున్న నొక వృక్షంబుకడకుబోయి చేతికందినపండు నొకటి కోసి దానిం భుజింప యత్నింప దాని నిండను రత్నంబులుండెనట. ఆ రత్నము లన్నియు తొల్లిటి భూతంబు తనకిచ్చిన రత్నముతో సమానముగ నుంటచే నమితాశ్చర్యమునొంది యించుక ముందుకేగెను. అందొక మందిరమున నిరువురు సుందరాంగనలు కనుపించిరి. వారిని చూడ మానవకాంతలై యుందురనిదలంచి సౌదామినివారలవద్దకేగి చానలారా! నేను గజపురాధిపతి కుమారుడ — భానుమంతుడను. ఈ భూతంబుల జయించి వచ్చితిని. మీరు యదార్థముగ మనుజకాంతలైన మీచరిత్రను దెలుపుడు. మిమ్ము రక్షించెదనన నా కన్నియలు నమస్కరించి యిట్లు చెప్ప దొడంగిరి.

రాజకుమారా! మేము సత్యాలయంబేలు శ్రీమంతుని కుమార్తెలము. భువనమోహిని, కల్యాణి యను వారము. మా సోదరునిపేరు శౌర్యనిధి. మాతల్లి లలితాంగి. మా తండ్రిగారు మమ్ములను పువ్వులలో బెట్టి పెంచుచుండిరి.

మేమొకనాడు వనంబున విహరించుచుండ నొక భూతము తన మాయాజాలముచే తెచ్చి యిందుచేర్చినది. తరువాత నా దయ్యంబీ యరుణగిరి రాజుననియు, తన కిరువురు కుమారులుండిరనియు, వారిపుడు పినతల్లియింట హిమాలయప్రాంతమున నుండిరనియు వారికి నరకాంతల బెండిలిసేయ నెంచి మమ్ము గొనివచ్చితిననియు దెలిపినాడు.

న్యాయమునకు మా కిందే కొరంతయు లేదు. నిజమునకు మన రాజ్యంబులలో నైనను యింత సౌఖ్యము లేదు. మణిమయ వస్తువాహన వస్త్రసౌధవనంబుల మాటలటుంచుము— మృదుమధుర పదార్థంబులమాటలటుంచుము. ఇయ్యది సాక్షాత్ స్వర్గపురంబుకంటెను మనోహరమై యున్నది. ఇచ్చట కొందరంగనలు మాకు పన్నీట స్నానంబులు సిద్ధము సేయుదురు,—కొందరు తలలు దువ్వుదురు—కొంద రన్నివిధములయిన

సేవకాధర్మమును లాచరించుచుందుము. మాకెందు నృత్యంబులు సేయు
వారు—పాటలు పాడువారు గాని కొరతలేదు.

అయిన నేమి ప్రయోజనము ! ఇదియంతయు మన ప్రపంచము
గాదు. మన భావకాదు. మావారందరు శోకపోకలులేని యీ భోగ
ములు మాకేల ? భానుమంతా మమ్ము నీ దయ్యాల కొంపనుండి వెలువ
లకు చేర్చి మమ్ము భార్యలగ స్వీకరింపుమని ప్రార్థించిరి.

మాయాభానుమంతు డంత దయ్యంబుల పెద్దనుపిలువగ నతండు
వచ్చి "యేమియాజ్ఞ" నిలువంబడగ సౌదామిని "ఓయీ ! యీ
కన్నియలతోగూడ నన్ను — రాజమందిరమునకు జేర్పుమనెను. ఆ ప్రేత
నాథుండును బ్రేతుసజీవ్రుడా చూచుకొంచు వారిముగ్గురి నవలీల నీలధ్వజ
మహారాజులవారి కోటలో విడిచి యదృశ్యుండయ్యెను. పురుష వేషధారి
భువనమోహినీ కల్యాణులను తన మందిరమునుంచి, వారికి వలయు
సౌకర్యంబుల గల్పించెను.

మరునాడు భానుమంతుడు యథావిధిగ రాజకొల్వున కేతెంచి
ప్రేతలోక సంచారంబును, అందలి విషయంబులన్నియు వరుసగ దెల్పి
తానందుండి తెచ్చిన వెయ్యిరత్నంబులు ప్రభువులవారి దోసిటబోసి భక్తి
వినయంబుల నిలువంబడెను.

నీలధ్వజుం డంతకు ముందు చూచిన రత్నములకంటె నీ రత్నంబు
లెంతయో ప్రకాశవంతమును కలిగియుండుటచే నాశ్చర్యమును కలిగించెను
అంత నాతం డుత్సాహంబుతో "భానుమంతా ! నీవు మా రాజ్యంబున
చేరి మాసమున కొకమారు మా ప్రజలకు జరుగుచున్న ప్రమాదంబును
మాన్పితివి. ప్రేతభూతపిశాచముల జయించి వారి లోకంబున విజయంబు
నందితివి. మానవాధీశుల కలభ్యంబైన యమూల్య రత్నంబుల వెయ్యి
న్నొక్కటి గడించితివి. నీ యుపకారమునకు ప్రత్యుపకారంబుగ నా
యిరువురు కుమార్తెల నీకు భార్యలగ నొసంగుచున్నాను. నీవు వాంఛించి
యుందువేని సత్యాలయాధిపుని కుమార్తెలనుగూడ పాణిగ్రహణ మందు
టకు మా యభ్యంతర మేమియులేదు. నా కోరిక ప్రకారము నాకల్లుడవై
ముందింక చంపకపురంబును బాలించుకొమ్మనెను.

అందులకు సౌదామిని "రాజా ! మీ కోరిక నేను నిరసింపను.
కాని నేను మాత్రిమెందరి కంఠంబునను మాంగల్య ధారణచేయను. వారు
నలువురు భానుమంతుని భార్యలమని నా కత్తికి బాసికముగట్టి వివాహ

మాడుదురేని నా కభ్యంతరమేమియునులేదు. మరియు వివాహమయిన నారు మాసంబులవరకు అన్నదానము చేయించవలయును. వీటికి సమ్మతించి నచో యేలినవారి యిచ్చవచ్చినటు గావింపుడన వారంగీకరించి నలువురు కన్నియలతో వివాహంబుగావించి, నిరతాన్నదానంబును సేయదొడంగిరి.

మాయాభానుమంతుడా నల్వురు భార్యలను తన భవనంబుచేర్చి వధూలలామలారా! అన్నదానము ముగియువరకు మీకు భర్తృసంగమము లభింపదు. ఆకారణము మీకు తొందరలోనే తెలియజేయుదును. కాని యీ విషయంబు నతిగోప్యంబుగ నుంచవలయు ననీ యన వారలంగీకరించిరి.

చంపకపురంబున జరుగుచున్న నిరతాన్నదాన ప్రశంస దేశదేశములకు వ్యాపించినది. నిత్యము నేకులు బీదలువచ్చుచుండిరి. నేను కొంత కాలంబునకు బైరాగులలో కలిసి యిచటు వచ్చితిని. నాకై నిరీక్షించుచున్న సౌదామిని నన్నుచూచి గుర్తించి కంటదడి బెట్టుచుండెను. అందున్న రాజనౌకరులు "ఇదియేమి మహారాజా! ఈ నిరుపేదకై మీరు జాలిపడి దుఃఖించుచున్నారేమి యనిరట. అంత పురుషరూపంబుననున్న సౌదామినియాజ్ఞచే నిరువురు భటులువచ్చి నన్ను లోనికి గొంపోయిరి. నా మలినవస్త్రంబులు దీయించి, తలంటు స్నానంబులు చేయించి, ఉచితాంబర భూషణంబుల నలంకరించి నన్ను రాజాస్థానంబునకుం దెచ్చిరి. నేనును ఇది యేమికారణమాయని వెరగొందుచుంటిని. మరికొంత సేపటిలో నీలధ్వజమహారాజు మంత్రి సామంతాది పరివారంబులతో విచ్చేసిరి. నంద, సునంద, భువనమోహినీ కల్యాణులొకవంక నాసీనులైరి. అపుడా మాయాభానుమంతుడు లేచి సకల జనంబులతో "అయ్యలారా! నేను నిజమైన భానుమంతుడనుగాను. నేనాతని భార్యయగు సౌదామినిని. నేనీ వేషము ధరించుటకుం దగిన కారణంబిదియని మా చరిత్ర నామూలాగ్రముగ దెల్పి—యిట్లు చేసినందుకు మన్నింపుడు. అడుగో నిజమైన గజపుర యువరాజు భానుమంతుడని బల్కెను.

అంత మేమందరము నివ్వెరబోయితిమి. సౌదామిని శక్తిసామర్థ్యంబులగూర్చి పొగడనివారు లేరు. తరువాత నా కన్నియలతో నాకు మరల వైవాహిక మతివైభవముగ జరిగినది. కొంత కాలమందుండి మా నిజ

పురంబునకు రాదలంచి వచ్చుచుంటిమి. అవ్విధంబున గజపురమును సమీపించుచుండ సౌదామిని " నాధా ! మామగారు మనయందలి వైర భావంబును మానిరో, లేదో. తెలియనిదె పోరాదు. మీరిందుండుడు. నేను పురుషవేషమున బోయి; మీ స్నేహితులవోలె నటించి మీతండ్రి గారి యభిప్రాయంబు గొనివచ్చెదనని చెప్పి గుఱ్ఱముమీద గజపురము నకు వచ్చినది.

ఇంతలో నేనును వేటకై పోనెంచి సేవకుల నందుంప మంటిని. నేను తిరిగివచ్చులోపల నా దొంగసన్యాసి వచ్చి భటులనందరిని మోస గించి నా నలుగురు భార్యలగొంపోయెను. మాయాసన్యాసిని వెదుక మేమంపన మన్నిదారుల బోవుచు నాన్నగారినుండి తిరిగివచ్చిన ప్రతాప కుమారి కీవార్త దెలుప నొకని నందుంచితిమి.

సౌదామినియు గజపురంబు చేరుసమయంబున మా తండ్రిమీద శత్రువులు యుద్ధంబుసేయుచుంటచే తనకు తానై రిపుసేనల పారద్రోలి శత్రుంజయుని ప్రేమాభిమానంబుల గడించి యా విజయ వార్తతో మమ్మింటికి గొంపోవ సమితోత్సాహమున విడిది చోటునకు రాగ మేమెవరము కానరాకుంటిమి. అందున్న మా సేవకుడా వీరనారి కీముని చేసిన దుండగమంతయు వివరింప నాకొమ్మ నానావిధంబుల చింతిల్లినది.

తరువాత సౌదామిని బయలుదేరినది భయంకరమార్గము. క్రూర మృగంబులకు నియంబైన యరణ్యంబు. పగటివేళయు నొంటరిగ నందెవరు ప్రయాణముసేయరు. మనను చీకాకులో నాపెద్దభార్య యావంకకే పోయినది. ఇంతలో సూర్యాస్తమానమైనది. అటువంటిచోట నామె కేమియుతోచలేదు. ఆనాడు పౌర్ణమి వెన్నెలకాయుచున్నది. ప్రక్కనున్న కాలువలో దాహంబుపుచ్చుకొని సౌదామిని యొక విశాలమయిన శిలపై శయనించి మేమనుభవించుచున్న పాట్లను గురించి విచారించుచున్నది.

ఆ సమయంబున సౌదామినికి యెందుండియో మనుష్యుల మాటల వలెను శోకమువలెను వినవచ్చుటచే దిగ్గునలేచి కూరుచున్నది. తన యనుమానము నిజమెకాని; బహుశా యిది పిశాచంబు లుండుచోటువలె నున్నది. మాయాజాలమేమోనని సందేహించియు, అయిన కానిమ్ము. ఇంతకంటెవచ్చునదేమున్నదని ధైర్యంబున నారోదనంబు వినవచ్చు చోటుకుం బోయినది. అవ్విధంబున కడుంగడు దవ్వులకేగ నందొకచెట్టు

పొదలుండెను. ఆ పొదలలోనుండి వినవచ్చుచున్న వ్యస్పష్టమయిన మాట లాలించగ నంతయు బోధపడినది.

ఔరా! నాసవత్నులయిన రాచకన్నియ లిందున్నారా? ఆ ఛండాల సన్యాసి వారిని బలాత్కరించుచున్నాడు. నేనింక నాలస్యము చేసినచో వారిగతి యేమగునోనని లోనికింబోవు ద్వారమునకై వెదికినది. కొంతసేపటికి తానొక లోయనుండి పోవుచుండ కొంత వెలుగు గన్పట్టెను. మాటలును మరింత బిగ్గరగ వినవచ్చెను. సౌదామిని ధైర్యంబున లోనికింబోయి ధ్వనులబట్టి నాలుగు మూలల పరికించుచు చివరకొకచోట కొయ్యలచే మంటచేయబడిన గొప్ప వెలుతురులో తనసవతుల నల్వురను దొంగసన్యాసిని గాంచెను. వారు నలువురగుటచే నంతవరకు వానికి లోబడక శీలంబునిల్పుకోగలిగిరి కాని, నిస్సహాయయగు నొక స్త్రీయైనచో భంగమైపొయ్యెడిది.

పురుషవేషములోనున్న సౌదామిని "ఓరీ దురాత్మా! నిలువు"మని గంభీరముగ బలికి చేతనున్న ఖడ్గంబును పైకెత్తి నరుకబోగా వాడాదెబ్బ తప్పుకొని మంత్రించిన విభూతియుండుచోటి కేతెంచెను. సౌదామినియు నొక్కుమ్మడి దుమికి వాని ప్రయత్నమువిఫలముచేసి తా నా విభూతి చేత గొని చూచుచుండ నా సన్యాసి యెటుబోయెనో కనుపించదయ్యె. వారు దుష్టుని బట్టుకొంటకు వెతికిరి కాని లాభము లేకపోయెను. అప్పుడు నల్వురు రాకుమార్తెలు సౌదామినినిచేరి "అక్కా! ఈ మాయావిబూది చల్లియే యీ క్రూరుండు మమ్మిటకుచేర్చినాడు. ఈ మంత్ర భస్మము మరల వాడిచేతికి దొరకకపోవుటచే మనము ధన్యుల"మనుకొనిరి. ఇంతలో తెలవారినది. వా రా భయంకరమయిన గుహనుండి బైటపడి యించుక నలసట దీర్చుకొంటకై నొక పర్వతపు శిలపై కూరుచుండిరి.

నేనును వారిని వెదికికొనుచు దైవానుకూలంబున వారలవద్దకే వచ్చితిని. అంత మేమందర మన్నివిషయంబులు చెప్పుకొని నేరుగ గజపురంబునకుపోయితిమి. నేను పురంబు వీడిన పిమ్మట నాకై చింతించుచున్న మాతండ్రిగారెంతయు నన్నాదరముతో చూచెను. సౌదామిని యింకను పురుషవేషమును దీయలేదు. అపుడు మానాన్నగారు "కుమారా! నీ స్నేహితుడట, యీ బాలుడు నాకు మహోపకారి"యని యుద్ధంబున తనకుచేసిన మేలునుగూర్చి చెప్పి "సరికాని నీ భార్య సౌదామిని యేది? నాటనుండి మీ రెందుంటిరి మీ విషయంబు లే"మని ప్రశ్నించిరి.

అప్పుడు నేనును జరిగిన కథ నంతయుఁ జెప్పి మా పెద్ద కోడలు సౌదామినియే పురుషవేషమున మీకు సహాయముచేసిన మిత్రుఁడని చెప్పితిని. ఇంతలో సౌదామినియు పురుషవేషము విడిచి సౌదామినియై మామగారికి నమస్కరించెను. పిదప తక్కిన కోడండ్రును నేనును మా తండ్రిగారి కభివందనములు చేసి దీవింపఁబడితిమి.

పిమ్మట నొక దేశ మహారాష్ట్రమున శత్రుంజయ మహారాజు నాకు పట్టముఁగట్టెను. కాన్పుర సన్యాసియును వారు కనుపించినచో పట్టిదీయించుడని రాజశాసనంబు చేయించితిని. సుధాకరా! ఆ దొంగసన్యాసియే మార్తాండపురమున చింతామణికి నుపాధ్యాయుఁడైనవాఁడు. నీవు తప్పక జపాపురంబునుండి యిచ్చటకు రావలయును. నిర్భయముగ నేను శాంతించుచున్నాను. లేదేని సౌదామినితో నేనిదేపోయి వానిని సంహరించి యుందును. ఆ పాపి వృత్తాంతము సంబంధించిన వీరనారియే మా సౌదామిని. సౌదామిని మరణించెనో యా నీచుండు మరలవచ్చి తక్కిన రాకుమార్తెలను మోసగించునని తెలిపెను.

అంత సుధాకరు డానందమునొంది "భానుమంతభూపాలా! మీ యుపకారంబున రెండవప్రశ్నయు తెలిసినది. నాకు జపాపురంబునకు మార్గంబు చెప్పెదవేని నేనాపనిని సాధించుకొనివత్తు"నన భానుమంతుడు "అయ్యా! సముద్రంబున నీవు చనలేవు. ఓడపై నిన్నచటకు చేర్చెదనని వలయు సన్నాహమంతయు చేసెను. కాని దురదృష్టంబున నాయోడ నీటమునిగిపోయినది. సుధాకరుండెట్లో దీర్ఘాయువుగలవాడు కాన, నీటి యొడ్డుకు చేరెను. అచట బట్టలు పిండి యారవైచుకొని, మరల ధరించి జపాపురంబునకై పయనంబు సాగించెను.



## జపాపురము

అది ప్రాతఃకాలము. ఎవరో భటులు యొక యువకుని నిదురనుండి మేల్కొలిపి మహారాజులవారి సన్నిధికిం గొంపోయి "ప్రభూ! మేమంతయు జాగ్రత్తగనే కావలియుంటిమి. కాని, యితండెవ్వడో మాయాచిత్రంబుగవచ్చి తోటలో మందిరంబున నొక శిలావేదికపై నిద్రించు చున్నాడు. మనిషిచూడ నుత్తముడని దలంచుచున్నాము కాని, చర్యనుబట్టి సందేహించి దేవరవారికి నప్పగించితి"మని వెడలిపోయిరి.

కీర్తి :— ఓరీ! మాయావీ! ఎవరవునీవు?

సుధా :— నేను మాయావిని కాను. మాయలో చిక్కుబడి మర్మము తెలిసికొనజాలకున్న మనుష్యుఁడ నగుదును. మాది కాంచన పురము. ప్రభాకర మహీపాలకుమారుఁడను. సుధాకరుఁడను.

కీర్తి :— నీ ముఖవైఖరిఁ జూచి నిజముగ రాకుమారుఁడవని నిన్ను గౌరవించుచున్నాను. ఈ యుచితాసనంబున గూర్చుండి నీచరిత్రనంతయు దెలుపుము.

అందులకు సుధాకరుండు కీర్తిపాలునితో "భూపాలా!" యని తన చరిత్రనంతయు వివరింప నారాజయు వింతచెంది "సుధాకరా! నీ మాటలు కడువిచిత్రముగనున్నవి. ఆ సన్యాసి యొసంగిన ప్రశ్నలలో నీకు తెలియని దేమియో చెప్పు"మనెను. సుధాకరుండు "మహారాజా! ఆసన్యాసి కపటముచేతను, చింతామణి పట్టుదలచేతను చనిపోయిన తొమ్మిదివందల తొమ్మిదిమందిలో మా యన్న లార్వురు నుండుటచే నా దురాత్ముల గుట్టును రట్టుచేయదలంచి మీ సహాయమునకై వచ్చితినిగాని; వేరుగాదు. మీరు నాయందేమాత్రమును కోపము పూనక నాకు సహాయ్యము చేయవలయునని కోరుచున్నాను.

కీర్తి :— మిత్రమా! నీ వా ప్రశ్నను దెలుపుట కింత భీతిలుచుంటి వేమి? నీ కేమియు నపకారము గలుగనీయను దెల్పుము.

సుధా :— మహారాజా! నా భయమునకు కారణము లేకపోలేదు. సన్యాసి మొదటి ప్రశ్నకు భోగపురంబున వసంతసేన మహారాజువలన సమాధానము బడసితిని. రెండవ ప్రశ్నకు గజపురంబున భానుమంత మహారాజువలన సమాధానము బడసితిని. మూడవ ప్రశ్నకు మీవలన సమాధానము నెఱుంగవలయునని వచ్చుచుండ సముద్రములో పెనుగాలిచే నేను వచ్చుచున్న యోడ పగిలిపోయినది. అంత నాజలభాగంబు నెట్లో యీది భూమినిచేరి, కొంతదూరము నడిచి ప్రయాణ బడలికచే నొక యుద్యానమున గాఢనిదుర చెందుచుంటిని.

అయ్యది మీసామంతరాజగు సుబుద్ధి పరిపాలించు నిత్యానంద పురమట. ఆ రాజుగారి కుమారి మంజువాణి తన నెచ్చెలులతోడ వచ్చి నన్ను నిద్దుర లేపి రాజకుమారి విలాసవనంబున నీవు పురుషుండవై యేల నిర్భీతిగ నిద్రించుచుంటివని ప్రశ్నించినది. అంత నేను అమ్మా! తెలియు

వచ్చిన పరదేశవాసినని లేచిపోయితిని. కాని నన్నాకన్నియ పోనీయక నాయూరుపేరుల విచారించి, నాయందమితానురాగమును చూపి తన్ను వివాహమాడవలయునని మిక్కిలి ప్రార్థించినది. ఆమె సౌందర్యమునకు నేనును భ్రాంతిపడినమాట యదార్థము. అయినను కాంతా! నేను జపాపురమునకుబోయి తిరిగి వచ్చునపుడు నీ తండ్రినిం గదిసి మాటలాడి వివాహమాడెదనంటిని. అంతమాటల సందర్భములో మంజువాణియె జపాపురమచ్చటి కొకయామడ దూరముండునని దెలిపినది. మరియు నాకు తాత్పర్యము కావలసిన ప్రశ్న యేదియో వినవలయునని బలవంతము చేయుటచే నదియు వచించితిని.

కీర్తివర్ధనమహీపాలా! మంజువాణి నా ప్రశ్నవినగానే మండిపడుచు "ఛీ! దుష్టుడా! ఇంత దనుక నీవేమో యోగ్యుండనుకొంటినే" యని నన్ను విశేషంబుగ నిందించుచు భటులరావించి నన్నొక కారాగారంబున బంధించినది. అంతవరకు నాయందున్న ప్రేమ యేమయినదో చెప్పజాలను. నే నెన్నివిధంబుల ప్రార్థేయపడినను తుదకు నామాట లాలకించినవారును లేరైరి. నేనా కారాగారములో వారమురోజులు జరిపితిని.

ఒకనాడు నాకొకచోట కొద్ది వెలుగు కనుపించినది. దగ్గరకు బోయి చూతునుగదా! అదియొక కంత. దానికి మూసియున్న తలుపు యేనాటిదోగాని బలములేక బాగిలిపోయియుండుటచే దాని నూడబెరికితిని. మనిషిదూరుట కనువైనంతగ నున్న యారంధ్రమునుండి పారిపోవుటకై చూచితిని. అది భయంకరమయిన సముద్రము. కానిమ్ము. దైవము కరుణించినచో నేనెన్నిమారులు సముద్రమునుండి బైటపడలేదు!" అనుకొని అందు దుమికితిని. నీటబడినతోడనే నాకొక పెద్ద చేపయొక్కతోక నా చేతికి చిక్కినది కాబోలు. అదియు భయంబున యొడ్డువకుం బరువెత్తి నన్నొక్కవిసరున భూమిపై బడవేసినది.

కొంతకాలమునకు నేను తెప్పరిల్లి, మరల ప్రయాణముచేయ సంకల్పించుకొంటిని. ఇంతలో కొందరు బాటసారు లెదురైనందున వారినడిగి యామడదూరములోనికివచ్చిన నేను మరల యెనిమిదామడల దూరము వెనుకకు పోయితినని తెలిసికొంటిని. అంతకును పట్టుదల విడవక వారిచే మీ యుదారమును, కీర్తియు, మంచితనమును విన్నవాడనగుటచే యిచటకు రాయత్నము నేను మానుకొనలేదు.

మరల నేను మీ సామంతరాజ్యమగు ధనాగారమువద్దకు వచ్చితిని. అందా రాజకుమారియగు మనోహారియు తన చెలియలందరితోడను వచ్చి నన్ను గౌరవించెను. తరువాత మంజువాణితో నా ప్రశ్నభావంబును విని, పళ్లు పటపట గొరుకుచు రాజభటులచే నన్నొక నీటికాలువయందు బడద్రోయించినది. వారిని నే నెంతయు నిర్బోధించిననివేడుకొంటిని కాని, సేవకులు రాకుమారి యనుజ్ఞను నిరసించి నన్ను కాపాడరుగదా; నన్ను నిర్దయతో నీటిజాలునందు వైచిరి.

అప్పటికే నేను స్పృహతప్పి యుండుటచే నా కాలువననపోయి సముద్రములోచేరితిని. అందును అలలు నన్ను కొట్టుకొనిపోయి యొక కొండరాలలో పడవైచినవి. కొంతతడవున కేను తెలివిగాంచు నప్పటికి యొక మహాసముద్రింబున జిక్కువడితిని. అంత నా కేమియు దారితోచలేదు. ఇక గత్యంతరములేక నేనాకొండ నలుమూలలు ద్రిమ్మరుచు నొక బిలమును గాంచి, అందే మైన వసతియోగ మున్నదేమోనని లోపలకు నడచితిని. పోను పోను నదియొక దేవతలు నివసించు చోటువలెనుండు రమ్యప్రదేశముగ కనుపట్టెను. మరికొంతనడువ నందొక దివ్యభవనంబును, ఆ భవనంబందొక సుందరిని చూడగలిగితిని.

ఆమెయు నన్నాదరింప నాదీనచరిత్రయంతయు దెలిపి "అమ్మా! యిట్టి నిగూఢప్రదేశంబున నొంటరిగ నుండ నేల"యని యడుగ నామెయు "సుధాకరా! నాభర్త యక్షుడు. నేను వాని భార్యను. నాపేరు రంజని. నాసవతికిని నాకును సరిపడకపోవుటచే వేరుగ నన్నిందుంచి నాభర్త నావద్ద నారుమాసంబులు, నాసవతికడ నారుమాసంబులు నుండును. ఆయనగారు నావద్దనుండిపోయి నేటి కొకమాసమె గడిచినది. అయినను మాకు భయముండదు. నీవేమియు చింతింపక నేటికి హాయిగ నరుండుము. రేపు నిన్ను జపాపురంబునకు నేను చేర్చెదనని నాకు ధైర్యంబు చెప్పెను. మరియు నాకు మృష్టభోజనంబు లొసంగి ప్రత్యేక గదియందు మృదుతల్పము నొసంగ హాయిగ నిదురించితిని. మహీపాలా! తరువాత నేమి జరిగినదో నాకు తెలియదు. తెల్లవారగ నెవరో నన్ను బలవంతముగ నిద్దుర లేపుచున్నటులుదోచి లేచి కూరుచుంటినిగదా! రాత్రి శయనించిన మందిరముకాదు. అంతయు క్రొత్త. మీ యుద్యానవనంబున నుంటినని దెలెను.

ఆ మాటలకు కీర్తివర్ధనుడు "ఇంకేమి రజనీ మాయచే వచ్చియుండువుగాని సుధాకరా! భయములేదు చెప్పుము. మంజువాణి మనోహరులవలె నన్ను బాధింపక ఆ ప్రశ్నవిధానమేదియో యెరుంగ బలికిన నీకు సహాయ్యము చేతునన సుధాకరుండు—

"సన్యాసి కనురాగవతియైన సుందరియును; పగతుడైనట్టి కీర్తివర్ధనుండును సజీవులా? విగతజీవులా? కీర్తివర్ధనుడే విధంబుగ సంచరించుచున్నాడు? సుందరి యెట్లులున్నది?"

ఆమాట వినినతోడనే "ఏమీ? ఆ వంచకనీచుడు ఇంకను బ్రతికియున్నాడా? మార్తాండపురంబును మోసగించుటకై యందు చేరియుండెనుకాబోలు. సుధాకరా! రమ్ము. ఇప్పుడేపోయి యా రాజవంచకుని — దొంగసన్యాసిని ముక్కలుముక్కలుగ తెగవేయుదము." అని బలికెను.

సుధాకరుండేమి మాటలాడలేదు. కొలువు చాలించిన పిమ్మట సుధాకర కీర్తివర్ధనులు రాజనందనంబునకుం జని సింహాసనంబుల కూరుచుండిరి. పిదప రాజాజ్ఞచే కొందరొక యువతిని యినుపగొలుసులచే బంధించుకొని కారాగారంబునకు బట్టుకొనివచ్చిరి. మరియొకడు కొరడాలను దెచ్చియిచ్చిరి. వెంటనే కీర్తివర్ధనుండు లేచి కొరడాను చేగొని, సంకెలలోనున్న యువతి యెంత విలపించినను జాలియనునది లేక కొట్టసాగెను. సుధాకరున కదిగాంచ నెంతయు వింతజనించెను. ఏమీ! యెవ్వరినోటను విన్నను జనాపురపాలుండతి దయాంతరంగుడని పొగడుచుండిరే! ఈ మహారాజొక యాడుదాని నింత కఠినముగ బాధించుచున్నాడేమి? దీని కేదియో గొప్ప కారణముండియుండును. లేకున్న నిందరు మంత్రులు, సామంతులు, భటులు మున్నగువారుండియు నొక్కరును "పాప"మనలేదు. ఈ సమయంబున నేనును మాటలాడరాదనుకొని మిన్నకుండెను.

తరువాత కీర్తివర్ధనుడు రేపే మనము మార్తాండ పురమునకు ప్రయాణమని కాంచనపుర యువరాజుతో వచించుచు, భోజనంబులు గావించిన పిమ్మట శయన మందిరంబున నాతండు "అయ్యా! సుధాకరా! ఆసన్యాసిపై నాకంతటి ద్వేష ముదయించుటకు కారణంబైన నీ మూడవ ప్రశ్నకు సమాధాన మాలకింపు"మని యిట్లు చెప్పదొడంగెను.

---

# సన్యాసి మూడవ ప్రశ్న

మిత్రమా! సుధాకరా! నేనీ జపాపురపు సార్వభౌముడననియు, నా పేరు కీర్తివర్ధనుండనియు నీ వెరింగినదేగదా. యిక వినుము.

ఈ ఖైదులో బంధింపబడి నాచే దండింపబడిన యింతియే నా భార్య. నేను తొలుత నా సతీమణియగు సుందరియందు నాకు మమకారము మెండు. దాని పేరు సుందరి. సుందరి సార్థకనామము చెందిన సుందరీమణియె. నేను దారామోహాంబున నన్యకాంతల నేనియుం దలంచను వాడనుగాను. నా భార్యయు నాయందునట్టి వ్యామోహాంబున బ్రవర్తించుచున్నదని నమ్మియుంటిని.

ఇటులుండ నొకనాడు సుందరి నన్నుజేరి "నాథా! మనము విలాసంబుగ సరససల్లాపములాడుకొనుట కొక మనోహర వనంబును నాటించి, అందు నొక దివ్యభవనంబు గట్టించెదరేని మనమందు మరింత సంతోషంబున చరింతుమని దలంచుచున్నాను. నా యీ కోర్కె దీర్పరా" యని వాంఛించినది. నేనును సుందరి కోరినదే తడవుగ దాని యభిమతం బీడేర్చు వాడనుగాన "ప్రియసీ! నీవు కోరుటయు, నేను కాదనుటయునా?" యని వెంటనే మహారాణి యభిలాషదీర్ప నెంచితిని. అపుడు నేను నాటించిన యారివెలుపల వనంబునందొక దివ్యభవనంబును గట్టించితిని. అందలి మణులకాంతి—సౌధభాగంబుల పవిత్రత—చలువరాల నునుపు—శిల్పంబుల జీవకళ మున్నగు యమూల్యదృశ్యములె గాక నావనంబున సమస్త పుష్పఫలవృక్షంబులతో పూర్తిగావించితిని. మేమందర మందు వినోదకేళికలతో దేలుచుండెడివారము.

మరికొంతకాలమునకు నేను వేటకతంబునబోయి నవ్వనంబునుండి వారము దినములవరకు యింటికి రాలేకపోయితిని. ఆ సమయంబునను సుందరి తన చెలియలతో ఆయానందవనంబున విహరించుచుండిరి. అందు సుందరి తన పరిచారికలను వివిధపుష్ప సమూహముల గొనిరమ్మని తానొక పూలపందిట గూర్చుండియుండ నొక సన్యాసి వచ్చి సుందరి కభిముఖంబుగ నిలుచుండెను. ఆతండు యవ్వనప్రాయుడు—సౌందర్యుడు నయిన సన్యాసి యగుటచే తొలుత నాతనితో సుందరి చాల కాలము మరియాదగ మాటలాడెను.

తుదకు వాడు సుందరీ సంపర్కము నభిలషించినట్లు గమనించుటచే పట్టమహిషి వానిననేక రకముల మందలించినది—నిందించినది. కాని వాడు దాని పాదంబులఁబడి ప్రతిమాలుచు మోహాంధకారుని కుపయోగంబులయిన నీతుల నుపదేశించెను. చివరకు సహింపరాని కోపముచే నామె యామాయావిని తన పాదంబుచే తన్ని పోబోవవాడు నగవుచు తన్నిన పాదంబులను గట్టిగపట్టుకొని నాకోర్కె చెల్లింపవేని నీ పాదంబుల విడువననియెను. అంతసుందరి సరే. నీ కోర్కెను దీర్చెదలెమ్మనగ నతండు లేచెను.

అవ్విధంబున తన్ను గాఢముగ ప్రేమించిన వానిం చూచి సుందరి "ఓ వలపులవన్నెకాడా! నేడు ప్రొద్దుపోయినది. నా చెలులింకవత్తురు. రేపీపాటికి యిందేవత్తువేని నేను నా చెలియల కేదియో పనికల్పించి వంటరిగ నీకై యుందునని నచ్చచెప్పి యారోజు తన మందిరమునకు పోయినది. వీరిట్లు జరుపుచున్న విరహబాధా విధానమంతయు నొక చేటి చాటుననుండి గాంచెను.

మరునాడు సుందరి మరల నుద్యానంబునకు విలాసముగ నేతెంచినది. కాని, ఆమెలో చాలా మార్పు లేర్పడినవి. దాసీ లందరిని నిష్కారణమయిన పనులతో బయటకంపినది. కాని లోగడ దాని నాటకమెరింగిన దాసి కీ సుందరి భావము తెలిసియుండుటచే దాని నా పాపంపుపని సేయకుండ చూడవలయునని యత్నించినది. కాని దాసీ ముండ మహారాణిగారి నే మనగలదు? విధిలేక నదియు మిగిలిన చెలులతో చేరి తమలో తాము మదనపడుచుండ నేను వేటనుండి తిరిగివచ్చి వారిచెంతనే గుఱ్ఱముదిగి "సుందరి యెక్కడ" యని మామూలుగ నాకుండు మోహాంబుచే నడిగితిని.

నన్నుచూడగనే యంతఃపురాంగనలు గ డ గ డ వణకసాగిరి. నేనంత వారిభయంబునకు కారణమేమని యడుగ వారీ యుదంతమంతయు నాకు చెప్పిరి. ముందు నా చెవులను నేను నమ్మలేక పోయినాను. వెంటనే నేను వారున్న పూపొదరింటి ప్రక్కకుపోయి నిలిచి లోపలకు చూచితిని. అపుడు మరల నా కనులను నేను నమ్మలేక పోయితిని.

సుధాకరా! నాభార్యయట్టి యమానుషమైన క్రియకు సాహసించి నపుడు నే నెంతని సహింపగలను. కేవలము దాని భర్తనైనను భార్య

విటునితో ననుభవించు రతిక్రీడలు – మధురభావములువర్ణింపజాలనని వేరుగా చెప్పవలయునా ?

నే నంత ఖడ్గంబుదూసి "ఓసీ ! కులటా! "యని కేకవైవ వారిద్దరు దద్దరిల్లిలేచి నను చూచిరి. సుందరి పొదరింటి వాకిట నిలుచుండి యెంత వరకును బైటకురాదయ్యె. ఇంతలో సన్యాసి వెనుకవాకు వెనుకనే పొదలలో దారిచేసుకొని, చెట్లచాటున నక్కుచు నక్కుచుబోయి యొక వృక్షంబునెక్కి దాని కొమ్మల సహాయముతో కోట ప్రహరీదాటి పలాయనమైనాడు. నేటికని కనుపించలేదు.

తరువాత సుందరి తనతప్పు నొప్పుకొనక బొంకినది – శోకరించినది కాని కన్నులతో చూచిన దానిని నేనెట్లు కాదందును? ఇపు డీపతి ద్రోహి యెంతవేడినను నాకు జాలి యనునది కలుగలేదు. సుధాకరా! వే యేల ? నాకంతటి ద్రోహము గావించిన నీచుడే మార్తాండపురమున నున్న సన్యాసి. మరికొంతకాలము మన మూరకున్నచో నాదుర్మార్గుడు మరల నెవరి కే యపకారముచేయునో రేపే మనము ప్రయాణము గావింపవలయుననెను.

అందులకు సుధాకరుడు "మహారాజా! మనము నేరుగ మార్తాండ పురమునకు బోవుట కాదు. గజపురమునకు బోయి భానుమంత మహారాజును, భోగపురమునకుబోయి వసంతసేన మహారాజును కలుపు కొని పోవలయును. మరియు నొక మహారణ్యంబున నొక తపస్వికడ నాగుఱ్ఱంబును విడిచి వచ్చితిని. ఆ మునికి నమస్కరించి యీ విజయ వార్తయుదెలిపి, తురంగమును గైకొని పోవలయును. ఇంకను మనము దర్శించి సేవింపవలసిన కాళికాలయంబు జయంతీపురమునగలదు. మీ రే మందు"రనియెను.

ఆ మాటలకు మందహాసముచేసి "సుధాకరా! నీ మాటలకు నేను కాదనను. కాని మరియొక మాటనుచున్నాను. దారిలో నీవలన ప్రశ్న భావము విని నిన్నాపదలపాలుచేసిన వారెవరో నీకు తెలియునా ? అందు మంజువాణి నామేనగోడలు—మనోహరి నాపినతల్లి మనుమరాలు వారిద్దరు నాకు దగ్గరి వారగుటచే సుందరీ సన్యాసుల ఘోరావచారము వారికి తెలియును. కావున నిన్నిట్లు వేధించిరికాని వేరుకాదు. వారిని గూడా నీవు భార్యలుగ స్వీకరింపవలయునన సుధాకరుండు చిరునగవు నగియెను. పిమ్మట నిరువురు నిదురించిరి.

# దిగ్విజయము

అది మార్తాండపురము. ధర్మశీలమహారాజు సభనుండెను. ఆ సమయంబున చింతామణి వివాహమునుగూర్చి యాలోచించుచు రాజుగారు మంత్రివరా! చింతామణి యీ వ్రతముబట్టి సంవత్సరమయినది. సన్యాసి ప్రశ్నలు ఛేదించువారును, నా పుత్రికను వివాహమాడువారును, మార్తాండపుర సింహాసనమెక్కువారును వారె. పాపముకందియును జయంతుడు దాని చేతిలో హతమయ్యెగదా! నేటికి తొమ్మిదివందల తొమ్మిదిమంది మరణించిరి. అదియునుంగాక కాంచననగరాధిపుని చిన్న కుమారుడైన సుధాకరుండు రహస్యము ఛేదింప నేగి పోయినాడట. ఇంతవరకును రాడాయెననుచుండ నొకభటుడు లోపలకువచ్చి "ప్రభూ! దేవర దర్శనార్థ మెవరో రాకుమారులు వచ్చి"రని తెలిపెను.

ధర్మశీలుండు భటునిచూచి "త్వరగగొనిరమ్ము"ని పంపిన తరువాత మంత్రినిచూచి "యమాత్యశేఖరా! నా దక్షిణనేత్రము చాల వడిగ నదరుచున్నది. వీరి రాకవలన నా కేమయిన శుభంబగునా యనుచుండ సుధాకర, వసంతసేన, భానుమంత, కీర్తివర్ధన మహారాజు లరుదెంచిరి. ధర్మశీలుం డందరికిని తగిన మరియాదలుచేసి కూర్చుండబెట్టెను.

పిమ్మట ధర్మపాలుండు వారిరాకకుం గారణ మారయ వారు "చింతామణి ప్రశ్నలకు సమాధానమునీయ వచ్చితిమ"నిరి. ఆ మాట వినగ మార్తాండపురాధీశ్వరుండు తెల్లబోయి చూచుచుండెను. సుధాకరుడు వెంటనే "మహారాజా! భయమందకుడు. ఆరుమాసములు ప్రాణాపాయ ఘట్టంబులగడచి, పర్వతసముద్రలోయలపయనించి, మృత్యుముఖంబులనుండి తప్పించుకొని సన్యాసి ప్రశ్నల సమాధానమును సాధించిన నేను కాంచననగరాధిపతి యేడవ కుమారుడను సుధాకరుడను. మూడుప్రశ్నలకు కారకులైన వారే యీ ముగ్గురు మహారాజులు. మరియు నీ వృత్తాంతము మీకు కడమ మనవి చేయుదును. కాని మీరింతకు దైవంబుగ నారాధించుచున్న యా కపటి యెంత క్రూరుడో మీకు తెలియగలదు.

అయినను మీరునాకు కొంతసహాయ మొనరించినచో మీకెంతయు సంతోషంబును గలిగించగలను. సమయము వచ్చువరకు నీ వసంతసేన, భానుమంత, కీర్తివర్ధనమహారాజులకు రహస్యముగ చరించుట

కనుకూలంబులు గలిగించవలయును. మీరు నా వెంటనుండి సన్యాసి ముఖంబున సంభాషించు నా మాటలు న్యాయమయినచో మీరు నాకు నండగ నుండవలయును. పొరపాటుగనైనను యీ మహారాజులపేరు లా కపటముని వినరాదు—వినినచో వాడింక మనకంటబడడు." అని వచించెను.

ధర్మపాలున కామాటలు వినుచుండ కొంత ధైర్యం బుదయించెను. ఇంత దీర్ఘకాలంబునకైనను కుమార్తె వివాహంబు జరుపవచ్చును గదా యని సంతసించి సుధాకరునకు సహాయకారియై మెలంగెదనని వాగ్దానము గావించి వారికిదగు రాజమర్యాదలు చేయించుచుండెను.

సుధాకరుడు పరుగునబోయి గొలుసులాగెను. గంట బిగ్గరగ మ్రోగెను. చింతామణి మున్నగు వారీగంటధ్వనివిని చాలా కాల మయినది. వెంటనే చింతామణి పద్మలతను బిలిచి "గొలుసు లాగిన దెవరో చూడ"మనెను. పద్మలతయు త్వరితముగవచ్చి తెలిసికొని దగిన రాకుమారుని చూచిన తోడనే తొట్రుపడజొచ్చెను.

ఎవరో అనుకున్నాను. నా వాడే —నా సుధాకరుడే! ఆరుమాస ములక్రితము నన్ను నొప్పించి నాసహాయమంది వెళ్ళిన నామనోహరుడె— ప్రశ్నలకు సమాధానంబు గ్రహించివచ్చి యుండును. ఆహా ఇన్నిదినాల నుండి తొమ్మిదివందల తొంబదితొమ్మిదిమంది సాధించలేని కార్యమును సాధించిన ధీశాలియెవరన, నానాథుడేగదా? అయ్యో! దైవమా! నేనిటు లానందించుచున్నాను. నానాథు డొసంగిన యుత్తరములు క్రమమైనవి కావని తల నరకించినచో నాగతి యేమి కావలయునని విచా రించుచు-వానికడకు నడచెను.

యింతలో "పద్మలతా!"

కార్యము సాధించితివిగదా సుధాకరా!

నిశ్చయముగ సాధించినాను. నీ కేమియు భయములేదు.

సుధాకరా! ప్రశ్నలకు బదులుచెప్పినవారినే వివాహమాడుదునన్న వ్రత విధానముగ చింతామణిని వివాహమాడి నన్ను మరచిపోవుగదా!

వెఱ్ఱిపద్మా! అటులుగాదు. నా సమాధానము నా యన్నను బ్రతికించుకొనుటకే — నాకిందు సహాయముచేసిన నీమేలు మరువను.

చింతామణి తన మేనమామ జయంతునకే పెండిలాడగలదు. వారందరను బ్రతికించుటకు భద్రకాళిచే వరమునూ స్వీకరించితిని.

అయిన నిందేమి కావలయును ?

ఇచ్చటిసంగతు లేమయిన నున్నవా ?

లేకేమి ? ఈ సన్యాసి పరమదురాత్ముడు. కామపిశాచి. ధూర్తుడు సమయముచూచి చింతామణిని మానభంగముచేయ యోచించియున్నాడు. ఒంటరిపాటుననున్న నన్నే యొకమారు వంచింప నానాచెరలు పెట్టెను. శీలము చెడరక బైటపడు నాశవీడి నేనాత్మహత్యకై తెగించువేళ దైవ కృపచే బ్రతికితిని. ఈ విషయంబు నేను రాజకుటుంబములో చెప్పినను వారి కాయనమీది గౌరవముచే నొప్పున నమ్మరని నేనును మనసునం దుంచుకొని జాగ్రతగ చరించుచు మీ రాకకై యెదురుచూచుచున్నాను.

అవును వాడంతటివాడే—ఆ విషయంబులు నీకంటె నాకు బాగుగ తెలియును. వాడి బ్రతుకంతయు రేపు బహిరంగముచేయుదును.

రాకుమారా ! ఊరికిబైట కొండలో బిలమున్నది. ఆమూసి యుండు కవాటము మా కోటలోని సారంగమునకు సంబంధించినదియే. మీ రద్దానిని భటుల కాపలాయం దుంచకున్న నీ విశ్వాస ద్రోహి సమయము మించినచో పలాయన మందునేమో.

మంచి విషయమును చెప్పినావు. మరిపోయిరమ్ము.

మరునాడు నిర్ణీతకాలము సమీపించినది. నిన్నటి రాకుమారుడు ప్రశ్నయత్నమును వివరించుటకై గొలుసు లాగినాడు. గత రోజులలో మాదిరిగనే సుధాకరున కాహ్వానము గలిగినది. సుధాకరుడుపోయి భటులు చూపిన స్థలములో నిలుచున్నాడు. చింతామణియు తన ఆసనమును అధిష్ఠించినది.

చింతా:— నీ పేరు ?

సుధా:— చింతామణీ ! ఊరుపేరు లిపుడవసరములేదు. కావలసినది ప్రశ్నలు వాటి సమాధానము. ముందా విషయమునకు రమ్ము.

చింతా :— నా ప్రశ్నలకు సమాధానము చెప్పలేకున్నచో నీవు నా ఖడ్గముచే ఖండింపబడుదువు.

సుధా :— దానికేమి ? అది నీ శాసనము గావచ్చును. కాని చింతామణి ! నీవు ప్రశ్నింతువు—నేను సమాధానమిత్తును. అయినచో

నా సమాధానము సరియైనది కాదనినప్పుడు, సరియైన సమాధానమేమో నీవు చెప్పెదవా ?

చింతా :— అది నాకునూ తెలియదు.

సుధా :— మరెట్లు.

చింతా :— మా గురువుగారు చెప్పెదరు.

సుధా :— వారిందు కానరారేమి ?

చింతా :— వారు రహస్యముగ నుందురు.

సుధా :— చింతామణీ! నీవు స్త్రీవి—అందును చిన్నదానవు. ఇది శాసన విరుద్ధము. మీ గురువుగారును మా సముఖంబున గూర్చుండ వలయును. మీ నాన్నగారు మున్నగు ధర్మప్రభువులందరు మన సమక్షం బున నుండవలయును. నేను చెప్పినది క్రమముగ లేకున్నచో మీ గురువు గారు దానిని సమర్థించిచెప్పి—మధ్యవర్తులు తీర్మానించిన పిమ్మట నా తలను నరుకవలయును. ఏమందువు ?

చింతామణి మాటలాడలేకపోయింది. పద్మలత యిదంతా విని లోలోన సంతోషించెను. సన్యాసి తన డంబము సాగదనుకొన్నాడు. అయితే మాత్రమేమి ! ఈ రాకుమారుడు మాత్రము చెప్పగలడా ? ఇది యొక మేకపోతుగంభీరమని దలంచి, సన్యాసి మహాకోపముతో దూర్వాస మునిలాగా బయటికివచ్చి " ఓయీ ! చేతగానివాడవుచేతగానటులుండక నిది యొక గంభీరమా ? కానిమ్ము. నిన్నూరక నురిదీయించుట కాదు. చిత్రవధచేయింతును. పిలిపింపుము. దేశదేశములలోగల వారి నందరినీ పిలిపింపుము. నాకేమి భయమా" అనెను.

తరువాత ధర్మశీలుడు తగిన పరివారముతోవచ్చి నాసీనుడాయెను. ప్రశ్నకారకులయిన రాజులు మాయావేషములతో నొదిగి తిరుగుచుండిరి. సన్యాసి మున్నగువారు తమ తమ పీఠంబులపై కూరుచుండిరి. సుధాకరుడు "చింతామణీ ! మీ గురువుగారు నన్ను చిత్రవధ చేయించు నంత శ్రమపడకుండగనే యేర్పాటులు జరిగాయి. నీవివాహంబును, నీచెలి పద్మలత వివాహమును సిద్ధమయ్యాయి. అడుగు ప్రశ్నలకుసమాధానాలు యెదురుచూస్తున్నాయి" అన్నాడు. చింతామణి తన ధర్మప్రకారం దటిమొ ప్రశ్నను యీ విధముగా వివరించెను.

మారువేషముతో తమ్ములను రక్షించుకొని, సన్యాసిచేబడిన కోమలీమణిని, మంత్రదండమును గ్రహించి, జటిని పారద్రోలి మరల హత్యగావింపబడియు జీవించిన రాకుమారుడిపుడు సజీవుడా! విగతజీవుడా! వాని నామమేమి ?

సుధా:— చింతామణీ! వినుము.

విక్రముడను మారువేషముతో, నలుబదితొమ్మిదిమంది సోదరుల కాచి, మీ గురువయిన సన్యాసిచే బలాత్కరింపబడుచున్న కనకాంగినీ, మంత్రదండమును గైకొన్న వసంతసేన మహారాజు సుక్షేమముగ భోగ పురమును పాలించుచున్నాడు.

చింతా:— రెండవప్రశ్న వినుము.

మగువవై మగవేషముదాల్చి, మంత్రిగ చరించుచు, నలువురు మగువలచే మమకారమునకు పాత్రురాలై మగనితో పయనించుచు, మాయ సన్యాసిచే కలిగిన మహాపన్నంబునుండి బైటపడిన వీరనారి సజీవియా ? విగతజీవియా ? ఆమె నామమేమి ?

సుధా:— చింతామణీ! వినుము.

తన భర్తదుస్తులతో భానుమంతుడను పేరున నీలధ్వజునివద్ద మంత్రిగనుండి, అతని కూతురులిద్దరు, ప్రేతనాథు లవహరించిన రాకన్నియ లిద్దరిచే ప్రేమింపబడి, భర్తతో గజపురమువచ్చుచు తమకు విపత్తుచే కూర్చిన సన్యాసియగు మీ గురువును మదమడంచిన సౌదామిని హాయిగ తన రాజ్యమందున్నది.

చింతా:— మూడవప్రశ్న వినుము.

సన్యాసి కనురాగవతియైన సుందరియును; పగతుడైనట్టి కీర్తివర్ధను డును సజీవులా! విగతజీవులా! కీర్తివర్ధను డేవిధమున చరించుచున్నాడు! సుందరి యెటులున్నది ?

సుధా:— చింతామణీ! వినుము.

జపాపురమున—వనమున—పూపొదలలో రాణితోనుండి రాజుకంట బడి తప్పించుకవచ్చిన కీర్తివర్ధనుడు మీ గురువును చంప వెదకుచున్నాడు. సుందరికి కారాగారము ప్రాప్తించినది.

ఈ మాటలు వినుచుండ నందరు నిర్ఘాంతపోయిరి. సన్యాసి తన చావుబైటపడినదని తప్పించుకొని పోజూచెను కాని "ఓరీ యెక్కడకు పోయెదవని వసంతసేన, భానుమంత, కీర్తివర్ధనులు మూడు ఖడ్గంబుల నొక్కమారుగ వాని శరీరమున గ్రుచ్చిరి. సన్యాసి మరణించెను.

సుధాకరుడు అంతవరకు కోటకుగట్టిన తలలు తెప్పించి మొండెము లున్న గోతిలో వేయించి "కాళికావరప్రసాదితులారా! లేచిరం"డనగ నందరు రాకుమారులు మరల జీవించి నాకందకము నెక్కివచ్చిరి. ఆ సమ యంబున ఆనందమునందనివారును, సుధాకరుని గౌరవించనివారును లేరు.

తరువాత వాని యభిలాషప్రకారము. పద్మలతా సుధాకరులకును చింతామణీ జయంతుల కతివైభవముగ జరిగిన వివాహములు వర్ణనా తీతములు. మరునాడందరూ వారి వారి చరిత్రంబులను విశదీకరించి ప్రపంచమునకు తెలియచేసిరి.

అటువంటి కష్టంబులనుండి అందరు సలక్షణముగ సర్వాభీష్టంబుల బడసినందులకు శ్రీకాళికాదేవికి నమస్కరించి యెచటి వారచటకేగిరి.

—మంగళం—

# సకల దేవతలు వశీకరణమగు మలయాళ మంత్ర రహస్యములు

మంత్రశాస్త్రమునకు సంబంధించిన గ్రంథములు తెలుగు భాషలో చాల తక్కువగ యున్నవి. ఇట్టి గ్రంథము యిదివరలో వెలువడి యుండలేదనియే చెప్పవలసి యున్నది. ఇది మాంత్రికులకే గాక ప్రతివారికిని ముఖ్య అవసరమైన గ్రంథము. ఇందు ప్రతి మంత్రమునకును యంత్రమును తయారుచేయు విధానమును, యా యంత్రమును ఉపయోగించు విధానమును వివరముగ తెలుపబడెను.

గణపతి మంత్రము, సుబ్రహ్మణ్య మంత్రము, మహాలక్ష్మి మంత్రము, బాల త్రిపుర సుందరీ మంత్రము, ఆంజనేయము, నారసింహము, యక్షిణీ, కర్ణపిశాచి, దేవదత్త వశీకరణము, ధనవశీకరణము, భార్యాభర్తల వశీకరణము, తేలు మంత్రము, విభూతి తయారుచేయు మంత్రము, దృష్టిదోష నివారణ యంత్రము, బాలగ్రహదోష యంత్రము, పిశాచ బంధనము, మారణయంత్రము, సకలజన వశీకరణ మంత్ర యంత్రములు మొదలగు పెక్కు మంత్రములును, యంత్రములును ఆచరణా విధానములును ప్రతివారికి సులభముగ బోధపడునట్లు వ్రాయబడెను.

మరుచుటకు వీలులేని విశేష మహాత్మ్యముగల యీమంత్ర శాస్త్రమును తిరిగి ఆంధ్రదేశములో విశేష ప్రచారమునకు తెచ్చుటయే మా యభిప్రాయము. సర్వబాధలు, కష్టములు తొలగించుకొనుటకు యీ మంత్రములు మిక్కిలి వుపయోగమైనవి.

మిక్కిలి రహస్యములైన మంత్రములు, సాధించుటకు సులభములైనవి. వెల 2—00

# సాముద్రిక శాస్త్రము

మీ భవిష్యత్తును తెలుసుకొనదలచినచో యీ హస్తసాముద్రిక శాస్త్రమును చదువుడు. అరచేతియందుండు రేఖల ఫలితములను తెలుపునపుడే హస్తసాముద్రిక మనబడును. అనేక తాటియాకుల గ్రంథములను పరిశోధించి వ్రాయబడినది.

ప్రహ్లాదుడు, ఈశ్వరుడు, గరుడుడు, వరాహమిహిరాచార్యుడు మొదలగు వారు హస్తసాముద్రికమును గురించి చెప్పిన విషయములన్నియు యీగ్రంథములో వివరముగ తెలుపబడియుండెను. వెల 0—50

# కార్తీక పురాణము

పదునెనిమిది పురాణములలో చేరిన యీ కార్తీకపురాణము నెందరో ప్రకటించి యున్నారు. అట్టి గ్రంథమును మేము సులభశైలిలో వ్రాయించి సామాన్యజనులకు కార్తీకమహాత్మ్య మెట్టిదో తెలుసుకొనునట్లు చేయవలెనని వ్యయ ప్రయాసలకోర్చి ప్రకటించితిమి. ఈ గ్రంథమున సోమవారవ్రత విధానమును, అందువలన యెవరెవరు యేవిధముగ సద్గతుల గాంచిరో చక్కగ వర్ణింపబడినది. పుస్తకమును చదువ మొదలిడినచో కడపటి పుటవరకు చదువక విడువరు. ప్రతి హిందువుడు యీ గ్రంథమును చదువుటయేగాక యీ వ్రతమునుగూడ ఆచరించుట మంచిది. మంచికాగితముపై ముత్యములవంటి అక్షరములతో చక్కగ ముద్రింపబడినది. 128 పుటల గ్రంథము. 1—2[illegible]

**వలయువారు:— ఆంధ్రరత్న బుక్ డిపో., తెనాలి.**

ముద్రణ : ఆంధ్రరత్న పవర్ ప్రెస్, మారీసుపేట, తెనాలి.